# గ్రంథాలయ ప్రగతి

## [మొదటి భాగము]

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల అధ్యక్షోపన్యాసములు, తీర్మానములు

[ 1914 వ సం. నుండి 1926 వ సం. వరకు ]

సంపాదకుడు:

పాతూరి నాగభూషణం, డి. యల్. యస్‌సి.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము

పటమట :: విజయవాడ-6

1962

ఆంధ్ర గ్రంథాలయోద్యమ జనకులు

శ్రీ సూరి వేంకటనరసింహశాస్త్రి

శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య

గార్లకు

వాయు వెల్లవారికి నెట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడ నట్లు స్వాధీనము కావలయును.

ఉదక మెల్లవారికి నెట్లు సేవ్యమై యున్నదో
జ్ఞానమును నట్లు సేవ్యమై యుండవలయును.

సూర్య చంద్ర మండలముల తేజస్సు
ఎల్లవారికి నెట్లు సౌఖ్యప్రదముగ నున్నదో
జ్ఞానమును నట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును.

# పీఠిక

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము కొలదికాలములో తన స్వర్ణోత్సవమును జరుపుకొను ప్రయత్నములోనున్నది. ఈసంస్థ ఆనంద నామ సం. చైత్ర శుద్ధ పూర్ణిమ శుక్రవారమునకు సరియగు 1914 వ సం. ఏప్రిల్ 10 వ తేదీన బెజవాడ పట్టణమున శ్రీ రామ మోహన ధర్మ పుస్తక భాండాగారమువారి ఆధ్వర్యమున సమావేశ మైన ప్రథమ ఆంధ్ర దేశ గ్రంథభాండాగార ప్రతినిధుల మహాసభ వారి తీర్మానముద్వారా స్థాపించబడినది. ఈ సంఘము మొదట "ఆంధ్ర దేశ గ్రంథ భాండాగార సంఘము"గ ప్రారంభమై తదుపరి "ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము" గ మారినది. ఆంధ్రప్రదేశ్ అవతరణకు పిమ్మట ఇది "ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము"గ వ్యవహరించు చున్నది.

సంఘ స్వర్ణోత్సవ సందర్భమున గ్రంథాలయ సంబంధమైన ప్రచురణలు కొన్నింటిని వెలువరించు సంకల్పము మాకు కలిగినది. దీనికి ప్రాతిపదికగ ప్రస్తుత గ్రంథమును ముందు లోకమున కందజేయ బూనినాము. దీనిలో 1914-1926 సంవత్సరముల మధ్య ఆంధ్ర దేశము నందలి వివిధ ప్రాంతములలో జరిగిన గ్రంథాలయ మహా సభల అధ్యక్షోపన్యాసములు, ముఖ్యమైన తీర్మానములు చేర్చినాము. వీటిద్వారా ప్రథమదశలో ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమపు తీరు తెన్నులు కొంతవరకు బోధపడగలవు. ఆనాటి ఉద్యమ సమస్యలు ఆకళింపునకు రాగలవు. నేటి గ్రంథాలయ కార్యకర్తల కివి కొంత ఉత్తేజమును సమకూర్చగలవు. ఇది మా ఆశయము.

ఆంధ్రగ్రంథాలయోద్యమము, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘముల చరిత్రను లోగడ మేము ప్రచురించిన 'ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమము' ద్వారా సంగ్రహముగ వెల్లడించియున్నాము.

స్వర్ణోత్సవము నాటికి విపులమైన చరిత్రను వెలువరించు ఆలోచన మా కున్నది. కనుక ఈ గ్రంథములో హెచ్చు వివరముల నొసగుట లేదు. ఈ పుస్తకము రెండు, మూడు భాగములనుకూడ త్వరలోనే వెలువరించుట మా యుద్దేశము. రెండవభాగములో 1926-1942 సంవత్సరముల మధ్య నడచిన ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలయు, మూడవభాగములో ఆదినుండి 1942 వ సంవత్సరము వరకు వివిధ స్థలములలో జరిగిన ప్రాంతీయ, జిల్లా, తాలూకా మహాసభలయు అధ్యక్షోపన్యాసములు, తీర్మానములు మాకు దొరికినవరకు చేర్ప ప్రయత్నింతుము.

దీనిలో చేర్చిన తీర్మానములను విషయమును బట్టి విభజించినాము. ఒక్కొక్క తీర్మానముక్రింద ఆ తీర్మానమును చేసిన సంవత్సరము, మహాసభ సంఖ్య (రోమను అంకెలో), తీర్మాన సంఖ్య వరుసగ ఇచ్చినాము. ఉత్సుకుల కుపయోగపడునట్టియు, ఉద్యమ చరిత్రను మరికొంత వివరించునట్టియు ముఖ్యమైన భాగట్టాను అనుబంధములలోచేర్చినాము. మొదటి 10 మహాసభల సంగ్రహావృత్తాంతమును మొదటి అనుబంధములోను, సంఘమున కాదిలో ఏర్పడిన నియమ నిబంధనలను రెండవ అనుబంధములోను, 1914-26 సంవత్సరములమధ్య సంఘ ప్రధాన నిర్వాహకులుగ నున్నవారి పేర్లను, ఆ కాలములో సంఘపక్షమున వెలువడిన ప్రచురణల వివరములను 3, 4 అనుబంధములలోను ఇచ్చినాము. 5 వ అనుబంధములో దీనిలో ప్రచురించిన ఉపన్యాసములుచెప్పిన పెద్దలను పరిచయము చేసినాము. మహాసభల కధ్యక్షత వహించిన ఈ పెద్దల పటములనుకూడ పుస్తకములో చేర్చినాము.

## అంకితము

ఆంధ్రగ్రంథాలయోద్యమమునకు మూలపురుషులు శ్రీయుతులు అయ్యంకి వేంకటరమణయ్య, సూరి వేంకటనరసింహశాస్త్రి. వీరుభయులు కలసి జరిపిన కృషి ఫలితముగనే ప్రథమ ఆంధ్రదేశ

గ్రంథభాండాగార ప్రతినిధుల మహాసభ బెజవాడలో జరిగినది. ఈ సభ మూలముననే ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘమేర్పడినది. ఇదియు వీరి నిరంతరాయమగు ప్రచార ఫలితముగనే దినదినాభివృద్ధి చెంది దేశములోని వివిధప్రాంతములకు విజ్ఞానపు వెలుగును విస్తరింప జేసినది. కనుక ఆంధ్ర గ్రంథాలయోద్యమమునకు, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకుకూడ జనకు లనదగిన ఈ పెద్ద లిరువురకు ఈ గ్రంథము నంకితమిచ్చుట సమంజసముగ తోచినది.

## కృతజ్ఞత

ఈ గ్రంథ నిర్మాణములో మాకు సాయపడిన రచనల వివరములను ఒక్కొక్క ఉపన్యాసము చివర సూచించి యున్నాము. హెచ్చుభాగము ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ ప్రచురణలనుండియే సేకరించినాము. 9, 10 మహాసభల వృత్తాంతమును మాత్రము ధర్మ గ్రంథాలయ పత్రికనుండి సంగ్రహించినాము. కనుక ఈ పత్రిక సంపాదకులగు శ్రీ యాతగిరి లక్ష్మీవేంకటరమణగారికి ముందు మేము కృతజ్ఞతను తెలుపవలసియున్నది. వీరికి తరువాత తెలుగు భాషా సమితి వారు మా కృతజ్ఞతకు హెచ్చుపాత్రులు. వీరు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వము – 3 వ సంపుటమునుండి మహాసభల అధ్యక్షులను గూర్చిన వివరాలు కొన్ని మేము సేకరించుకొన్నాము. కాక మేము కోరినంతనే వీరు దిగువ పెద్దల పటములను మాకు సరఫరాచేయుచు, వీనిని మా గ్రంథములో చేర్చుకొనుట కనుమతిని దయచేసినారు. శ్రీ మోచర్ల రామచంద్రరావుపంతులు, శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహము, శ్రీ పానుగంటి రామారాయనింగారు, శ్రీ భూపతి రాజు వేంకటపతిరాజు, శ్రీ విక్రమదేవవర్మ, శ్రీ చిలుకూరి వీర భద్రరావు, శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, శ్రీ వేమవరపు రామ దాసుపంతులుగార్లు. శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారి జీవిత విశేషము లను వీరి కుమారులు డాక్టరు గద్దె రామచంద్రమూర్తిగారు, వీరి

పటమును వీరి అల్లుడు శ్రీ గుళ్లపల్లి శ్రీరాములుగారు మాకందజేసినారు. శ్రీ సూరి వేంకటనరసింహశాస్త్రిగారిని గురించిన వివరాలను మాకు వీరి కుమారులు శ్రీ సూరి కృష్ణమూర్తిగారు, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు తెలిపినారు. వీరి పటమును విజయవాడ రామమోహన లైబ్రరీవారు మా కెరువిచ్చినారు.

ఈ విధంగా మాకు సాయపడిన వీరందరికీ పేరుపేరున మేము మా వందనములను తెలుపుకొనవలసియున్నది. ఈ గ్రంథప్రచురణలో మా కన్నివిధముల తోడుపడిన పటమటలంక సర్వోదయ ముద్రణాలయమువారియు, దీనిలోని పటములకు బ్లాకులను చేసియిచ్చిన స్వతంత్ర కన్సరన్స్‌వారియు సాయముకూడ తక్కువైనది కాదు. కనుక వీరికికూడ మేము మా హృదయపూర్వకమగు కృతజ్ఞతను తెలియ జేయుచున్నాము.

పాతూరి నాగభూషణం
కార్యదర్శి
ఆం. ప్ర. గ్రం. సంఘము

శ్రీ సర్వోత్తమభవనము
విజయవాడ-6
3-12-1962

# వి ష య సూ చి క

## ౧. ఉపన్యాసములు



## ౨. తీర్మానములు

## ౩. అనుబంధములు

# పటముల పట్టిక

# సవరణల పట్టిక

[చదువరు లీ పుస్తకమును చదువుటకు ముందే దిగువ సూచించిన సవరణల నాయా పుటలందు సరిచేసికొన దగును.]

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౯ | ౬ | సితి | స్థితి |
| ౫౫ | ౧ | జిలాల స్థితి | జిల్లాల స్థితి |
| ౭౪ | ౨౬ | ద్రావిడి | ద్రావిడ |
| ౮౮ | ౧౩ | మాండేగ్యు | మాంటేగ్యు |
| ౯౪ | ౧౬ | మొనంగు | మొసంగు |
| ౯౭ | ౭ | కలుగు | కలుగ |
| ౯౯ | ౨ | రును. | రును, |
| ౧౦౧ | ౬ | బంపెను. | బంపెను.” |
| ౧౦౨ | ౧౮ | కన్పట్టదు | కన్పట్టదు. |
| ౧౦౬ | ౪ | సలిపినిగాని | సలిపినగాని |
| ౧౦౭ | ౧౨ | మహేంద్ర | మహేంద్రపుర |
| ౧౧౧ | ౧౦ | మనోబావములు | మనోభావములు |
| ౧౧౫ | ౧౨ | కాని పత్రికలో | పత్రికలో |
| ,, | ౧౮ | చేయ | చేయు |
| ,, | ౨౩ | సూత్రిములు” | సూత్రిములు”. |
| ౧౧౬ | ౧౦ | హాలుఫైరు | హాలో! ఫైర్ |
| ౧౧౮ | ౨౩ | భద్రపఱచ   గి | భద్రపఱచ తగి |
| ౧౨౦ | ౧౯ | నిధులను | విధులను |
| ౧౨౬ | ౭ | మెండు బుట్టి | మొండు బుట్టి |
| ,, | ౨౫ | గ్రంథలయాది | గ్రంథాలయాది |
| ౧౨౭ | ౪ | నిర్మూలనముతో  టు | నిర్మూలనముతో పాటు |
| ౧౨౮ | ౧౬ | గుంటూరు, | గుంటూరు |
| ౧౨౯ | ౨౪ | యందును | యందు |
| ౧౩౧ | ౩ | కొనవా | కొనువా |
| ౧౩౪ | ౧౫ | పుదుకోట్టి | పుదుకోట్ట |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౩౬ | ౧౯ | ప్రతిష్ఠాపనుల | ప్రతిష్ఠాపనల |
| ౧౪౦ | ౨౬ | ,, | ,, |
| ౧౪౧ | ౧౩ | ప్రభుత్వవారు | ప్రభుత్వమువారు |
| ౧౪౩ | ౭ | సహాకౌద్యమమును | సహాకారోద్యమమును |
| ,, | ౧౩ | విశ్వవిద్యాలముల | విశ్వవిద్యాలయముల |
| ,, | ౧౭ | గ్రంథాలయోద్యను | గ్రంథాలయోద్యమ |
| ౧౪౭ | ,, | రొరతనమువారిని | దొరతనమువారిని |
| ౧౫౮ | ౯ | ఉపాగ్రసనాధిపతులుగను, | ఉపాగ్రాసనాధిపతులుగను, |
| ౧౬౨ | ౮ (దిగువ) | | 1918 v 8 (చేర్చవలెను) |
| ౧౮౧ | ౨ | ఆధ్రదేశ | ఆంధ్రదేశ |
| ౧౮౪ | ౧౮ | చంచా | చందా |
| ౧౮౯ | ౨౯ | సభ్యుడుగాను | సభ్యుడుగను |
| ౧౭౩ | ౧ | 919 | 1919 |
| ,, | ౨ | రౌద్ర | రౌద్రి |

గ్రంథాలయములను ప్రతి గ్రామమునను స్థాపించి తద్వారా దేశమున ప్రజలను జ్ఞానవంతులుగా నొనరించవలయుననే సంకల్పమే గ్రంథాలయోద్యమము.

తాను బాగుపడి తోడివారలను బాగుచేయవలె ననెడి మనుజ నైజమే యీ యుద్యమమునకు కారణము.

*

మనుజుని జ్ఞానవంతునిగా నొనరించి జీవయాత్ర పవిత్రముగను, పురుషార్థప్రాప్తి సాధనముగను జేయుటయే యీ యుద్యమముయొక్క ప్రాప్యము.



శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం



శ్రీ మోచర్ల రామచంద్రరావు

# ప్రథమ ఆంధ్రదేశ గ్రంథభాండాగార ప్రతినిధుల మహాసభ, బెజవాడ

[1914 ఏప్రిల్ 10]

## శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం

ఆంధ్రోద్యమము

దేశాభిమానులగు మీ యందఱి సహాయముచేతను, నూతనముగ నల్పకాలము క్రిందట దలయెత్తినను సర్వాంధ్ర మహాజనుల హృదయములయందును సుస్థిరముగ బాదుకొని, మోడుచెట్లకు సయితము జిగురాకు టలంకారము లొసంగు వసంతకాలమువలెనే జీర్ణశల్యములుగల పురాణ శరీరములకు సయితము నవనవ చైతన్యము గలిగించుచు జాత్యంధులకు సయితము భావి కాలగర్భమున నున్న మహాదశలం గనబఱచుచు గుంటివాండ్రచే సయితము దీర్ఘప్రయాణముల చేయించుచు నాలుగక్షరములైన గూడబలుక లేని యప్రౌఢులచే సయితము లలిత వాగ్గుంభనలతో నిండిన యుపన్యాసముల జేయించుచు శతముఖంబులు గలిగి సహస్రదీపికలు గలిగి యాంధ్రమండల మహాకాశమునందు దేదీప్యమాన ప్రభలతో భాసమానంబగుచున్న యాంధ్రోద్యమ మహాతేజముయొక్క విస్ఫులింగ మొకటి నాహృదయమునం బ్రవేశించి నాకుత్సాహము గలిగించుటచేతను, నే నీకార్యము నేదో విధముగ నిర్వహింపవలెనని యించుక ధైర్యము నాకుగలుగుచున్నది. ఈ యాంధ్రోద్యమముయొక్క యధిష్ఠాన దేవత కామరూపిణి. అనంతశక్తి గలదగుటచే ననంతావతారము లెత్తగలదు. దేశీయ మహాసభను దమ పట్టణమునకు రావించి తగు సన్నాహముజేసి సమర్థముగా దానిని నిర్వహింపవలయునని విశాఖపట్టణ వాసులకు గలిగిన మహోత్సాహము మన యాంధ్రోద్యమముయొక్క యవతారమే. కొవ్వూరు పురవాసులకు తమ పట్టణమున గీర్వాణ పాఠశాలా సంస్థా

పనము జేయవలయునని పొడమిన సంకల్పమాంధ్రోద్యమావతారమే. నేడు బెజవాడలో నాంధ్ర గ్రంథభాండార మహాసభ జరిగింపవలయునని మీరుచేసిన యీసదుద్యమ మాంధ్రోద్యమావతారమే. సూర్యోదయంబునకు బూర్వమందు దూర్పుదిక్కున యరుణరేఖలు బిమ్మట నరుణ ప్రభాపుంజము జనిష్యమాణ మండలముయొక్క చిహ్నములం జూపునట్లు జనియింప బోవుచున్న మహాంధ్రోద్యమముయొక్క సూచనలను 'విజ్ఞానచంద్రికా గ్రంథమండలి', 'ఆంధ్రభాషాభివర్ధని', 'ఆంధ్ర ప్రచారిణి', 'వేగుచుక్క' మొదలగు గ్రంథమండలులు, రాజమహేంద్రవరమున, మచిలీపట్టణమున బొడసూపిన జాతీయ విద్యాలయములు, దత్తమండలములో నేటేట జరుగుచున్న సంఘ సంస్కరణ మహాసభ గూఢముగ తెలియజేసియుండెను. దేశముయొక్క భూతభవిష్యద్వర్తమాన స్థితుల నెఱుంగగల జ్యోతిశ్శాస్త్ర వేత్తలుండిన పక్షమున వారాంధ్రోద్యమముయొక్క జాతకము వ్రాసి చూచిన పక్షమున నా మాటలు యథార్థములని వారు తెలిసికొనక పోరు.

### జాతకము

ఆంధ్రదేశ జాతకము సంపూర్ణముగ మారిపోయినది. గ్రహములుచ్చస్థానముల యందున్నట్లు పొడసూపుచున్నయది. సింహ, కుంభ వృషభాది రాసులతో బాటు గ్రంథరాసులుకూడ బలుతావులయందు గానబడుచున్నవి. ఈ రాసులలో విద్యానిధియైన గురుడు యథేచ్ఛముగ సంచరించుచున్నట్లు ద్యోతకమగుచున్నది. దేశ జాతకములో వృషభరాసికంటెను, సింహరాసికంటెను, గ్రంథరాశి యుండవలెను.

### ప్రాచీనచరిత్ర

పూర్వకాలమునందు నాగరికతగన్న సమస్తదేశముల యందును గ్రంథరాశి తప్పక యుండితీరినది. ఆశియాఖండము నాగరికతకెల్లనుయ్యాలయై పేరు వహించెను. క్రీస్తుశకమున కనేకసంవత్సరములకు బూర్వమం దస్సీరియా దేశమునం దాకాలపు గ్రంథములన్నియు

మంచిపలకలమీద లిఖించి యీనాటి నాగరికులకు సయితము మహా శ్చర్యము గలిగించువిధమున నొక గొప్పగ్రంథభాండాగారము నాదేశపరిపాలకులు జనుల యుపయోగార్థమై స్థాపించిరి. కాగితముల మీదగాని, తాటియాకులమీదగాని, భూర్జపత్రములమీదగాని వ్రాయుట యెఱుంగని యా యమాయకపు కాలములయందుగూడ లోకములయందు జ్ఞానతేజోవ్యాప్తికయి యాదేశ పరిపాలకులు, పండితులు బడిన శ్రమలు సకలవస్తు సామాగ్రిగల యీనాడు మనము స్మరించుకొన్నప్పుడు మనకేకకాలముననే యాశ్చర్య విషాదములు కలుగకపోవు. ఈ రాతిపలకల గ్రంథభాండాగారముయొక్క శేషము నేటికి సయితము దర్శనీయమై పశ్చిమఖండములలో నున్నది. ప్రాచీన కాలమున మిక్కిలి ప్రసిద్ధిగాంచినది యలగ్జాండ్రియాపట్టణమందలి గ్రంథభాండారము. ఇందు నాలుగు లక్షల సంపుటములు గలవట. ఆనాటి ప్రపంచమందలి సమస్తఖండములలో, సమస్తదేశములలో, సమస్తజాతులలో, సమస్తభాషలలో వ్రాయబడిన సమస్త గ్రంథములుగూడ నలగ్జాండ్రియా లైబ్రరీయందుండినవని పూర్వచరిత్ర కోవిదులు చెప్పుచున్నారు. అట్టి గ్రంథ భాండాగార మందొకభాగ మప్రయత్న పూర్వకముగ సీజరు చక్రవర్తిచేతను, దరువాత రెండవ భాగము ప్రయత్నపూర్వకముగ సారసిన్ సైన్య నాయకునిచేతను సర్వభక్షకుడగు నగ్నిహోత్రుని కాహుతిగ నొసంగబడినదట. ఆహాహా! ప్రపంచమునకెంత మహోపకారము జరిగినది. ఆ దినమున నెంత జ్ఞానము బూడిదయైనదో, ఎంత పండిత పరిశ్రమ మంటగలసిపోయినదో, రాజాధిరాజుల ధనమెంత దగ్ధమైపోయినదో, యెన్నివేల సంవత్సరముల యనుభవము కథావశేషమైనదో, యెంత విద్య నాశనమైనదో యెవడు చెప్పగలడు!

మనదేశము

అన్యదేశ భాండారముల బ్రశంసించుటచే మనదేశంబున గ్రంథ భాండార దారిద్ర్యమున్నదని మీరూహింపవద్దు. మన భాగ్య

దారిద్ర్యముచేత మన కన్నులకు నేడట్టి గ్రంథభాండాగారమగుపడుట
లేదు; కాని మనపూర్వులు గ్రంథనిధుల నిలుపక పోలేదు. బాబిలోని
యా రాష్ట్రము బయలుదేరక పూర్వమే, దాని రాజధానియగు శత
ద్వారపట్టణము నిర్మింపబడక పూర్వమే, గ్రీసుదేశము తలయెత్తక
పూర్వమే, రోము సామ్రాజ్యమునకు బీజములయిన నాటబడక
పూర్వమే, నేడు నాగరికాగ్రగణ్యు లనిపించుకొనుచున్న తెక్కిన
యూరపుఖండ వాసులు మృగములకు, మనుష్యులకు మధ్యస్థమైన
యవస్థను జెందియుండకపూర్వమే, ప్రపంచములో సమానవయస్సు
గల వేదంబులను, వేదాంత శాస్త్రమును, జ్యోతిశ్శాస్త్రమును,
వైద్యశాస్త్రమును గనిపెట్టి సకల విద్యలకు మార్గదర్శులయి మించిన
మన పూర్వులు జ్ఞాన ప్రచారార్థము లోకోపకారార్థము గ్రంథభాండా
రముల నిలుపుటలో నేజాతికైన దీసిపోయి వెనుకబడి యుందురా?
ఆదికాలమున బ్రాహ్మణుల దేవాలయంబులు, బౌద్ధుల విహారంబులు
జైనుల మఠంబులు సరస్వతీదేవికిం గొలువుకూటములై గ్రంథభాండా
రములకు నిలయములయ్యెను. అన్యదేశస్థులు మనదేశమునం దడుగు
పెట్టకమును పాభాండారములు దేశమునందలి నానా భాగములనుండి
చదువరుల నాకర్షించుచు జ్ఞానఫలంబుల నవలీలగ లభింపజేయు వృక్ష
వాటంబులయి, విజ్ఞానవాసనల దిగంతంబులకు వెదజల్లు నుద్యాన
వనంబులయి, యజ్ఞాన పిపాసచే శోషిల్లెడు విద్యార్థి పాంథులకు జల్లని
జ్ఞానామృతము నిచ్చి రక్షించు జలాశయములై మహోపకారము
లయ్యెను. అట్టివానిలో బ్రధానమైనది నాలందమఠము. ఇక్కడ
గొప్ప విశ్వవిద్యాలయముండెను. వేలకొలది విద్యార్థులక్కడ గురు
కుల వాసముజేసి విద్యాభ్యాసము జేయుచుండిరి. అక్కడ వేలకొలది
గ్రంథములుండెను. చదువునప్పుడు గలుగు సంశయముల దొలగించు
టకై మహామహోపాధ్యాయు లనేకులుండిరి. గురువులకు, శిష్యులకు
నన్నపానములకు, దగిన యేర్పాటులు బసలు చేయుటకు విడుదులు
జేయబడెను. ఇట్టి విశ్వవిద్యాలయము బ్రేలుమడిచి చూపుటకొక్కటి

మైన నాగరికత మితిమీరిపోవుచున్న యీ యిరువదియవ శతాబ్ద
మందైన గలదా? ఇట్టి నాలందమఠ గ్రంథభాండారమును సన్యా
సులు తమలోదాము తెగవులాడి పరశురామప్రీతి గావించిరట. ఆ
సన్యాసియెవడోకాని తాను సన్యాసియైనదిజాలక లోకమంతకుగూడ
శాశ్వతకాలము జ్ఞానసన్యాస మిప్పించెనుగదా! ఈతనికంటె పరమ
నీచుడు, దేశద్రోహి, లోకద్రోహి, ఈశ్వరద్రోహి, మానవద్రోహి
ప్రపంచమున నుండడు. మేడలు మిద్దెలతోనిండిన యొకగృహము
కాలిపోయిన మనము సహింపవచ్చును. ఒక యూరు కాలిపోయిన
నోర్వవచ్చును. కాని యొక గ్రంథము కాలిపోయిన మనమోర్వ
జాలము. ఒక్కొక్క గ్రంథము నా భాండారమునందు చేర్చుటకెవ్వ
రెవ్వరెంతెంత శ్రమపడిరో యచ్చుకూటములులేని యాకాలమున
నడుములు విరుగునట్లు, మొడగుల్లి పడిపోవునట్లు, చేతులరిగిపోవునట్లు
వ్రాయుట కెంతెంత కాలము పట్టెనో పరమేశ్వరు డెఱుంగవలయు.
ఇటీవల గ్రంథభాండారములు మహారాజుల యంతఃపురములయందు
ప్రతిష్ఠాపింపబడ జొచ్చెను. కాశ్మీర మహారాజ మందిరమున నిప్పటి
కిని గొప్ప గ్రంథభాండారము గలదు. భోజుని గ్రంథభాండారమతని
రాజ్యానంతరమున రాజ్యలక్ష్మితోబాటు శత్రురాజుల స్వాధీన
మయ్యెను. త్రిలింగరాజ్య లక్ష్మీధురంధరుడైన ప్రతాపరుద్రుని
కొలువుకూటంబునగాని, యాంధ్రభోజుడై విద్యానగర సామ్రాజ్య
పరిపాలనంబున నాచంద్రతారార్కసంస్థాయియగు కీర్తి సంపాదించిన
కృష్ణదేవరాయల హజానమునగాని గ్రంథభాండారములున్నట్లు
మనము చరిత్రలవలన వినలేదు. ఉండకపోవని నానమ్మకము. దక్షిణ
దేశంబున తంజాపురీ పాలకులగు తెలుగునాయకులు తమ రాజధానిలో
నాగరము, నందినాగరము, గాశ్మీరము, తెనుగు, కర్ణాటకము మొద
లగు లిపులతో వ్రాయబడిన గ్రంథములు పదియెనిమిదివేలవరకు
జేర్చి విద్యాపోషకులైరి. ఆ తంజాపురీ గ్రంథభాండారమునందే
మున్ను నష్టమైపోయినవని మన పండితులు తలంచిన నాచన సోమ

నాథుని హరివంశము, శ్రీనాథుని హరవిలాసము, రుద్రయకవి నిరం కుశోపాఖ్యానము మున్నగు గ్రంథములు దొరకినవి. అన్యదేశముల యందును, మనదేశమునందును బూర్వకాలము నందుండిన గ్రంథ భాండారముల నుగ్గడించినంతమాత్రమున ప్రయోజనమేమి?

ప్రస్తుతస్థితి

ప్రస్తుత కర్తవ్యముం జూడవలయును. హిందూదేశమున నిప్పుడు గ్రంథభాండారములు విశేషములుగ లేవు. గ్రంథభాండార ములయొక్క ప్రతిష్ఠాపనమును, నిర్వాహమును, మహాప్రయోజన మును, సంతతాభ్యుదయమును జూడవలెనన్న మనము పశ్చిమఖండ ముల కరుగవలయును. వినవలెనన్న నాయాదేశముల కేగినవారి నడుగవలయును. చదువవలెనన్న నక్కడి వృత్తాంత పత్రికల నరయ వలెను. ఏమి యా ధనికుల దాతృత్వము! ఏమి యా కార్యోత్సా హము! ఏమి యా యెడతెగని పూనిక! ఏమి యా జనులలోని శ్రద్ధ! ఏమి యా పరోపకారచింత! ఏమి యా దేశాభిమానము! అట్టి దేశం బులు వృద్ధిబొందకపోయిన మఱి యే దేశంబులు వృద్ధిబొందును?

పాశ్చాత్య దేశములు

పారిసు నగరమందలి గొప్ప గ్రంథభాండాగారములలో బ్రధాన మైనదానియందు ముప్పదిలక్షుల ముద్రిత గ్రంథములును, నొకలక్షు వ్రాతప్రతులును గలవు. లండను మ్యూజియమునందు నిరువదిలక్షుల ముద్రిత గ్రంథములును, నేబదివేలకంటె నెక్కుడు వ్రాతప్రతులును గలవు. నాగరికతయందు యూరపుఖండమందలి యెల్ల దేశములకు దీసిపోయిన మోటుదేశమగు రష్యాయందు సయితము, పీటరు చక్రవర్తిచేత స్థాపింపబడిన గ్రంథభాండారమునందు నిరువదిలక్షుల గ్రంథములకు దక్కువలేవు. అమెరికా ఖండముగూడ నిట్టి గ్రంథ భాండారములతో దులతూగుచున్నది. వాషింగ్టను పట్టణమందును, న్యూయార్కు పట్టణమందును నెలకొలుపబడిన భాండారములయం దిరువదిలక్షులకు దక్కువగాకుండ గ్రంథములున్నవి. ఈ దేశమా దేశ

మననేల ? హిందూదేశముతక్క తక్కిన దేశములన్నిటియందు సరస్వతీ నాట్యశాలలవలె గొప్ప మేడలలోను, భవనములలోను గ్రంథభాండారములు రాజిల్లుచున్నవి. అక్కడి భాండారములలో బాలురకు, బాలికలకు వినోదమును గలిగించు బొమ్మల పుస్తకములు, చిత్రకథావళులు గలవు. వారి యాటపాటలకు దగిన యేర్పాటులు గూడ గలవు. ఇట్లుండుటచేత వారి నిమిత్తమై యేర్పడిన గ్రంథనిధులకు బాలబాలికలు మిఠాయి యంగళ్ల కరిగినట్లె యరిగి జ్ఞానపు విందుల నారగించి సంతుష్టులయి గృహములకు జనుచుందురు.

ఆ దేశములయందలి పద్ధతులు

గ్రుడ్డివాండ్రు చదువుకొనుటకుగూడ నుబికిన యక్షరములుగల గ్రంథము లక్కడ దొరకును. ఆ యక్షరములను జేతులతో దడివి చదువుకొని జాత్యంధులు ధన్యులై చర్మచక్షువులు ప్రయోజనము లేకపోయినను జ్ఞానచక్షువులదెరచి జ్ఞానసంపాదనము జేసికొనుచుందురు. ఇట్లె యంత్రశాలలలో బనిచేయు కూలివాండ్రకు, దేహపరిశ్రమవలన జీవనము జేయు తక్కిన పనివాండ్రకు, యాచకులకు, జెఱసాలలో బంధింపబడిన ఖైదీలకుకూడ గ్రంథనిధు లేర్పడియున్నవి. ఈ గ్రంథ భాండార సంస్థాపనల నిమిత్తం కొందరు ధనమిత్తురు. కొందరు జీవనము ధారవోసి వానిని బ్రయోజనకారులుగ జేయుదురు. కొందరు పాటుపడి జ్ఞానహీనుల గృహంబులకు బలుమారుపోయి వారిని బ్రతిమాలి భాండారములకు దీసికొనిపోయి గ్రంథములంజూపి, చదివి వినిపించి యన్నమెరుంగని పసిబిడ్డల కన్నప్రాశనము జేసినట్లు రుచిలేనివారికి రుచిగల్పించి మృగములను మనుష్యుల జేయుచున్నారు. కొందరు గ్రామాంతరములకు బండ్లమీద పెట్టెలలో బెట్టి గ్రంథములను దీసికొనిపోయి ప్రతిగ్రామమునందు కొన్నిదినములుండి యా గ్రామముల జనులకు దుర్లభములైన గ్రంథముల ననాయాసముగ వారికి లభింపజేసి జ్ఞానాభివృద్ధి సేయుచున్నారు. ఇట్టి మహనీయులు మన దేశమునందొక్కరు గలరు.

బరోడారాజ్యము

ఏ మహారాజు గద్దెయెక్కినది మొదలుకొని యాత్మసౌఖ్యము కంటె ప్రజాసౌఖ్యమునే యధికముగ బాటించుచున్నాడో, ఎవడు నిగర్వచూడామణియై మాల మొదలుకొని మహారాజువరకు సమ దృష్టితో భావించుచున్నవాడో, ఎవ్వని ధనము, కాలము, లోకాను భవము, జీవము లోకోపకారార్థమై వినియోగింపబడుచున్నదో, ఎవ్వాని ప్రవర్తన లతని యుపన్యాసములకు వ్యాఖ్యానములై వర్ధిల్లుచున్నవో, ఎవని రాజ్యము స్వదేశ సంస్థాన రత్నహారమునందు నాయకమణియై యొప్పుచున్నదో యట్టి గైక్వాడు మహారాజే యీ మహనీయుడు. లోకప్రసిద్ధమైన యీతని చారిత్రము నిక్కడ వర్ణించుట సూర్య ప్రభను దీపసహాయముచే జూపుటయగును. ఈ మహారాజు తన దేశ మున ప్రతిగ్రామమున గ్రంథభాండారముల నెలకొలిపినాడు. అంతతో దనివినొందక చలద్భండారములను * నిలిపి విజ్ఞానబీజము లెల్లచోట్ల వెదజల్లుచున్నాడు. ఈ రాజశిఖామణి మార్గమును దక్కినరాజు లవలంబించిన పక్షమున స్వదేశ సంస్థానములు యూరపుఖండమందలి దేశములతో నైదు సంవత్సరములలో విజ్ఞానమునందు వియ్య మందవా? గ్రంథభాండారముల పేరెత్తినచోట్లనెల్ల శాయాజీగైక్వాడు యొక్క పవిత్రనామము స్మరణీయమగును.

ఆంధ్రదేశస్థితి

ఈతని మార్గమును దెనుగుదేశమందలి ధనవంతులు, జమీం దారులు శ్రద్ధగలిగి యవలంబించినచో వలలబరచినట్లు మన తెనుగు దేశమంతను గ్రంథభాండారములతో నింపివేయవచ్చునుగదా! గ్రంథ భాండారములయొక్క యావశ్యకత, వాని ప్రయోజనము మనవారి మనంబుల కింకను నచ్చలేదు. గ్రంథభాండారముల యావశ్యకత విచారింపకముందు మనదేశమునందలి విద్యాస్థితి నించుక విచారింప వలయు; మన దేశంబున గ్రామమున కొక్క పాఠశాలయైనలేదు.

* సంచార గ్రంథాలయములు

ఉన్నచోట్ల మూడవతరగతివరకు నున్న పాఠశాలలే మెండు. నాల్గవ తరగతివరకునున్న పాఠశాల లల్పసంఖ్యాకములు. అక్కడ వ్రాయుట, చదువుట, లెక్కలు వేయుట ప్రధాన విద్యలుగ నేర్పబడును. ఇప్పు డిప్పుడు కొంచెము కృషిశాస్త్రము, కొంచెము శారీరశాస్త్రము, కొంచెము వృక్షశాస్త్రము విద్యార్థియొక్క మనఃపాత్రము నందభిక రించుచున్నారు. ఇందువలన విశేష ప్రయోజనములేదు. ఆయా శాస్త్రములు తాము చదువుకొన్నారమని చెప్పుకొనుటకును, శాస్త్ర సంబంధమైన సాంకేతిక శబ్దములు కొన్ని నేర్చుకొనుటకును మాత్రమే యవకాశమున్నది గాన యీ పాఠములవలన మరియొక ప్రయోజనము గనబడదు. వృత్తాంత పత్రికలలో గొన్ని విషయముల మాత్రము స్వాయముగ జదువుకొనుటకు గొందఱి కీ పాఠశాలలవలన నవకాశము గలుగుచున్నది. వేదాంత శాస్త్రములు, ప్రకృతి శాస్త్రములు నేర్పు వారు లేరు. నేర్చుకొనువారు లేరు. అట్టి గ్రంథములు చదువుకొన దలచినను పట్టణములలోనె దుస్సాధ్యములగు నవి కుగ్రామములలో సాధ్యమగునా? సాధ్యముకానపుడు వారు మనుష్యులయ్యు జ్ఞానమున మృగములని చెప్పుట కేవిధమైన సందేహమైన గలదా?

నిమ్నజాతు లెవరు?

నిమ్నజాత్యుద్ధరణము జేయవలసినదని గొంతులు బొంగురు వోవునట్లు సభలలో నుపన్యాసముల జేయుచున్నాము. ఎక్కడనో పట్టపరీక్షలయందు గృతార్థులయిన శాస్త్రబ్రహ్మచారులు తప్ప మన హిందూదేశ వాసు లందరుగూడ జ్ఞాన విషయమున నిమ్నజాతులేయని నా యభిప్రాయము. వీరి నందఱ నుద్ధరింపవలసినదే. అందఱ విద్యా వంతుల జేయవలసినదే. అందఱి చెవులలో జ్ఞానామృతము వోయ వలసినదే. అజ్ఞాన నిద్రనుండి యందఱ మేలుకొలుప వలసినదే. ఉద్ధ రించుట యెట్లు? మేలుకొలుపుట యెట్లు? ప్రతి గ్రామమున గవర్న మెంటువారుగాని, బోర్డువారుగాని, గ్రామస్థులుగాని, పాఠశాలను

స్థాపించిన మాత్రమున వారుద్ధరింపబడుదురా? వీలులేదు. ప్రతి గ్రామమున ప్రాథమిక పాఠశాలలేగాని మధ్యమ పాఠశాలలు, నున్నత పాఠశాలలు గవర్నమెంటువారుకాని, మనముగాని స్థాపింప జాలము. ప్రాథమిక పాఠశాలలలో మిడిమిడి జ్ఞానముతప్ప నధిక శాస్త్రజ్ఞానము కలుగదు. మధ్యమోన్నత పాఠశాలల స్థాపించుట ద్రవ్యైకసాధ్య మగుటచే దుర్లభము. ఇట్టి యనుపపత్తులలో నజ్ఞానమహాప్రవాహము నంబడి కొట్టుకొని పోవుచున్న మన విద్యాహీన సోదరులను గ్రంథ భాండారములే తెప్పలై తేల్చి బ్రతికించి దరిజేర్చుగాక!

భాండారోపయోగములు

గ్రంథ భాండారములయొక్క యుపయోగములనుగూర్చి నేను మీయెదుట విశేషముగ నుపన్యసింప నక్కరలేదు. గ్రంథముల వలన నుపయోగము లేదనికాని, జ్ఞానసంపాదన మనావశ్యకమనిగాని వితండ వాదములు జేయువారు మనలోనుండరు. గ్రంథములనగా మహాపురుషుల చిరకాలానుభవములు. మహోన్నతచిత్తుల విజ్ఞానములు. మనుష్యులకు గ్రంథములవంటి మిత్రములుండుట యరిది. అవి మనల నెడబాయని మిత్రములు. మన సేమమునే గోరు మిత్రములు. సదాచారములే చేయించు మిత్రములు. సన్మార్గమందే నడిపించు మిత్రములు. తప్పుల దెలుపునట్టి మిత్రములు. ముఖస్తోత్రములు చేయనిమిత్రములు. ధనమిమ్మని పీడింపని చుట్టములు. గ్రంథములు తల్లికంటె, తండ్రికంటె, సోదరునికంటె మనకాప్తులు. గ్రంథములు సర్వకాలముల యందుండునట్టి మేఘములు. అవి మనుష్యుల మానస క్షేత్రముల మీద నీ కాల మా కాలమనక గర్జాడంబరములేక, పిడుగుల భయము గలిగింపక జ్ఞానవర్షము గురియించుచుండును. గ్రంథము చదువుట యనగా నా గ్రంథము రచియించిన కవితో గలిసి కొంతకాలము గడుపుట. వాల్మీకి మహాకవి రచియించిన రామాయణము మనము చదువ నారంభించితిమేని కొన్నివేల సంవత్సరముల క్రిందట కీర్తి శేషుడైన యీ మహాత్మునితో గొన్ని గడియలకాలము మనము

గడుపుచున్నారమని భావించుకొనవచ్చును. ఆ రామాయణమనియెడు గంగిగోవును జేరి యెన్నో నీతి క్షీరములను మనము పిదికికొని త్రాగవచ్చును. రామాయణ గోవునుండి బయలువెడలిన నీతిక్షీరములలోని యొకానొక బిందువును మీ కర్ణములలో వేయుచున్నాను. సీత రావణునిచేఁజిక్కి పోవుచున్నపుడు తన నగల మూటగట్టి సుగ్రీవాశ్రమమున బడవేయగా రామలక్ష్మణులు సీతాదేవిని వెదకికొనుచు ఋష్యమూకంబునకురాగా సుగ్రీవుఁడానగలను రామునకిచ్చెను. ఆ నగలు సీతవో కావో యానవాలు పట్టుమని రాముఁడు వానిని లక్ష్మణునకు జూపెను. అప్పుడు లక్ష్మణు డిట్లనియె.

"నాహం జానామి కేయూరే
నాహం జానామి కుండలే
నూపురే త్వభిజానామి
నిత్యం పాదాభివందనాత్."

ఆమె కేయూరము లెట్టివో యెఱుగను; కుండలము లెట్టివో యెఱుగను. ఆమె పాదములకు నిత్యము నమస్కారము జేయుచుండుటను బట్టి యామె యందెలు మాత్రము గుర్తింపగలనని యీ శ్లోకభావము. అన్నభార్య మాతృసమాన యను పరమనీతి వాల్మీకిమహాముని లక్ష్మణుని నోటినుండి యెంత మనోహరముగ, నెంత గంభీరముగ వెడలజేసెనో చూడుడు. రామాయణపు గనియందు దొరకునట్టి యమూల్యపు నీతిరత్నములలో నిదియొకటి. ఇందుగొన్ని యక్షరలక్షలు విలువగలవి యున్నవి. ఇట్లే మహాభారతాదులైన యితిహాసములయందును, గావ్య నాటకాదులయందును, వేనవేలుగలవు. ఇవి యెల్ల జనబాహుళ్యమునకు దెలియజేయవలయునన్న నెల్లచోట్ల గ్రంథభాండారము లుండవలయును. అందు దేశభాషలలోనున్న సమస్త గ్రంథములు నుండవలయును. పద్యకావ్యములు, గద్యకావ్యములు, నాటకములు, ప్రకృతి శాస్త్రములు, జ్యోతిషశాస్త్రములు,

గణితశాస్త్రములు, రాజకీయ గ్రంథములు, దేహారోగ్య బోధకములైన గ్రంథములు, వేదములు, స్మృతులు, పురాణములు, గ్రంథభాండారము నలంకరింపవలయును.

దాతల ధర్మము

కొన్ని వందల రూపాయలుకాని, కొన్ని వేల రూపాయలుకాని వ్యయముజేసి ప్రతి మనుష్యుడు గ్రంథభాండారము సంస్థాపింపజాలడు. గ్రామమున కొక గ్రంథభాండారమున్న పక్షమున నది సర్వజన సులభమై, జ్ఞానప్రదాయినియై వెలయుచుండును. అట్లు సంస్థాపించుటకై మహాదాతలు బయలుదేఱవలయును. మన దేశమున దాతలకు వెలితియా? తన మాట నిలుపుకొనుటకై సామ్రాజ్య విభవమునంతయు గోలుపోయిన హరిశ్చంద్ర చక్రవర్తి రాజ్యముచేసినచోట, నిచ్చెద నన్న దానమిచ్చి రాజ్యభ్రష్టుడయి స్వార్థత్యాగము జేసిన బలి చక్రవర్తి యేలినచోట, తన వినాశనంబునకైన నొప్పుకొని సహజ కవచకుండలంబులు నిచ్చివైచిన కర్ణుడుండినచోట, దాతృత్వమునకు కలియుగ కర్ణుండని పేరువడసిన రాయన భాస్కరుడుండినచోట దాతృత్వమునకు గొఱతయగునె? హిందువుల దాతృత్వమును కాశీ రామేశ్వర మధ్యగతములైన మహా సత్రములు చాటుచున్నవి. దేవాలయములు ప్రకటించుచున్నవి. దాతృత్వమున హిందువు లేజాతికి దీసిపోరు. కాని కాలోచితముగ దానములు చేయుట వారి కింకను దెలియదు.

జ్ఞాన సత్రములు

అన్నసత్రములు వేయవలసిన కాలముపోయినదని వారు తెలిసికొనవలయును. అన్నసత్రములకు మారుగా జ్ఞానసత్రములు వేయవలయునని వారు కొలదికాలములోనే నేర్చుకొందురుగాక! ఈ కాలమున నన్నాతురులకంటె జ్ఞానాతురులెక్కుడగుచున్నారు. జ్ఞాన సత్రములనగా గ్రంథభాండారములు, పాఠశాలలు. అన్నదాన ఫలముకంటె జ్ఞానదాన ఫలమధికము. ఒక్క జాములో నరిగిపోవునట్టి యన్న

మును దానము జేసినందుకే యమేయ ఫలము గలుగుచుండగా, మానవుని మనంబున శాశ్వతముగ నిలిచియుండి యితరులకిచ్చినను నెంతమాత్రము దరిగిపోక దినదినప్రవర్ధమానమగు జ్ఞానమును దానము జేయుటవలన నెట్టి ఫలము గలుగునో వేయి నాలుకలుగల యాదిశేషుడు వర్ణింపగలడుగాని నావంటి కించిజ్ఞుడు వర్ణింపజాలడు. అన్నసత్రముల నిమిత్తమై ధాన్యముదెచ్చి యెన్ని పాణకలలో బోసినను గ్రమక్రమంబుగ నవి తరిగిపోవును. జ్ఞాన సత్రముల నిమిత్తమై గ్రంథంబులనియెడు పాణకలలో, గాదులలో నక్షరంబులనియెడు ధాన్యంబు లెన్నిపుట్లు మీరు పోసినను నవి యెన్నటికిందరుగవు.

సరస్వతీదేవి యాలయము

హిందువులు దేవతాభక్తి మెండుగ గలవారు. అట్టి భక్తిచేత వారు శివకేశవాలయంబులంగాక గౌరికి లక్ష్మికిగూడ వక్కడక్కడ నాలయంబుల గట్టించియున్నారు. కాని సరస్వతీదేవికెందును దేవాలయంబులు గట్టించియుండలేదు. సకల కళలకు, విద్యలకు నధిష్ఠాన దేవతయైన యా మహాదేవికి దేవాలయంబులు దేశంబున లేకపోవుట మిక్కిలి శోచనీయము! అట్టి దేవాలయంబులు ప్రతి గ్రామమున నుండవలయును. గ్రంథభాండారములను నిలుపునట్టి గృహములే యా దేవాలయంబులు. ఇందు సరస్వతీ విగ్రహము శిలారూపమై యుండక గ్రంథరూపమై యుండును. భాండార కార్యదర్శియే యా దేవాలయమున కర్చకుడు. గ్రంథపఠనమునకయి నిత్యమరుదెంచు జనులే భక్తులు. జ్ఞాన సంపాదనమే యా దేవాలయ సేవవలన గలుగు ఫలము. ఈ యాలయమెన్నడు మైలపడక సంప్రోక్షణల్లు గోరక నిత్యము పవిత్రమై యెల్లవారలకు సేవ్యమై యుండును. గ్రంథరూపిణి యైన యా సరస్వతి పతితపావనయై వరలుచుండును. పెద్ద గ్రామముల యందిట్టి దేవాలయములు రెండుమూడున్నను మిక్కిలి మంచిది. మనవారికమీద నితర దేవాలయములు కట్టించునట్టి యుత్సాహము గొంతవరకు తగ్గించి బహుజన సేవ్యములు, మహా ప్రయోజనకర

ములు నగు గ్రంథభాండారదేవాలయములు గట్టించుటకే తమ ద్రవ్యము వినియోగింపవలయునని ప్రార్థించుచున్నాను.

రాజసహాయము

ఈ విధముగ మనము స్వయంసహాయ మూలమున గ్రంథ భాండార సంస్థాపనము జేసికొనవలయును. స్వయం సహాయమున్న వారికి దైవసహాయముగూడ గలుగును. లోకోపకారములైన కార్యములు మన స్వయంసహాయమున ముందు బయలుదేరిన పక్షమున బిమ్మట దైవసహాయమును, దానితోబాటు రాజసహాయమును గలుగవచ్చును. రాజసహాయ మనగా గవర్నమెంటువారు మన కిచ్చునట్టి దానములు. విద్యావిషయమై గవర్నమెంటువారిప్పుడు లక్షోపలక్షలు వ్యయము జేయుచున్నారు. ప్రతి గ్రామమునందు బాఠశాలలు సంస్థాపించుచున్నారు. ప్రతి బాలునిచేత, బాలికచేత చదివింప యత్నించుచున్నారు. గ్రంథభాండారములుగూడ విద్యావ్యాప్తికి సాధనములె యగుటంజేసి దొరతనమువారు మన భాండారములకుగూడ ధన సహాయము జేయకపోరని నానమ్మకము. వారు స్వయముగ నిచ్చుటయగాక తాలూకా, డిస్ట్రిక్టుబోర్డులచేతను, మునిసిపాలిటీలచేతను భాండారములకు విరాళము లిప్పించెదరు. తాలూకాబోర్డులవారు గ్రామములలో నూతులు, చెరువులు త్రవ్వించి జనులకు జీవనాధారములు గల్పించుట యెంత ప్రధానకార్యమని భావించుచున్నారో గ్రంథభాండారములకు సహాయముచేసి జ్ఞానప్రదానము జేయుటగూడ నంతటి ప్రధానకార్యమని భావించెడు కాలమువచ్చును. మునిసిపల్ సభలు తమ పట్టణములలోనున్న గ్రంథభాండారములకు సహాయము జేయకపోవుట తప్పు. స్తంభములపైనున్న లాంతరులలో దీపములు వెలిగించుటయేగాదు వారి ధర్మము. పురజనుల శిరస్సులనియెడు లాంతరులలో జ్ఞానదీపంబుల వెలిగించుటయు వారి ధర్మమె. పట్టణమందలి చెత్త తుడిపించి వీధులు పరిశుద్ధము జేయుటయేగాదు వారి ధర్మము. పురజనుల యజ్ఞానమనియెడు చెత్తగూడ దుడిపించుట వారి పరమధర్మము.

గ్రంథభాండారములకు సహాయముజేయుటకు బ్రస్తుతమున్న మునిసిపల్ చట్టము కావలసిన యవకాశమిచ్చిన సరే. అట్లు ప్రస్తుత మవకాశము లేనిపక్షమున మనమందరము బట్టణములలో సభలుచేసి గ్రంథనిలయములకు సహాయము జేయుటకై పారిశుద్ధ్య సంఘము * లకు వీలుకలుగ జేయవలసినదని దొరతనమువారిని గోరుట కర్తవ్యము. అచిరకాలములోనె యిప్పటి మునిసిపల్ చట్టములో ముఖ్యములైన మార్పులు చేయబడునని వినుచున్నాము. ఆ మార్పులతో బాటుగ నీ మార్పుగూడ చేయనగునని మనము సత్వరముగ గవర్నమెంటువారికి తెలియజేయవలయును. ఇందువలన లాభముండక పోదని నా యభిప్రాయము. మనదేశమున గ్రంథభాండారములను వృద్ధిజేయుటకు గొన్ని మార్గములు గలవు.

ముందు చేయవలసిన పని

మన మందఱ మొక సంఘముగా జేరి సమర్థుడైన యొక పురుషుని గ్రామములవెంటబంపి, గ్రంథ భాండారములు లేనిచోట నవి స్థాపించుటయు, నిదివర కవియున్నచోట వానిని సముచిత స్థితిలో బెట్టుటకు బ్రయత్నించుటయు వానికి ముఖ్యకర్తవ్యముగ నేర్పరచుట సమంజసమని నాకు దోచుచున్నది. అమెరికా ఖండమునందును, యూరపుఖండమునందును, మనదేశమందలి బరోడా సంస్థానమందును గ్రంథభాండార విషయమున జరుగుచున్న యత్యద్భుత ప్రయత్నములను మన యాంధ్రదేశస్థులకు దెలియ జేయుటకై యొకపత్రిక స్థాపించుటగూడ యవశ్యమని తోచుచున్నది. ఇవి ద్రవ్యైక సాధ్యములు కావున భాగ్యవంతులు వీనికి బూనుకొననలయును. చెరువులును, నూతులును నున్నట్లె ప్రతిగ్రామమున గ్రంథ భాండారములుండి తీరవలెను. అటులుండుటచేత జనులు జ్ఞానవంతులగుటయేగాక నీతిమంతులుగూడనగుదురు. పొద్దుపోవక పులిజూదంబులాడి యుబుసుపోవక పుక్కిటి పురాణంబులం జెప్పుకొని కాలము పాడుచేయునట్టి జనులు

* మునిసిపాలిటీ

గ్రంథ కాలక్షేపము జేయుదురు. చేతినిండ పనిలేక నిరంతరము కోర్టు లకు, న్యాయవాదుల యిండ్లకు పక్షులవలె దిరుగునట్టి వాది ప్రతివా దులకు, సాక్షులకు గొంతవరకీ గ్రంథ భాండారములు మంచి పని కల్పింపవచ్చును. ఇవిగాక యింకననేకోపయోగములుగలవు. కావున మీరందఱు శ్రద్ధాళువు లయి మీమీ గ్రామములందు గ్రంథ భాం డార సంస్థాపన విషయమై గట్టి ప్రయత్నములు చేయవలయును. ముందుగా బీరువాలు, బంగళాలు లభింపక పోవచ్చును. అంతమా త్రముచేత నిరుత్సాహులు కా నక్కఱలేదు. అల్పారంభములచేతనే ఘనకార్యములు సాధింపబడును. దేవదారు చెక్కలపెట్టెలో నేవోపది పుస్తకములు పెట్టి మీ మీ గ్రామంబులలో గ్రంథభాండారముల నెల కొల్పుడు. ఆ పది పుస్తకములె కాలక్రమమున శతగుణంబుగ, సహ స్రగుణంబుగ వృద్ధిగాంచును. ముందు సంవత్సరము మనము కలిసి కొనునపుడు నే డిక్కడకువచ్చిన ప్రతినిధులందఱు గత సంవత్సరము లో దాము తమతమ గ్రామములందు జేసినపని సగర్వముగా సభలో విన్నవించుటకై వత్తురని నేను తలంచుచున్నాను. మన మిక్కడ చేరినది విందుల నారగించుటకుగాదు. పదిమంది తోచినలాగున బలికి పోవుటకుగాదు. గ్రంథభాండార సంస్థాపన దీక్ష వహింపవలయును. అట్లు దీక్షితులయి మీరందరు దీక్షాకంకణముల గట్టుకొని యీశ్వర ముఖంబుచూచి యజ్ఞానాంధకార నిమగ్నులయి కనులుగానకయున్న మూర్ఖజనుల యవస్థంజూచి నడుము కట్టుకొని పనిచేయవలయును. మా పూర్వులు మహానాగరికులు, మాతాతలు లోకైక పూజ్యులు, మాపెద్దలు లోకమునకు మార్గప్రదర్శకులు, మాయార్యులు జగదేక వంద్యులునని గర్వించి ప్రాచీనుల గొనియాడుకొనినంత మాత్రము చేత నేవిధమైన లాభములేదు. వారి నాగరికత, వారి యౌన్నత్యము వారి ప్రఖ్యాతి మనము నిల్పినప్పుడే యీ గర్వమునకు బాత్రులమగు దుము. కాని దానిని నిలుప లేనప్పుడు, వారి మార్గమనుసరింప జాల నప్పుడు వారి సంతతివార మనిపించుకొనుటకె మన మనర్హుల మగు

దుము. మీ జ్ఞాన నేత్రంబుల నొక్కసారి లోకముయొక్క నాలుగు ప్రక్కలకు ద్రిప్పుడు. నలుదెసలం బరికింపుడు. అమెరికా ఖండ వాసులు, యూరపుఖండవాసులు, మన ఖండంబున నున్న జపానీయులు నాగరికులయొక్క గమ్యస్థానములంగూర్చి నిరంతర ప్రయాణంబుల నెట్లరుగుచున్నారో చూడుడు. మన పెద్దలు మొట్టమొదట ప్రయాణము చేసిన వారైనను వార్ధక్యముచేత వెనుకబడి పోయిరి. ఆ పశ్చిమ ఖండవాసుల వెనుకనైనను మన మిప్పుడు నడిచి గమ్యస్థానము జేరుటకై ప్రయత్నింపవలయును. కావున లెండు. లెండు. మీ మీధర్మంబులు నిర్వర్తింపుడు. కాలము మిక్కిలి విలువగలది. లక్షోపలక్షలు, కోటానుకోట్లు ధనము వ్యయమయిపోయినను మరల మనము సంపాదింపవచ్చును గాని నిమిషమైనను గాలము వ్యర్థమై పోయిన పక్షమున దానిని మరల మనము సంపాదింపజాలము. కావున గాలము వ్యర్థముగా గడుపక గ్రంథభాండారములను సంస్థాపింపుడు. గ్రంథములను జదువుడు. జనులచే జదివింపుడు. విద్యావ్యాప్తి జేసి పశ్చిమ ఖండవాసులవలె పంచభూతంబులను, విద్యుచ్ఛక్తిని మీ బంట్లుగ, మీ గులాములుగ జేసికొని వారిచేత సమస్త కార్యంబుల జేయించుకొనుడు.

వాయు వెల్లవారికి నెట్లు స్వాధీనమైయున్నదో జ్ఞానముకూడ నట్లు స్వాధీనము కావలయును.

ఉదక మెల్లవారికి నెట్లు సేవ్యమై యున్నదో జ్ఞానమట్లు సేవ్యమైయుండవలెను.

సూర్యచంద్ర మండలముల తేజస్సు ఎల్లవారికి నెట్లు సౌఖ్యప్రదముగ నున్నదో జ్ఞానమట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును.

— ఆంధ్రదేశ గ్రంథాలయ చరిత్ర. ౧౯౧౮ సం.ర వృత్తాంతమునుండి

# ద్వితీయ ఆంధ్రదేశ గ్రంథ భాండాగార ప్రతినిధుల మహాసభ, రాజమహేంద్రవరము

[ 1915 మే 9, 10 ]

## శ్రీ పానుగంటి రామారాయనింగారు

ప్రప్రథమమున లోకమున లిపి యేర్పడక మునుపు మానవులు తమ ప్రజ్ఞాబలముచే జ్ఞానమును సంపాదించి జ్ఞాననిధులై జిజ్ఞాసువు లగు నితరులకు దామెఱిగిన విషయముల సమయోచితముగ గఱపుచు లోకోపకారము చేయుచుండిరి. జ్ఞానమభివృద్ధికానుగాను నట్టి జ్ఞానము నశింపకుండుటకై జ్ఞానులు తాము సంపాదించిన జ్ఞానమును ఛందో బద్ధమగు భాషయందు నిలిపి స్థిరపఱచిరి. మన వేదాదు లట్టివి. వానిని మన ఋషులు తమ శిష్య పరంపరకు గఱపి ప్రపంచమున వ్యాపింప జేయుచుండిరి. చిరకాలానంతరము లిపి యేర్పడి జ్ఞానమును గ్రంథ స్థాపితమై సుస్థిరమయ్యె.

ఇట్లు జ్ఞానము లిఖిత గ్రంథస్థమైన యనంతరము నిట్టి గ్రంథ ము లరుదుగ దొరకుటచేత ప్రభువులు ప్రసిద్ధ దేవాలయములయం దును, దమ నగరుల సరస్వతీ నిలయములందును నట్టి గ్రంథముల సం పాదించియుంచి జనులకు జ్ఞానాధారమును గల్పించుచుండిరి. ఇదియె మన దేశమున బుస్తక భాండాగారముల కారంభము.

మన దేశమున నార్యస్వాతంత్ర్య ప్రభువులు ప్రభుత్వము చేయు చుండ భాండాగారములు క్రమక్రమముగా వర్ధిల్లుచుండినవి. తరువాత జైన, బౌద్ధులు ప్రబలి తమ మతములయందు మొదట తమతమ గ్రం థములను, బిమ్మట నితరగ్రంథముల సైతము సేకరించి గ్రంథభాండా గారముల నభివృద్ధి చేయుచుండిరి.

అనంతరము భరతఖండమున మహమ్మదీయ ప్రభువులు ప్రవేశింప మన దౌర్భాగ్య కృష్ణపక్షాంధతమసము దేశమంతయు నావరించె. గ్రంథభాండాగారము లంగారకున కాహుతులయ్యె. జ్ఞానాభివృద్ధికి హానిగల్గె. భాషలకు క్షైణ్యము సంభవించె.

అంత భారతీయభాగ్యవశమున నాంగ్లేయ ప్రభుత్వ మను శుక్లపక్షము ప్రారంభమయ్యె. ఆంగ్లేయరాజ్యము చల్లదనమున మాత్రము చందురునిబోలి వాని యస్థిరతి వహింపక సూర్యుని పగిది సుస్థిరమై, తేజోవంతమై, నిఖిల జీవనాధారమై, దేశీయ స్వాతంత్ర్య ప్రదాయకమై నాట నాటుకొని నానాట బలపడుచు వెలుంగుచుండుగాత!

గ్రంథభాండాగారముల పునరుద్ధానము చేయ సమయమువచ్చినది. మనదేశము మహమ్మదీయ ప్రభుత్వాంధకారమున మునిగి బలవత్సుషుప్తిని బొంది జీవచ్ఛవము పగిది నిర్వ్యాపారత నెందియుండు కాలమున నన్యదేశీయులు విజ్ఞానమందును, నాగరికత యందును, మనలదాటి ముందు మిగిలిపోయిరి. మనము మేల్కొని మనల మిగిలిపోయినవారిని బరువంటుకొన వలసియున్నది. ఇది ప్రబల ప్రయత్నమునగాని సాధ్యము గానేరదు. మన యదృష్టవశమున ప్రభుత్వమువారు మన కన్నివిధముల దోడ్పడనున్నారు. మన ముత్సాహ సమన్వితులమై ప్రయత్నింపదగును. దేశమున కొలదిమంది మాత్రము త్తమ జ్ఞానము సంపాదించుటవలన దేశాభివృద్ధి కలుగజాలదు. జనసామాన్యమునకు యథోచిత జ్ఞానముకలుగవలయు. వలయు గ్రంథభాండాగారముల స్థాపించి ముందడుగిడినారము. ఇక వెనుక తీయక, పట్టు విడువక మన ప్రయత్నమును గొనసాగించి కృతకృత్యులము గావలయు.

“విఘ్నైర్ముహుర్ముహురపి ప్రతిహన్య మానాః
ప్రారబ్ధ ముత్తమ గుణా న పరిత్యజంతి”

ఇట్టి గ్రంథాలయము లన్యదేశములందు మిగుల బ్రబలియున్నవి. వీనికిని, పూర్వకాలపు గ్రంథాలయములకును గొంత తారతమ్యము కలదు. రాకపోకలకు సులభములు కాని కాలమందెక్కడ నే గ్రంథము దొరుకునది యెఱుగుటయే దుస్తరముగ నుండినది. తెలిసిన యనంతరము నొక్కొక్క గ్రంథమునకయి యెంతెంత దూర ప్రయాణములో చేయవలసియుండె. అచ్చులేనందున బ్రచురము లేక యెన్నియో కష్టముల యనంతరము లభించిన గ్రంథమును మొదలునుండి చివరవఱకు జేతులార వ్రాసికొనినంగాని తనదిగాదు. ఇట్లొక్కొక్క గ్రంథమును సంపాదించుట యందింతటి కష్టముండ నాకాలమున గ్రంథభాండాగారముల జేర్చుటయన్న నెంతటి కష్టకార్యమో యోజింపుడు. ఇట్టి గ్రంథభాండాగారము లరుదుగ మూలకొక్క టెక్కడెక్కడనో మాత్ర ముండుట చిత్రముగాదు.

పండితు లీ పుస్తక భాండాగారములకు యాత్రలు సలిపి యేండ్లకొలది యట నిల్చి జ్ఞానము సంపాదించుచుండిరి. అట్టి యాత్రికులకు వలయు నన్నివిధములయిన సౌకర్యములును, నన్నపానాది సాహాయ్యములును భాండాగారాధిపతు లొడగూర్చుచుండిరి. కాని యెన్నిచేసినను జనసామాన్యమున కీ గ్రంథభాండాగారము లుపయోగించుచుండినవికావు. జనసామాన్యమునకు చదువనక్కఱలేదను నాకాలపు దురభిప్రాయముగూడ దీనికి గారణముగా నుండనోపు. అప్పటి యభిప్రాయము లెట్లుండినను కాల మిప్పుడు మారినది. చదువందఱకు నవశ్యమనుట తేటపడినది. ఇప్పు డనేక దేశములయందు జనుల కందఱకును జదువను, వ్రాయను దెలిసియుండవలసినదని నిర్బంధపఱచు జట్టముల జేసి యందు కనుగుణ్యముగ ధర్మపాఠశాలల సయితము నేర్పాటు చేయుచున్నారు. జనసామాన్యమునకు జదువను వ్రాయను దెలియునంతవరకు మాత్ర మీ పాఠశాలయందు నిర్బంధముగ నేర్పవచ్చునేగాని యంతకుపైన నిర్బంధపరచుట యిప్పటి కాలస్థితినిబట్టి కర్తవ్యముగాదు. అంతకుపైన జ్ఞానము సంపాదించుకొను విషయములో

స్వాతంత్ర్యము నిచ్చి పైన గోరువారి కవకాశము కల్పించి, మార్గము చూపి సాహాయ్యము చేయవలయును. ద్రవ్యాద్యుపపత్తులుగల విద్యార్థుల కుత్తమ పాఠశాలల నట్టి యవకాశము గలిగియున్నది. అట్టి యుపపత్తులులేని బీదసాదలకు జ్ఞానార్జనకు గ్రంథాలయములే శరణ్యములు కావలయు. పాఠశాలల జదువదగిన వారలు సైతము సర్వకాలమును పాఠశాలలయందు జదువుచుండుట సాధ్యముగాదు. పాఠశాలలను విడిచిన యనంతరము నూతనముగ నుత్పన్నములగు గ్రంథముల జదువవలయుననిన స్వయముగ వానిని సంపాదింపలేని వారికి నీ గ్రంథాలయములే శరణ్యములు.

గ్రంథ సాన్నిధ్యము గ్రంథకర్తల సాన్నిధ్యము నంతటిది. అట్టి యీ సాన్నిధ్య మెంతటి మేలుల జేకూర్చగలదు. చదువని వారలంగూడ జదువ బురికొల్పగలదు. నలువు రట జేరినతోడనే గ్రంథముల గురించిన ప్రస్తావము రాకపోవదు. ఆ మాటల వినువారు గ్రంథముల స్వయముగ జదివి యందలి సారస్యముల గ్రహింప నువ్విళు లూరుచుందురు. తద్గ్రంథముల జదువ నిదియె పెద్ద ప్రోత్సాహము కాగలదు. కాబట్టి యీ గ్రంథాలయముల నెంత విరివిగ నేర్పాటు చేసి జనులకెంత సులభసాధ్యములుగ జేసిన దేశమునకంత క్షేమము. లోకమునం దేమూల, నేమి జరుగుచున్నదియు నిముసములోన నెరుగ గలిగినట్టియు, మాసత్రయమున భూ ప్రదక్షిణము చేయనగునట్టియు, గడియలోన వేనవేల ప్రతుల ముద్రింపడగినట్టియు, నీకాలమున గ్రంథ ముల ప్రతుల సేకరించుట కష్టముగాదు. పాశ్చాత్య దేశస్థు లీవిషయమున నెక్కువ ప్రయత్నము చేసి యనేక గ్రంథాలయముల నేర్పఱచి జను లకు మేలు జేయుచున్నారు. మన హిందూదేశములో స్వదేశాభి మానమునకు బేరుగాంచిన బరోడామహారాజుగారు వారి రాష్ట్రమున ననేక పుస్తక భాండాగారముల స్థాపించి ప్రజల కన్నివిధముల సుఖ ములు గలిగించుచున్నారు. ఇంతటితో దృప్తినందక వారు కేవల కుగ్రామవాసులకుగూడ నీ లాభము కలుగుటకుగాను నూరూర దిరుగు

చుండుటకునై చరద్గ్రంథ భాండాగారముల* సయితము కల్పించి యితరులకు మార్గము చూపుచున్నారు. మన మాతృభాష నభివృద్ధి జేయ సమకట్టియున్నారముకదా. ఈవిషయమున మిగులననుభవము గలిగియుండు పాశ్చాత్యదేశీయుల గ్రంథ భాండాగారముల మాతృకలగా నిడికొని మన భాండాగారములు స్థిరములుగాను, జనోపయోగకరములుగాను నడుచునట్లు కట్టుదిట్టముల జేయవలెను.

1753 వ సంవత్సరమున స్థాపింపబడిన బ్రిటిషు మ్యూజియమను వస్తుప్రదర్శన కళాశాల సంబంధమగు గ్రంథాలయము లోకములోని యన్నిటికన్న మిక్కిలి ప్రసిద్ధికాంచినయది. ప్యారిసుపట్టణము నందలి 'బిబ్లియోథికె నేషనల్' యను గ్రంథాలయము గ్రంథ సంఖ్యయందు బ్రిటిషు మ్యూజియమును మించియుండినను పాఠక సౌకర్యములగు నేర్పాటులందు బ్రిటిషు గ్రంథాలయమునకు సాటిరాదని చెప్పదగియున్నది. ఈ బ్రిటిషు గ్రంథాలయమందు 155000 ముద్రిత గ్రంథములు, 50000 యముద్రిత గ్రంథములు నున్నవి. ఇందొక విశేషము. కేవల మాంగ్లేయ భాషా గ్రంథములే కాక అన్యభాషా గ్రంథములు గూడ బెక్కులుగలవు. ఐరోపాఖండము దేశభాషలలో నాయాదేశములవంగల శ్రేష్ఠగ్రంథ సముదాయముల నెల్ల నిందుజేర్చి యున్నారు.

ఈ గ్రంథములన్నిటిని వలయాకృతిగల పఠనాలయమున జుట్టును మంచెలపై నమర్చియున్నారు. పఠనాలయములోని 80000 గ్రంథములలో పాఠకుల యవిచ్ఛిన్నోపయోగమునకై క్రింది యంతస్తున ౨౦౦౦౦ గ్రంథములున్నవి. గ్రంథముల వాడునతడు చదువరులకు సహాయము చేయుచుండును. ఈ గ్రంథాలయమున జదువుటకు గ్రంథాలయాధిపతి యనుమతి యుండవలయు. ఈ యనుమతి 21 సంవత్సరములకు బైపడినవారికి మాత్ర మొసగబడును. వారికిని మఱియొక గృహస్థుని ప్రార్థనమీదనే యొసగబడును.

---

* సంచార గ్రంథాలయములు

చదువగోరువారు ముఖ్య గ్రంథాలయాధిపతి యనుమతి లేఖను గవాటమునొద్ద గనపఱచిననే యంతఃప్రవేశము గలుగగలదు.

1881 సంవత్సరమున 133842 మంది చదువరు లీ గ్రంథముల నుపయోగించిరట. సామాన్య గ్రంథాలయములును, ప్రత్యేక శాస్త్ర గ్రంథాలయములును ననేకప్రదేశముల ననేకములున్నవి గాని యిదియే బ్రిటిషురాష్ట్రములలో ముఖ్య గ్రంథాలయము.

చందాలవలన నేర్పాటుచేయబడిన గ్రంథాలయములలో లండక్ లైబ్రరి యను గ్రంథాలయము ముఖ్యమైనది. ఆక్స్ఫర్డు పట్టణమునందలి బోర్డిలియన్ గ్రంథాలయమున నచ్చటి విశ్వవిద్యాలయ విద్యా బ్రహ్మచారులకును, పలుకుతోడుగలవారికిని, 18 సంవత్సరముల వయస్సుకు మిగిలిన యితరులకును మాత్రము ప్రవేశము కలదు. గ్రంథాలయ పాలకుల ప్రత్యేకానుమతి లేనిదే గ్రంథముల గ్రంథాలయము బైటకు బంపుటలేదు.

జర్మనీ దేశపు గ్రంథాలయములలో జదువరుల విషయమైన చట్టము లంతకన్న కొంతధారాళముగనున్నవి. ప్రాయికముగ యావనుల కందఱకును బఠనాలయమున బ్రవేశము గలదు. గొప్పయుద్యోగస్థుల కందఱకును, దటస్థుల ప్రార్థనమీద నితరులకును గ్రంథములు చదువ నవకాశము గలదు. పత్రికాశాఖకు మాత్రము ప్రవేశము గొంత కష్టతరము.

ఇటలీదేశమున గ్రంథాలయములు తఱచుగ ప్రభుత్వ సంబంధముగలవియై వారి విధులచే బాలింపబడుచుండును. అమెరికా దేశమున గ్రంథాలయములు మిక్కిలి యాధునికములు. ఈ దేశమున గ్రంథాలయములు మిక్కిలి ప్రబలియున్నవి. కట్టుదిట్టములును జక్కగ జేసియున్నారు. కాబట్టి నూతనసృష్టి చేయవలసియుండదు మనకు మన యాంధ్రదేశ గ్రంథాలయ నిర్మాణమునందు వీరి గ్రంథాలయము లాదర్శములుగ నుపయోగింపదగియున్నవి. అయిన నీ విషయమున నిర్ణయముగ నిబంధనల జేయుట యనపేక్షణీయము. ఆయా సందర్భ

ముల ననుసరించి సమయోచితముగ నేర్పాటుల జేసికొనుచుండవల
యును. అయిన స్థూలముగ గొంతమట్టు కాలోచింపవచ్చును.

గ్రంథాలయముయొక్క గృహనిర్మాణము విషయములో
గ్రంథాలయోపయోగమును జక్కగ నెఱిగిన యనుభవశాలి యభి
ప్రాయము ననుసరించి గృహభాగముల నిర్మింపవలయు. పఠనాగార
ములు, గ్రంథాగారములు, కర్మాగారములు, కార్యస్థానములు మొద
లగున వన్నియు నొక్కటొకటికిగల సంబంధము ననుసరించి, చక్కగ
నమర్పబడవలయు. గ్రంథాలయ మవిచ్ఛిన్నముగ నభివృద్ధి యగు
చుండునది కనుక నట్టి యభివృద్ధి కభ్యంతరములేకుండ గృహ విన్యా
సము నేర్పాటు చేయవలయు. చెమ్మలేనిచోటున, నగ్నిభయమున
కెడమియ్యని పరికరములతో గృహనిర్మాణము చేయునది యుక్తము.

అలంకారము కంటె గ్రంథ క్షేమమును, సౌకర్యమును ముఖ్య
ముగ గమనింపదగును. అయినను ప్రసిద్ధ గ్రంథకర్తల చిత్తరువులచే
రమ్యముగ నలంకరింపబడి జనాకర్షకముగా నుండుట యావశ్యకము.
పఠనాగారములు వైశాల్యముగలిగి వలయునంత వాయుసంచారము
గలవిగాను, నైఘంటిక గ్రంథ భరితములుగాను నుండవలయు. పఠ
నాగారములలో స్త్రీ పురుషులకు బ్రత్యేక మవకాశముండుట యుక్త
ము. ప్రధాన గ్రంథనిలయము పాఠకులకు బ్రవేశ ముండునదికాదు
కావున నందు గ్రంథముల నిమిడికగా నుంచవచ్చును. పొడవగు
నిచ్చెనల నుపయోగింప నక్కఱ లేకుండునట్లు మిక్కిలి యున్నతము
గాని మంచెలను గోడలంటకుండ వెంబడిగా నుంచవచ్చును. నడుమ
గజము చోటిచ్చి ద్విముఖములగు మంచెల నుంచవచ్చు. ఈ విధ
మున నెక్కువ స్థలము నాక్రమింపక స్వల్పస్థలముననే యనేక గ్రంథ
ముల నిమిడింపవచ్చు. గ్రంథాలయము వలయాకృతిగనుండుటలో
స్థలము కలసిరాగలదు. మనుష్యులకువలెనే పుస్తకములకును గాలి,
వెలుతురు నావశ్యకము. గనుక దీనిని గమనింప దగును. గ్రంథము
లను జెదలంటకుండ, దుమ్ముచే జెడకుండను భద్ర పఱచవలెను.

గ్రంథాలయములకు ముఖ్యాంగము గ్రంథముల పట్టిక. పట్టికను మిక్కిలి నేర్పుతో నేర్పాటు చేయవలయును. పట్టికను జక్కగా నేర్పాటుచేయ నంతట గ్రంథాలయమునకు న్యూనత కలిగి, దాని ముఖ్యోద్దేశ్యమునకు భంగము కలుగవచ్చును. చదువరులకు వలయు గ్రంథము లున్నదియు, లేనిదియు సులభముగా దెలియునట్లు పట్టికల నేర్పఱచ వలయును. పాఠకుడేదేని విషయమును జదువగోరి యా విషయమున నేయే గ్రంథకర్త రచించిన యేయే గ్రంథములున్నవో తెలిసికొన గోరవచ్చును. అది సులభముగ దెలియునట్లు పట్టికను గావింప వలయును. ప్రాయికముగా నొక్కొక్క గ్రంథాలయము నందును బహువిధపట్టిక లుండవలయును. గ్రంథనామములబట్టి యొకపట్టికను, గ్రంథవిషయమును బట్టి వేఱొకటిని నేర్పఱచునది యావశ్యకము. గ్రంథాలయము వృద్ధిపొందుచుండు కొలది పట్టికయు మారుచుండ వలయును. పట్టిక నేర్పఱచుటలో గ్రంథాలయాధిపతి తోడ్పాటు ముఖ్యముగా నుండవలెను. గ్రంథాలయమునందు గల గ్రంథములను గ్రంథాలయాధిపతి యెఱిగియుండవలయును. పట్టికలు పలుమారు మారుచుండుటను బట్టి వాని నచ్చువేయించుట వ్రయకరమైనను వ్రయమునకు బ్రాల్మాలక పాఠక సౌకర్యమునకయి యచ్చొత్తించుట కార్యము. చదువరుల కుపయోగించు నీ పట్టికలుగాక గ్రంథాలయ పాఠకుల యెఱుకకై మఱిరెండు విధములగు పట్టికలుండవలెను. ఒకటి గ్రంథ సంపాదన పట్టిక. ఇందు గ్రంథాలయమునకు వచ్చు పూర్ణ గ్రంథములనుగాని, గ్రంథభాగములనుగాని, మాసాది పత్రికలనుగాని యప్పటప్పటికి జేర్చుచుండవలయు. ఎట్లు లభించినది, యెవరివలన నొసంగబడినది, యేనాడు చేరినది మొదలగు నన్నియంశములు నిం దుండవలెను. రెండవది మంచెలపట్టిక. ఏయేమంచెయం దేయే గ్రంథములున్నదియు నిందుండవలెను.

(4)

గ్రంథాలయ పాలన

పైన జెప్పిన రెండు పట్టికలను బట్టి గ్రంథాలయపాలకు డప్పు డప్పుడు గ్రంథముల నుండ జూచుచుండవలయును. క్రొత్తగా వచ్చిన గ్రంథములను గొంతకాలము వరకును ప్రత్యేకముగా నుంచియుండి తరువాత వానిని నిర్ణీత స్థలముల జేర్చుచుండవలెను. గ్రంథాలయ మునందు జదువరులకు దోచు గుణాగుణములు సూచించి వారికిదోచిన సంస్కారమార్గములను బోధించుటకుగా నొక పుస్తకము నుంచదగు. పత్రికల గ్రహించునుద్యోగము చదువరులకు విడువక గ్రంథమురాగానే గ్రంథాలయోద్యోగస్థులే యా పని దీర్చుచు గ్రంథములందు దుమ్ము నిలువనీయక నేర్పుతో గ్రంథములు నలుగకుండ దట్టివేయుచుండ వలయును.

చదువగోరువారికి వలయు గ్రంథముల జదువ నవకాశమిచ్చు టయేగాక యుక్తములగు విషయములను జదువునట్లు జదువరుల ప్రో త్సాహ పఱచుటయు గ్రంథాలయ ప్రయత్నముగా నుండవలెను. ఈ విషయమై గ్రంథాలయములలో నప్పుడప్పుడు నుపన్యాసముల బండితులచే నిప్పించుచు జరద్బింబ ప్రదర్శనములచే విషయముల జనులకు బోధపఱచుచు జదువనివారికి సయితము చదువవలయునను నభిలాషకలిగించుచు జదువువారి కెట్టి విషయముల నే తీరున జదువ వలసినదియు దెలుపుచు గ్రంథాలయముల యుద్యమము సఫలముజేయ వలయును. గ్రంథాలయ పాలకుని సామర్థ్యమున జాలవఱకు నీ కార్య ము నెఱవేఱగలదు. గ్రంథాలయ పాలకుడు పండితుడుగాను, గ్రంథ ములయందును, దత్పఠనము నందును మిగుల నాసక్తిగలవాడుగాను, శాంతుడుగాను, గంభీరుడుగాను, సమయస్ఫూర్తి కలవాడుగాను నుండవలయు. పాలకుని సహోద్యోగస్థులుగూడ జదివినవారు గాను, ననుభవశాలురుగాను నుండవలయును. ఐన మన దేశమున గ్రంథాలయముల నేర్పఱచుటకిదియే యారంభము గాన మనకట్టి యనుభవముగల యుద్యోగస్థులు దొఱకుట దుస్సాధ్యము. మొదట

నేర్పడు గ్రంథాలయమున నట్టి యుద్యోగస్థులకు బనుల గఱపి కాల క్రమమున నేర్పడు గ్రంథాలయములకు బంపుచుండవలయును. అట్టి యుద్యోగములు నేర్చుకొనుటకు గొందర బ్రోత్సహించి, సహాయముచేసి, వారల కుద్యోగముల నొసంగుచుండిన గొలది కాలములోనే వలయు నుద్యోగస్థులు దొరకగలరని తలచెద.

గ్రంథముల నేర్పఱచుట

కేంద్ర గ్రంథాలయమునందు భాషలోనున్న గ్రంథము లన్నియు నుండవలయు గాని తక్కిన శాఖాగ్రంథాలయముల నది సాధ్యముగాదు. మఱియంతగా గోరదగినదియుగాదు. కాబట్టి యట్టి గ్రంథాలయమున నేయే గ్రంథముల నుంపవలయుననుట చక్కగా నాలోచింపదగిన విషయము. దుర్నీతుల గఱపునట్టి గ్రంథముల గ్రంథాలయము జేరనీయకుండుట క్షేమము. గ్రంథాలయముయొక్క స్థితిగతులను, నుపపత్తిని అనుసరించి దొఱకగల గ్రంథములలోనుండి యుచితములగు గ్రంథముల నేర్పఱచుకొనవలెను. కేంద్రగ్రంథాలయమున మాత్రము భాషలోని యన్నిగ్రంథము లుండుట యుక్తమని చెప్పియుంటినిగదా! ముద్రిత గ్రంథములు ద్రవ్యసాధ్యములు. అముద్రిత గ్రంథములు కేవల ద్రవ్యైక సాధ్యములు గావు. ఇదివర కట్టి గ్రంథములు జేర్చియుంచు విద్యారసికులు, మహానుభావు లందఱును దోడ్పడినగాని సాధ్యముగాదు. ఇక ముద్రించు గ్రంథముల విషయములో బ్రభుత్వమువారును, భాషాభిమానులగు ముద్రించువారును, గ్రంథకర్తలును దాము ముద్రించు ప్రతి గ్రంథముయొక్క ప్రతిని మన కేంద్ర గ్రంథాలయమునకు బంపెదరేని వారు మిక్కిలి సహాయముచేసిన వారగుదురు.

పత్రిక

గ్రంథాలయమున కనుబంధముగ గ్రంథాలయ విషయమును, గ్రంథ విమర్శనలను బ్రచురించు మాసపత్రికయో, వారపత్రికయో

యొకటియున్న యుక్తముగా నుండును. కాలక్రమమున నట్టి విమర్శన యందు తేలినగ్రంథములు మాత్రమే పఠనీయ గ్రంథములుగా గావచ్చును. ఆంధ్రరాష్ట్రమున బ్రత్యేక విశ్వవిద్యాలయమునకై మనముజేయు ప్రయత్నము సఫలమగునేని కేంద్ర గ్రంథాలయ మా విశ్వవిద్యాలయమున కనుబంధముగ నుండదగు.

— గ్రంథాలయ సర్వస్వము - ప్రథమ సంపుటము - ప్రథమ సంచికనుండి



శ్రీ పానుగంటి వెంకటరామారాయనింగారు



శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు

# ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల తృతీయ మహాసభ, నెల్లూరు,

[ 1916 మే 12, 13 ]

## శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు

విజ్ఞానము :

జిజ్ఞాస మనుజులకు సహజమైన ధర్మము. మనుజుల సకల ప్రయత్నములు జ్ఞానాభివృద్ధికై వినియోగ పడుచున్నవి. సృష్ట్యాదినుండి నేటివరకును వికసించిన విజ్ఞానము గ్రంథములందు నిక్షిప్తము. అనాదినుండియు మనుజులు తమవంశములను వలె తమ విజ్ఞానమును సయితము సంరక్షించుకొనుటకై మహత్తరంబులైన ప్రయత్నంబులను చేయుచుండిరి. విజ్ఞాన సంరక్షణార్థమైచేసిన ఆ ప్రయత్నంబులు ఆదిని భాషా నిర్మాణమువలన సాధ్యములైనవి. అనంతరము లిపి కల్పనము వలన స్థిరపడినవి. వర్తమానయుగమునందు ముద్రణమువలన సులభసాధ్యములై సామాన్య జనులకు సులభములైనవి. వేదములను సంరక్షించుటకై వేదవ్యాసాది మహర్షులు చేసిన యుత్కృష్టంబైన పరిశ్రమను వర్తమానకాలమునందు మన మతి సులభముగ వేదగ్రంథంబులను బడయగల సౌకర్యమునకు పోల్చినపుడు, విజ్ఞాన సంరక్షణము చేసిన మహర్షుల పూజాపాత్రత వ్యక్తమగుచున్నది. మహర్షులు లిపి సాహాయ్యమును, ముద్రణ సాహాయ్యమును పొందక ౬౦౦౦ ఏండ్లేక మాత్రావ్యత్యయమైనను లేకుండ వేదసంరక్షణము జేసిన విధాన మే యితరజాతియందును నగోచరము. ఆ మహర్షుల వంశజులమైన మనము జ్ఞాన సంరక్షణమునకును, విజ్ఞానవ్యాపనమునకును ప్రయత్నించుట సహజశీలము, నియత ధర్మము.

లిపినిర్మాణము

మానవులు జ్ఞాన సంపాదనమునకును, జ్ఞాన సంరక్షణమునకును చేసిన ప్రయత్నములు విస్మయ జనకములు. జ్ఞానము జీవ వికాసమునకు సాధనము. జీవకణము క్రమవికాసమును పొందినపుడు మానవత్వము, దేవత్వము సిద్ధించుచున్నవి. సత్తునకు చిత్సంయోగమువలన నానందపదవి లభించుచున్నది. సకల జంతువులును స్వజాతి సంరక్షణమునకు వలె విజ్ఞాన సంరక్షణమునకును నిరంతరము ప్రయత్నములను చేయుచుండును. మనుజులు విజ్ఞాన సంరక్షణమునకయి నిర్మించిన సాధనములందు లిపి నిర్మాణ మగ్రగణ్యము. లిపి నిర్మాణమువలన ఏ వ్యక్తిజ్ఞాన మావ్యక్తితోను, ఏ యుగజ్ఞాన మా యుగముతోను, ఏ జాతి జ్ఞాన మా జాతితోను నంతమునొందక సంరక్షించుటకు సాధన మేర్పడినది. పెక్కువేల సంవత్సరములకు పూర్వము నివసించిన మన మహర్షుల విజ్ఞానము, ఈజిప్టు దేశస్థుల విజ్ఞానము, చాల్డియనుల విజ్ఞానము, అస్సిరియనుల విజ్ఞానము, గ్రీకుల విజ్ఞానము లిపి సాధనమున సంరక్షితమై వర్తమాన యుగమునందు లోకమునకు కరతలామలకముగ నున్నవి. లిపి క్రమవికాసమును దెలిసికొనుటకు సర్వశాస్త్ర జ్ఞాన మవసరము. చిత్రలిపి సంజ్ఞాలిపి రూపమును, సంజ్ఞాలిపి శబ్దలిపి రూపమును, శబ్దలిపి ధ్వనిలిపి రూపమును దాల్చుచు క్రమవికాసమును పొందిన విధము లిపిచరిత్రను పరిశీలించుటవలన తెలియుచున్నది. మనుజులు ప్రప్రథమమున తమ భావముల నితరులకు వస్తురూపములను వ్రాసి తెలుపుచుండిరి. కాలక్రమమున రూపము భావమును, భావము వర్ణమును తెలుపుటకు సాధనములైనవి. ఒక లిపిని వేరొక లిపినుండి గ్రహించినపుడు ప్రజల గాత్ర నిర్మాణమునకును, భావ వికాసమునకును తగిన రీతిని రూపములందును, ధ్వనులయందును మార్పులేర్పడును.

బాహ్మీ లిపి మాతృక

హిందూదేశపు లిపులకు బ్రాహ్మీలిపి మాతృక. ఆ మాతృక నుండి నాగరలిపి, ఇతర లిపులు పుట్టినవి. బ్రాహ్మీలిపినుండి ఆంధ్ర లిపియును పుట్టి క్రమ వికాసమును పొందినది. అశోకలిపినుండి గుహా లిపియును, గుహాలిపినుండి వేంగీలిపియును, వేంగీ లిపినుండి పూర్వ చాళుక్యలిపియును, పూర్వచాళుక్య లిపినుండి తెనుగులిపియును, క్రమ క్రమముగ వికసించినవి. వేంగీలిపియందు వ్రాసిన నాల్గవశతాబ్దపు శాసనములుగలవు. ఆ శాసనములే తెలుగు అక్షరములందు వ్రాయ బడిన పురాతన శాసనములని పరిగణింపబడుచున్నవి. ప్రస్తుతాంధ్ర లిపికి దగ్గఱ పోలికగల లిపి పూర్వచాళుక్యలిపి. పూర్వ చాళుక్య లిపి యందుగల శాసనములలో ౬౨౨ వ సంవత్సరపు విష్ణువర్ధనుని శాస నము పురాతనము. రాజరాజనరేంద్రుని కాలపు శాసనములందు నందంపూడి శాసనము తెనుగులిపి చరిత్రను, తెనుగు వాఙ్మయ చరి త్రను నిర్ణయించుటకు ముఖ్యమైనదిగనున్నది. ఈ శాసనము ౧౦౫౩ వ సం.నందు వ్రాయబడినది. లేఖకుడు ఆంధ్రవాఙ్మయ నిర్మాణకుడు నన్నయభట్టారకుడు. దాన ప్రతిగ్రహీత మహాభారతరచనయందు నన్నయభట్టునకు తోడ్పడిన నారాయణభట్టు. ఈ కారణంబులను బట్టి మనకిపుడుగల యాంధ్రగ్రంథంబులం దతి పురాతనంబును, నగ్రగణ్యంబును నైన మహాభారతము పదవశతాబ్దపు చాళుక్యలిపి యందు వ్రాయబడినదని తెలియుచున్నది. తిక్కన సోమయాజి భార తమును పదుమూడవ శతాబ్దపు సంధియుగలిపియందు వ్రాసియుం డును. ఆంధ్రభోజుడని ప్రశస్తిగాంచిన శ్రీకృష్ణదేవరాయల కాల మునందు ఆంధ్రలిపికి ప్రచారము గలిగినది. ఆ లిపి స్వరూపము స్థిర పడి ప్రస్తుతము వాడుకయందున్న ఆంధ్రాక్షరములు స్థిరపడినవి. క్రైస్తవమత బోధకులు చెన్నపురి ప్రాంతములందు యక్షర స్వరూప ములను వర్ణ స్వరూపములకు ప్రమాణముగ గైకొని సీసాక్షరములను నిర్మించిరి. సీసాక్షర నిర్మాణమువలన నక్షరస్వరూపములు స్థిర రూప

మును దాల్చినవి. అశోకుని శిలాశాసనములందును, అమరావతి స్థూపములందును, వేంగిశాసనములందును, చాళుక్యశాసనములందును, శ్రీకృష్ణదేవరాయల శాసనములందును గల యక్షరస్వరూపముల చరిత్రను పరిశీలించినపుడు తెలుగువర్ణము లేరీతిని గలిగినదియు తెలియ గలదు. మన ప్రాచీన దేశచరిత్రను, వాఙ్మయచరిత్రను దెలిసికొనుటకు వర్ణస్వరూప చరిత్రను తెలిసికొనుట యవసరము. కాన సమర్థులైన గ్రంథాలయ నిర్వాహకు లీ విద్యనభ్యసించిన భాషాసేవను చేయుటకు మంచి యవకాశములు గలుగగలవు. మనదేశములోని ప్రాచీన దేవాలయములాదలి శిలలమీాదను, తామ్రశాసనములందును గల విషయముల పరిశోధనవలన భాషకును, దేశమునకును సంబంధించిన గోప్యములైన యనేక విషయములు వెల్లడికాగలవు. ఈ విషయ పరిజ్ఞానము లక్ష్మణరావుగారు ప్రచురించుచున్న విజ్ఞానసర్వస్వము నందలి "అక్షర వ్యాసము"ను చదివిన కొంతవరకు కలుగగలదు.

వర్ణమాల

తెలుగుభాషయందు, ఉర్దు, ఇంగ్లీషు, అఱవము మొదలగు భాషలలోవలె క్రమ రహితమైన వర్ణమాలగాక, క్రమమైన వర్ణమాల గలదు. ఆంధ్రవర్ణమాల యందు ప్రత్యేకధ్వనిని దెలుపుటకు ప్రత్యేకాక్షరము గలదు. ఒకధ్వనిని దెలుపుట కనేకాక్షరములు లేవు. వివిధ ధ్వనులను దెలుపుట కొకటే యక్షరము నుపయోగింపవలసిన యక్కఱయు లేదు. ఈ యేర్పాటువలన తెలుగుభాషయందు వ్రాయుట, చదువుట సులభసాధ్యమగుచున్నది. సామాన్య భాషా పరిజ్ఞానము గలవారల కాంధ్రభాషయందు గ్రంథపఠనము సులభ సాధ్యమగుచున్నది.

గ్రంథ నిర్మాణము

అక్షర నిర్మాణము స్థిరమైనపుడు సకలభాషలందును గ్రంథ నిర్మాణము సాధ్యమగుచున్నది. అక్షరనిర్మాణము లేనపుడును భాష యందు ప్రజాముఖమున వ్యాప్తములగు పాటలతోను, పద్యములతోను

గ్రంథనిర్మాణమునకు సాధనము లేర్పడుచున్నవి. పూర్వకాలము నందు పుస్తకములను వ్రాయుటకు లేఖకులు, భూర్జపత్రములను, తాటాకులను, బట్టలను, కొయ్యపలకలను, రాగిరేకులను, వెండిరేకులను వాడుచుండిరి. మనదేశమునందు కాగితములు 14 వ శతాబ్దమున వాడుకకు వచ్చియుండును. భూర్జపత్రముమీద వ్రాయు నాచారము ఉత్తరహిందూస్థానము నందుండెడిది. పదునైదువందల సంవత్సరముల క్రితము భూర్జపత్రములమీద వ్రాసిన గ్రంథము లిప్పుడు భరతఖండమునందు గలవు. దక్షిణాంధ్రదేశమునందును, ద్రవిడదేశమునందును పుస్తకములు తాటాకులమీద గంటములతో ముత్యములనుబోలిన యక్కరంబులు బారులుదీర్చినటుల వ్రాసినపుస్తకములను జూచినపుడు లేఖకుల కళాకౌశల మచ్చెరువును బుట్టించును. ప్రాచీన పుస్తకములు ఖిలమై పోవుచున్న సమయమునందు పుస్తకాభిమానులందఱును మూలమూలలందుగల పుస్తకసముదాయమును సంరక్షించు నిమిత్తము పాటుపడుటకై భాండాగారోద్యమము సాధనముగనున్నది. ముద్రణయంత్రములు, టైపురైటరులు నిర్మితమైన తరువాత వర్ణలేఖనా కౌశలము క్షీణించుచున్నది. ప్రాచీనుల లేఖన నైపుణ్యమునకును, జిజ్ఞాసాభిలాషకును, పుస్తక రక్షణాభిమానమునకును నిదర్శనముగ పల్లెలందును, పట్టణంబులందును మూలమూలలదాగియున్న తాటాకుల పుస్తకంబులను సంగ్రహించి సంరక్షించుట గ్రంథాలయ నిర్వాహకులు నిర్వహింప దగిన పనియైయున్నది. ఆంధ్రవాఙ్మయమునందు మొదట వ్రాసిన పుస్తకమేదియో నిర్ణయించుటకు తగిన యాధారములు లేవు. తెలుగులిపియందు వ్రాసిన తాటాకు పుస్తకములు మూడువందల సంవత్సరములకు మించినవేవియు కనుపింపవు. తెలుగులిపి వేయిసంవత్సరములకు పూర్వము వాడుకకువచ్చినటుల శాసనము వలన తెలియుచున్నను, తెనుగున వ్రాసిన పురాతన గ్రంథములేవియు కనబడకున్నవి.

(5)

పుస్తకములున్నపుడు గ్రంథాలయ స్థాపనమును సాధ్యమగుచున్నది. లోకచరిత్రను పరిశీలించినపుడు విజ్ఞానమున కొక యుగమునందుత్తేజనమును, వేఱొక యుగమునందవనమనమును గలుగుచున్నదని తెలియుచున్నది. ప్రజలకు మతమునందును, సాంఘిక వ్యవస్థలయందును, రాజకీయ విషయంబులందును, ఆర్థిక వ్యవహారంబులందును నుద్బోధ ముదయించినపుడు విజ్ఞానవ్యాపనమునకును, విజ్ఞాన సంరక్షణమునకును నుత్తేజనము గలుగుచుండును. ఉద్బోధను క్షీణించినపుడు విజ్ఞాన సంరక్షణసాధనంబులును, క్షీణించుచు దేశము అజ్ఞానాంధకార బంధురంబగుచుండును. అశోకుని కాలమునందు కలిగిన బౌద్ధమతావేశము మత సాంప్రదాయ గ్రంథ నిర్మాణమునకు దోడ్పడినది. గుప్తుల కాలమునందును, శ్రీహర్షుని కాలమునందును కలిగిన విజయోత్సాహము సంస్కృతకావ్య నిర్మాణమునకు కారణమైనది. శ్రీకృష్ణదేవరాయల కాలమునందు కలిగిన శౌర్యోత్సాహమాంధ్రప్రబంధ యుగ నిర్మాణంబున కాధారంబైనది. అక్బరు చక్రవర్తి స్థాపించిన శాంతివలన దేశమునందు విజ్ఞానోదయమున కవకాశమేర్పడినది. వర్తమాన యుగమునందు ప్రారంభమైన విద్యావ్యాపనాభిలాష గ్రంథాలయ స్థాపనమునకును, వ్యాపనమునకును కారణంబగుచున్నది.

లోకమునందు గ్రంథరాజంబులకు మించిన విభవంబులు లేవు. గ్రంథంబులు దివ్య విభూతులకు ప్రతిబింబములు. ఆత్మవికాసమునకు సాధనంబులు. బ్రహ్మజ్ఞానమునకు ప్రమాణములు. ధర్మోపార్జనమునకు సాధనంబులు. విచారగ్రస్తులకు విలాస నిలయంబులు. గంభీర భావంబులకు సదనంబులు. కష్టపరంపరలకు తరణోపాయంబులు. గ్రంథ పఠనమువలన మహనీయుల సాంగత్యము లభించును. పాప ముపశమించును. శీలము వర్ధిల్లును. విజ్ఞాన మలవడును. పరమానందము గలుగును. శ్రీరామకృష్ణాదుల దివ్యగుణంబులను గ్రహించినపుడు గలిగిన యానందమునకు మితిమేర లెవరు నిర్ణయింపగలరు? భీష్ముని త్యాగము,

కర్ణుని శౌర్యము విజయుని వీర్య మెవరి కుత్సాహమును గలిగింపవు? సద్గ్రంథములకు మించిన మిత్రవర్గ మెచట లభింపగలదు? బ్రహ్మర్షులు, బ్రహ్మజ్ఞులు, భక్తులు, కవులు, గాయకులు, శూరులు, వీరులు, త్యాగులు, భోగులు, పుస్తకరూపమున చేయు మహోపదేశము లేకదా తరణోపాయమునకు సాధనములు. గ్రంథాలయములందు గల సాధనములను పరిగ్రహించి యనుభవించి మానవులు కామితార్థములను బడయుచు సుఖంబుండగలరు!

ప్రాచీన గ్రంథాలయములు

భారతీయుల కనాదినుండియు గ్రంథ సంపాదనమునందును, సంరక్షణమునందును, మిక్కుటమైన యభిమానముగలదని నలంద మొదలగు స్థలములందు స్థాపించిన ప్రాచీన పుస్తక భాండాగారముల చరిత్రవలన విశదమగుచున్నది. నలంద కళాశాలయు, పుస్తక భాండాగారమును నేడవశతాబ్దమున నున్నత దశయందుండినవి. బౌద్ధమతము క్షీణించుట కుపక్రమించినపుడు నలంద కళాశాల క్షీణించుటకు మొదలుపెట్టియుండును. మతద్వేషులు అమూల్యంబులయిన గ్రంథరాజంబులను మంటగలిపియుందురు. పూర్వకాలమునందు రాజులు, గురువులు, పండితులు రాజనగరులందును, మఠములందును, దేవళంబులందును పుస్తకాలయములను స్థాపించి పండితుల కుపయోగపడునటు లేర్పాటులను చేయుచుండిరి. అశోకుని కాలమునుండియు ఎనిమిదవ శతాబ్దాంతమువఱకు బౌద్ధులు, జైనులు విహారములందును, మఠములందును పుస్తకభాండారములను స్థాపించి, బౌద్ధమత విజ్ఞానమును వ్యాపింపజేయుటకై ప్రయత్నించిరి. శ్రీహర్షుని కాలమునందు 'చీనా' యాత్రికుడు హియూన్‌త్సాంగు హిందూదేశమును సందర్శించినపుడు బౌద్ధమతము క్షీణదశయందున్నదనియు, విహారములు పాడుపడినవనియు వ్రాసియుండెను. బౌద్ధమతము క్షీణించి హిందూమతము ప్రబలినపుడు హిందువులు, హిందూ మతోద్ధారకులు బౌద్ధ విహారంబులందు సంగ్రహింపబడిన గ్రంథంబులను నాశనముచేసియుందురు.

విదేశీయులు లభించిన గ్రంథములను తమదేశమునకు కొనిపోయి యుందురు. హియూన్‌త్సాంగు 657 గ్రంథములను చీనాదేశమునకుం గొనిపోయెనని తెలియుచున్నది. బౌద్ధులు తిబేతునకు మధ్యాసియా భాగములకు అనేక గ్రంథములను గొనిపోయిరి. ఈ రీతిని బౌద్ధులు సంగ్రహించిన గ్రంథములు స్వదేశీయుల ద్వేషమువలనను, విదేశీయుల భక్తివలనను జన్మభూమికి దూరస్థములైనవి. బౌద్ధయుగమంతరించిన తరువాత హిందూ పండితులును పుస్తకములను సేకరించుట కుపక్రమించిరి. జైనులును, హిందువులును, సేకరించి, సంరక్షించిన పుస్తకసముదాయమును మహమ్మదీయులు 1100-1500 వఱకు భస్మీభూతము చేయుచుండిరి.

సర్వజన సమ్మాన్యుడయిన అక్బరు కాలమందామహామహుని యాదరణమున గ్రంథ సంపాదనాభిలాష తిరిగి కలిగినది. ఔరంగజేబు హిందూమతద్వేషియైనను పుస్తకప్రియుడు. ఆ చక్రవర్తి కాలమునందును ఢిల్లీనగరమున కనేక గ్రంథములు చేర్పబడినవి. మొగలు రాజ్య వినాశనముతో దేశ మరాజకమయ్యె జిజ్ఞాసాభిలాష క్షీణించినది. వర్తమానకాలమందు మైసూరు, కాశ్మీరము, నేపాలము, అల్వారు, బికనీరు మొదలగు సంస్థానములందును, తంజావూరునందును ప్రాచీన లిఖిత పుస్తకము లనేకములు గలవు.

ఆంగ్లేయ పరిపాలన మారంభమైనతరువాత పుస్తకములకు భస్మీకరణ భయము తొలగినను పరదేశగమన భయము హెచ్చినది. ప్రాచ్య విద్యావాసనగల యూరపియనులు భరతఖండమునందలి పుస్తక సముదాయమును మెల్లమెల్లగ యూరపుదేశమునకు చేర్చుట కుపక్రమించిరి. ఇపుడు బోడ్లియన్, బార్లను, ఇండియా ఆఫీసు, బ్రిటిషు మ్యూజియము, బర్లిను, ప్యారిసు పుస్తక భాండాగారములందుగల సంస్కృత గ్రంథములు భరతఖండమునగల గ్రంథ సముదాయమునకు మించియున్నవని తెలియుచున్నది. మన యౌదాసీన్యమువలన సరస్వతీదేవి మనలను విసర్జించి పరదేశ వాసమును ప్రీతి

పూర్వకముగ నంగీకరించిన వింత యేమున్నది? ఇకనైనను మనము శ్రద్ధవహించి మనదేశమునందుగల ప్రాచీన పుస్తకములను సంగ్రహించి సరస్వతీదేవిని సేవించి యామె ప్రసాదమును బడయుటకు వ్రతమును బూనవలసి యుందుము.

విదేశ పుస్తక భాండాగారములు

నాగరకతగల పాశ్చాత్యదేశములందును, జపానుదేశము నందును గల పుస్తక భాండాగారముల స్థితి మనకచ్చెరువును బుట్టించుట సహజము.

| పట్టణములు | ముద్రిత గ్రంథములు | వ్రాత ప్రతులు | సంపుటములు |
|---|---|---|---|
| బ్రిటిషు మ్యూజియమునందు...... (ఈ చిన్న సంఖ్య యందు పాత్త్రములు చేరియుండలేదు.) | ౨౦,౦౦,౦౦౦ | 56,000 | |
| అయిర్లాండున గల డబ్లినునగరమునందు | | | 2,00,000 |
| అమెరికా సంయుక్తరాష్ట్రమునందలి న్యూయార్కునందు ..... | | | 14,00,000 |
| జర్మనీలో గల బర్లిను నగరమునందు .. | 12,30,000 | 30,000 | |
| ప్యారిసు నగరమునగల పుస్తక భాండాగారమునందు ...... | 30,00,000 | 1,10,000 | |
| ప్లానులు దేశపటములు 5,00,000 | | | |
| స్టాంపులు 10,00,000 | | | |
| పతకములు 2,07,096 | | | |
| రష్యాలోగల పెట్రోగ్రాడునందు ... | 18,00,000 | 34,000 | |

జపానుదేశములోగల టోకియో నగరమునందు రెండు పెద్ద భాండాగారములుగలవు. ఒకదానియందు (ఇయ్యది బాలకుల యుపయోగార్థము స్థాపితము) 5,00,000 గ్రంథములును, రెండవదానియందు (ఇయ్యది ప్రజోపయోగార్థము స్థాపితము) 4,00,000 గ్రంథములును గలవు.

ఈ విధముగ మహత్తరములైన పుస్తకభాండాగారములు నాగరకతగల దేశములందెల్లను గలవు. ఆ భాండాగారముల చరిత్రము

ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాను, ఆయా దేశములందు ప్రకటితములగు గ్రంథాలయ సర్వస్వములను చదివిన బోధపడును.

బ్రిటిషుపరిపాలనము స్థాపితమైన పిదప హిందూదేశమునందును గ్రంథాలయోద్యమము మొలకలెత్తి ప్రవర్ధమానమగుచున్నది. కలకత్తా, బొంబాయి, మద్రాసు మొదలగు నగరములందు పాలకులు సార్వజనిక గ్రంథాలయములను జనోపయోగార్థమై స్థాపించిరి. చెన్నపురియందును, ఇతర ప్రదేశములయందును ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములను స్థాపించి ప్రాచీనపుస్తకంబులను పాలకులు సంగ్రహించి సంరక్షించుచున్నారు. కాని, పాలకులు దేశీయభాషలపట్ల జూపెడి నిరాదరణము వలన ప్రాచీన గ్రంథ సంరక్షణమునకు సదుపాయము లేకుండుటయును, దేశభాషా గ్రంథభాండాగారములకు వ్యాపకము లేకుండుటయును సంభవించుచున్నది. ఈలోపమును నివారించుటకయి ఆంధ్రసాహిత్య పరిషత్తు ప్రాచీన లిఖితపుస్తకములను సంగ్రహించుటకై చేయుచున్న ప్రయత్నములు సంస్తవనీయములు. పరిషత్తు సంగ్రహించిన పుస్తకంబులు పుస్తకాభిమానుల కందుబాటుగ నుండునటు లేర్పాటులను జేసిన వారి ప్రయత్నములవలన దేశమునకును, భాషకును లాభము కలుగగలదు.

ఆంధ్ర పుస్తక భాండాగారములు

ఆంధ్ర పుస్తక భాండాగారములందు ప్రాచీనములు తంజావూరు పుస్తకభాండాగారము, చెన్నపురియందుగల ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారము. తంజావూరు భాండాగారమును 17 వ శతాబ్దారంభమునందు తెలుగునాయకులు ఆరంభించిరి. అందు ఎనిమిది లక్షల రూప్యముల విలువగల వివిధభాషల పుస్తకములు గలవు. తెలుగు భాషయందపూర్వములైన పుస్తకములు కొన్నియిచటను లభించినవి. ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారము బ్రౌన్‌దొరగారి ప్రోత్సాహమువలన 70 సంవత్సరముల క్రితము చెన్నపురియందు స్థాపితమయినది. ఈ యుభయ భాండాగారములును ఆంధ్రదేశము

నకు వెలుపల నున్నవి. ఆంధ్రదేశమునం దాంధ్రభాషాభివృద్ధికై కేంద్ర గ్రంథాలయ మొకటియును లేదు. కేంద్రగ్రంథాలయమును పొందగల భాగ్యము మనకెప్పుడు కలుగునో దురూహ్యముగ నున్నది. ఆ మనోరథము భాషాప్రయుక్తంబైన ప్రత్యేకాంధ్రరాష్ట్రమునందే సాధ్యము కావలసి యున్నది.

గ్రంథాలయముల స్థితి

ఆంధ్రగ్రంథాలయముల స్థితిగతులను పాశ్చాత్యదేశపు గ్రంథాలయముల స్థితిగతులతో పోల్చినపుడు భాషాభిమానులకు అసంతృప్తి కలుగుట సహజము. మనదేశమునందలి ఇతర సంస్థాపనలవలె గ్రంథాలయములును వెనుకబడియున్నవి. మన దేశమునందు విద్య వ్యాప్తినిగాంచకుండుటయే దీనికి ముఖ్యకారణము. పాశ్చాత్యదేశములందు నిర్బంధోచిత ప్రారంభ విద్యా శిక్షణము వాడుకయం దుండుటం జేసి ఆదేశములందు 100 కి 99 వంతున చదువనేర్చినవారుగలరు. మనదేశమునం దట్టి పద్ధతి లేనందున 100 కి 10 వంతున చదువనేర్చిన వారలు గలరు. గ్రంథాలయ వ్యాపనము విద్యావ్యాపనము పరస్పర సమాశ్రయములు. గ్రంథాలయములు వ్యాపించిన విద్య వ్యాపించును. విద్యవ్యాపించిన గ్రంథాలయములు వ్యాపించును. ప్రస్తుత స్థితియందు గ్రంధాలయములు అక్షరజ్ఞుల కుపయోగించును. కాని అనక్షరజ్ఞుల కుపయోగపడనేరవు. తెలుగు దేశమునందు ప్రస్తుతము గల గ్రంధాలయముల సంఖ్యను బరిశీలించిన ఈ విషయము గ్రాహ్యమగుచున్నది. తెలుగుదేశమునందు 192 భాండాగారములు గలవని తెలియుచున్నది. వానిలో కృష్ణా మండలమునందు 53, గుంటూరు మండలమునందు 52, గోదావరి మండలమునందు 44, నిజాం రాష్ట్రమునందు 12, నెల్లూరు మండలమునందు 14, విశాఖపట్టణ మండలమునందు 8, గంజాం మండలమునందు 6 కలవు. మండలము నందలి అక్షరజ్ఞుల సంఖ్యతో గ్రంథాలయముల సంఖ్యను పోల్చినపుడు విద్యావ్యాపనముగల కృష్ణా, గుంటూరు, గోదావరి మండలంబు

లందు గ్రంథాలయముల సంఖ్య హెచ్చుగనున్నదనియును, విద్యా వ్యాపనము లేని మండలంబులందు గ్రంథాలయముల సంఖ్య కొఱవడి యున్నదనియును తెలియుచున్నది. కృష్ణా మండలంబునందు 53 గ్రంథాలయములు గలవు. 100 కి 13 వంతున చదువ నేర్చినవారు గలరు. గుంటూరు మండలమున 52, గోదావరి మండలమున 44 గ్రంథాలయములు గలవు; 100 కి 12 వంతున చదువనేర్చిన వారు గలరు. విద్యావ్యాపనమువలననే గ్రంథాలయవ్యాపనము సాధ్యము గాని వేఱొండుమార్గమున సాధ్యముగాదు. ఈ పరిస్థితులందు నూతన భాండాగారములను స్థాపించుటయును, స్థాపితములైన గ్రంథాలయ ములకు తగిన పోషణము గలుగుటయును కష్టసాధ్యము. గ్రంథాలయ నిర్వాహకులు వారి ప్రయత్నములను, విద్యాలయములను స్థాపించి విద్యావ్యాపనమునకై వినియోగించిన దేశమునకు మంచిమేలుకలుగ గలదు. 160 గ్రంథాలయములు, 1914 వ సంవత్సరమునందు మొత్తముమీద 10,000 రూప్యములు చందాలమూలమున వసూలు చేసియుండును. గ్రంథాలయముల కనుదినము 1600 మంది చదువు టకై పోవుచుండిరి. 160 గ్రంథాలయములందు 12 గ్రంథాలయము లకు సొంత నిలయములు గలవు. ఆ నిలయములందు బెజవాడ యం దలి రామమోహన మందిరము పేర్కొనదగినది. రాజమహేంద్ర వరమునందు 1900 ల సంవత్సరమునందు స్థాపితమైన శ్రీ వీరేశలింగ పుస్తక భాండాగారమునందు 2300 తెలుగు, 2000 ఇంగ్లీషు, 200 సంస్కృతపు, 60 తాటాకు గ్రంథములు గలవు. సభ్యులు 150మంది గలరు. గత సంవత్సరమునందు 2850 గ్రంథములను స్త్రీలుపఠించిరి. గ్రంథాలయముల ప్రయోజనము పైలెక్కలవలన విశదమగుచున్నది. గ్రంథాలయ సంఘములందు పన్రెండు సంఘములు పాఠశాలలను నిర్వహించుచు విద్యావ్యాపనమును జేయుచున్నవి. ఇతర గ్రంథా లయములును పై గ్రంథాలయముల మార్గము నవలంబించిన దేశమున కుపకృతి కలుగగలదు.

స్వయం సహాయ నిలయములు

ఆంధ్ర దేశమునందు నూతనోత్సాహ ముదయించి దశదిశలను వ్యాపించి జనులను కార్యపరతంత్రులను చేయుచున్నది. ప్రజలయందు మూర్తీభవించిన యుత్సాహ మనంతరూపములను విహరించుచున్నది. జనులయందు స్వాతంత్ర్యేచ్ఛ జనించినది. సంఘారాధన సంకల్పము గలిగినది. జ్ఞాన సంపాదన తాత్పర్య మంకురించినది. సేవావాంఛ పొడసూపినది. స్వదేశాభిమానము స్థాపితమైనది. స్వభాషాభిమానము ప్రబలినది. దేశమునం దుదయించిన యాందోళనమును వర్ణించుట దుస్తరము. కామ్యార్థ సిద్ధికి పలువిధములైన ప్రయత్నములు చేయబడుచున్నవి. ఆ ప్రయత్నములకు ఫల మాంధ్రవ్యక్తి వికాసము. రెండుకోట్లాంధ్రుల హృదయసీమలయందు విజ్ఞానముదయించి ఆత్మ వికాసము గలుగు సాధనంబులను నిర్ణయించి సేవించుట ఆంధ్రపుత్రులకు విధ్యుక్త కృత్యము. ప్రజలయందు విజ్ఞానమును వ్యాపింప జేయుటకు జాతీయ గౌరవంబును గాపాడుటకును మాతృభాషయే పరమ సాధనము, మాతృభాషా ముఖమున దేశమును, భాషను నుద్ధరించి ప్రజావబోధమునకై పాటుపడుట మన భావి భాగ్యోదయమునకు శుభ సూచకము. ఆంధ్ర గ్రంథాలయములకు మాతృభాషనుద్ధరించి భాషా ముఖమున దేశము నుద్ధరించుట కవకాశములు గలవు. మనకుగల యవకాశములను పరిస్ఫుటము చేయుటకు నూతనగ్రంథాలయములను స్థాపించుటయును, స్థాపితములైన గ్రంథాలయములకు కార్యనిర్వాహణమునకు దగిన సాధనములను గలుగ జేయుటయును అవసరములని గ్రహించి, గ్రంథాలయ సభ నిర్వహించుచున్న కార్యక్రమము శ్లాఘ్యము. క్రొత్త గ్రంథాలయములను స్థాపించుటకును, స్థాపితములయిన గ్రంథాలయముల నుద్ధరించుటకును సంచార కార్య నిర్వాహకులు ప్రదేశములకు తగినరీతిని నియమింపబడిరి. ఆంధ్ర వాఙ్మయము నందుగల గ్రంథ సముదాయమును వర్గీకరణము చేయుటకు బ్రయత్నములుచేయబడుచున్నవి. వెలిదండ శ్రీనివాసరావుగారు 3400ఆంధ్ర

గ్రంథములను వర్గవిభాగముచేసి 16 ముఖ్యభాగములుగను, 17 అంతర్భాగములుగను విభజించి భాషాభిమానుల కృతజ్ఞతకు బాత్రులైరి. గ్రంథాలయ కళను ఆంధ్రదేశమునందు వ్యాపింప జేయుటకు త్రైమాసిక గ్రంథము * ప్రకటింపబడుచున్నది. లోగడ ప్రచురితమైన వసంతాంకము ముచ్చటగ నున్నది; దీనియందు గతించిన మూడు మాసములయందును గ్రంథాలయములయందు గలిగిన మార్పులను దెలిపి విమర్శించుట గ్రంథాలయోద్యమమునకు లాభకరము.

నూతనశక్తి

నవశక్తి యాంధ్రుల నావహించినది. ఆ వహించిన శక్తిని దేశాభ్యుదయమునకయి వినియోగించుటయే దేశాభిమానులు నిర్వహింపదగిన ధర్మము. దేశాభ్యుదయమున కవసరమైన కామ్యార్థములను బడయుటకు రెండు సాధనములుగలవు; పాలకుల సాహాయ్యము, ప్రజల స్వయంసహాయము. రాజకీయ విషయములకు పాలకుల సహాయము కొంతవరకవసరమైనను కామ్యార్థములను బడయుటకు, సకల విషయములకును స్వయంసహాయము మూలబీజమని గ్రంథాలయముల చరిత్రవలన విదితమగుచున్నది. రాజకీయ సభలయందును, సాంఘిక సభలయందును క్రియలేనిభావములు వివాదములకు గారణంబులుగ నున్నవి. సభా సమావేశములు భావప్రకర్షణముతో నారంభమై భావనిర్ణయముతో నంతము నొందుచున్నవి. గ్రంథాలయ సభలు కార్యక్షేత్రములతో నారంభమై కార్యవ్యాపనమునకు సోపానంబు లగుచున్నవి. గ్రంథాలయసభకు ప్రతినిధులు గ్రంథాలయ నిర్వాహకులు. గ్రంథాలయముల ప్రతినిధులు కార్యశూరులుగాని వాక్శూరులుగారు. స్వయంసహాయావలంబనులుగాని నివేదనావలంబనులుగారు. త్యాగపరులుగాని స్వార్థపరులుగారు. సేవానిరతులుగాని లాభార్థులుగారు. వ్యగ్రోత్సాహ భరితులైన యువజనులుగాని సుస్థిరమతులైన స్థవిరులుగారు. మాతృభాషాభిమానులుగాని

* గ్రంథాలయ సర్వస్వము—త్రైమాసపత్రిక

మాతృభాషా నిరపేక్షకులుగారు. మన మాతృభాషోద్ధరణము మన మాతృదేశోద్ధరణము యువజనుల యధీనమునందున్నది. మనలనుద్ధరించుటకు లక్షపరిమితిగల యాంగ్లభాషా పరిచయులు సమర్థులో, కోట్ల పరిమితిగల మాతృభాషాసేవకులు సమర్థులో స్వదేశాభిమానులందఱును విచారించి నిర్ణయించి స్థిరసంకల్పములను గలిగియుండవలయును.

మాతృభాష

ప్రజలయందు విజ్ఞానమును వ్యాపింపజేయుటకు మాతృభాషగాక సాధనాంతరము లేదని దేశాభిమానులును, విద్యాభిమానులునునైన ప్రాజ్ఞుల యభిప్రాయము.

మన మాతృభాష కళాశాలలందును, ఉన్నత పాఠశాలలందును విద్యాశిక్షణమునకు ప్రధాన సాధనముగఁ బరిగణింపబడినగాని మన సంకల్పము నెఱవేఱి ప్రజాసామాన్యమునందు విజ్ఞానము వ్యాపించుటకు సాధనమేర్పడదు. విదేశీయులయిన పాశ్చాత్యపండితులును, మాతృభాషా నిరపేక్షకులైన స్వదేశ పండితులును ఈ తత్త్వార్థమును త్వరలో గ్రహింతురనుటకు సూచనలు లేవు. ఆ లోపమును నివారించి మాతృభాషాభిమానమును వ్యాపింపజేసి మాతృభాషను వికసింపజేయుటకై ఆంధ్ర గ్రంథాలయములు చేయగల మహాకార్యములనంతములు గలవు. యువజనుల స్వయం సహాయ సంకల్పము, కార్యపరతంత్రత, త్యాగపరత్వము, వ్యగ్రోత్సాహము, సేవానిరతి, మాతృభాషాభిమానము, గ్రంథాలయముల వ్యాపనమునకును గ్రంథాలయముల సుస్థితికిని వినియోగమైనపుడు ఆంధ్ర గ్రంథాలయంబులు భాషానిలయంబులై, సరస్వతీ నికేతనంబులై, భాషాభ్యుదయంబునకును, విజ్ఞానవ్యాపనంబునకును సాధనంబులు కాగలవు.

గ్రంథాలయముల ప్రయోజనము

జాతీయవికాసంబున కవసరంబైన వివిధ వ్యవహారంబులందును గ్రంథాలయములకు ప్రమేయముండినగాని గ్రంథాలయములు దేశము

నకును, భాషకును, ప్రజలకును సాధ్యమైన ప్రయోజనకారులుగావు. వ్యక్తి వికాసమునకవసరములైన వివిధోద్యమములను నిర్వహించుటకు గ్రంథాలయములు సాధనములుగ నుండవలయును. గ్రంథపఠనము, పత్రికాపఠనము గ్రంథాలయములవలన గలుగగల ప్రయోజనము నందొకవంతు మాత్రముగనున్నది. గ్రంథాలయంబులు, పఠనమందిరంబులు వ్యాయామ నిలయంబులై, కళాక్షేత్రంబులై, సేవాసదనంబులై, విద్యాలయంబులై, సుందరమందిరంబులై, నాటకరంగంబులై ధర్మసంరక్షణ సాధనంబులై విరాజిలునపుడు జాతీయ వికాసంబునకు మహత్తరంబైన సాధనంబులు కాగలవు. ఆంధ్రగ్రంథాలయంబులు, పఠనమందిరంబులు ఆంధ్ర వ్యక్తి వికాసంబున కేరీతిని దోడ్పడగలవో సభాకార్యక్రమమువలన నిర్ణీతము కాగలదు. గ్రంథాలయములను సాంఘిక జీవన వికాసమునకు దగిన సాధనంబులను జేయుట సమంజసంబు.

ఆంధ్రదేశమునం దనంత రూపములనుదాల్చి విహరించుచున్న నూతనశక్తికి గమ్యస్థానము ఆంధ్రవ్యక్తి వికాసము. ఆ మహాశక్తి ప్రభావము వర్ణనాతీతము. ఆరాధకుల యోగ్యతకు దగిన భావరూప విలాసంబులతో వారిహృదయ క్షేత్రంబులం దా మహాదేవి విహరించుచుండును. రాష్ట్రవాదులకు రాష్ట్రరూపమున ప్రసన్నమగును. సంఘసేవకులకు సంఘరూపమున గోచరమగును. భాషాసేవకులకు పుస్తకరూపమున ప్రత్యక్షమగును. జిజ్ఞాసులకు విజ్ఞానరూపమున స్ఫురించును. ఆ మహాశక్తిని సేవించినరాజులు, కవీంద్రులు, భక్తులు, జ్ఞానులు, పండితులు, సామాన్యులు కామితార్థములను బడసి శాశ్వతమైనకీర్తిని గడించిరి. గ్రంథాలయ నిర్వాహకులును, నిష్కామ చిత్తవృత్తితో భాషామతల్లిని సేవించిన కామితార్థములను బడయనోపుదురు.

— గ్రంథాలయ సర్వస్వము - ప్రథమ సంపుటము చతుర్థసంచికనుండి

# నాల్గవ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, బారువ
[ 1917 మే 6, 7 ]

### శ్రీ భూపతిరాజు వేంకటపతిరాజు

ప్రాచీన గ్రంథాలయోద్యమము

గ్రంథములన్న మనవారికి మొదటినుండియు ప్రాణముకంటె ప్రియమగునప్పుడు ధనముకంటె ప్రియమని వేఱే చెప్పనక్కఱలేదు గదా! అందుచే పండితుల గృహములేకాక పామరుల గృహములును గ్రంథాలయములుగా విలసిల్లుచుండినవి. ఇవి గృహస్థగ్రంథాలయములు. ఇక రాచనగరులు, దేవాలయములు, మఠములు గ్రంథాలయములుగా ఒప్పెడివని చెప్పనక్కఱయేలేదు. ఇవి సార్వజనిక గ్రంథాలయములు. మనదేశపు గ్రంథాలయ విభాగమిట్టిదే యనవచ్చును. దేశమునకు తటస్థించిన ఉపద్రవములచే మనసార్వజనిక గ్రంథాలయములు చాలవరకు నశించినవి. పోగా మిగిలినవానిలో పురాతనమై ప్రసిద్ధికెక్కి మనతల్లిభాషతో సంబంధించినది తంజావూరి గ్రంథాలయము; ఇదిపదునేడవ శతాబ్దారంభములో వెలసినది. దీని తరువాతిది, చెన్నపురిలో బ్రౌన్‌దొరగారి ప్రోత్సాహమువలన స్థాపితమైన ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమని నాగేశ్వరరావు పంతులుగారు నిరుడు తమఅధ్యక్షోపన్యాసమున తెలుపుచు, ఇవి రెండే ఆంధ్రపుస్తక భాండాగారములందు ప్రాచీనములనికూడ సెలవిచ్చియున్నారు. పరికించిచూడగా మఱికొన్ని గ్రంథాలయములుకూడ ఉండినట్లు స్పష్టమగుచున్నది. భరతఖండపు సర్వేయర్ జనరల్‌గాఉండిన మకెంజీ దొరగారు తయారుచేసిన ప్రాచ్యలిఖిత పుస్తకముల జాబితా 1828 వ సం॥లో హెచ్. హెచ్. విల్సను దొరగారు ప్రచురించిరి. దానిలో తెలుగున పురాణాదులు 36, చరిత్రలు జీవితములు మొ॥ 23, పద్యకావ్యములు – నాటకములు –

కథలు మొ॥ 82, లక్షణగ్రంథములు 9, జ్యోతిషము, వైద్యము మొ॥ 6 కలసి మొత్తము 156 గ్రంథములు లభించినట్లు కానవచ్చుచున్నది. ఇతరభాషాగ్రంథములును పెక్కులు జాబితాలో గలవు. ఇన్నిగ్రంథములు చేరినపుడు గ్రంథాలయ మేర్పడకుండునా? ఇది అటుండ నిండు. 1868 వ సం॥ నవంబరు 3 వ తేదీని సంస్కృత లిఖిత గ్రంథములనుగూర్చి ఇండియా దొరతనమువారు చేసిన తీర్మానము ననుసరించి గస్టవ్ ఆపర్టు దొరగారు చెన్నపురి దొరతనము వారి సెలవుమీాద దక్షిణ హిందూదేశమున సంచారముచేసి ప్రచురించిన 'సంస్కృత లిఖితగ్రంథముల జాబితాలు' అను సంపుటములలో ఆయన కనుగొనిన గ్రంథాలయములను పేర్కొనియున్నారు. అందులో విశాఖపట్టణము జిల్లాలోనివే సుమారు 30 కలవనిన తెలుగుజిల్లా లన్నింటిలోను ఎన్నోఉండుననుట స్పష్టమే. దొరగారు చూచినగృహస్థ గ్రంథాలయములలో కొన్ని అయినను ఇప్పటి మన గ్రంథాలయములవంటివి కావని చెప్పవలను పడదు. విజయనగర మహారాజుగారి గ్రంథాలయమును, బొబ్బిలిరాజుగారి గ్రంథాలయమును పలువురికి ప్రతిదినమును పనికివచ్చునవేకాని ఒకరికే ఎప్పుడో పనికివచ్చునవికావు. అట్టిదే విశాఖపట్టణములోని పరవస్తువారి గ్రంథాలయము. ఇప్పుడు 'ఆర్ష పుస్తకభాండాగారము' అనుపేరబరగుచున్నదని ఉత్పత్తినిగూర్చి కనుగొనగా 1800 సంవత్సర ప్రాంతమున ఏర్పడినట్లు తేలినది. పరిశీలించినచో ఇట్టివి మఱికొన్నికూడ బయలుపడవచ్చును. ప్రాచీన గ్రంథాలయముల నలంకరించినవి తాటాకు గ్రంథములే.

నవీన గ్రంథాలయోద్యమము

1806 వ సం॥ న తెలుగు అచ్చువచ్చినది. 1834 వ సం॥ న తెలుగు గ్రంథములు అచ్చుపడ మొదలుపెట్టినవి. అందుచే క్రొత్త గ్రంథములును బయలుదేరినవి. అచ్చు గ్రంథములు హెచ్చినకొలదిని ఇప్పటి పద్ధతిని గ్రంథాలయములు పొడచూపదొడగినవి. పాత

శాలా కళాశాలా గ్రంథాలయములు, గృహస్థ గ్రంథాలయములు, సార్వజనిక గ్రంథాలయములు వృద్ధిపొందినవి. దేశమున సంస్కార ణాభిలాష అంకురించి అందుకు సాయపడినది. ఏర్పడినకాలము తెలి సినవానిలో అంతకు పూర్వమే ఏర్పడినను 1886 వ సం॥ లో విశాఖ పట్టణమున 'సరస్వతీ నిలయము' సార్వజనిక గ్రంథాలయమైనది. 1889 వ సం॥ లో పులివెందలలో 'సరస్వతీ విలాసము' పొడమినది. 1890 సం॥ లో ఒంగోలులో సీ. వి. ఎన్. లైబ్రరీ బయలుదేఱినది. 1894 వ సం॥ లో విజయనగరమున 'సింహాచలపతిరావు లైబ్రరీ' స్థాపితమైనది. 1895 వ సం॥ లో ఉండిలో నౌరోజీక్లబ్బు ఉద్భవిల్లి నది. 1897 వ సం॥ లో కునుదవల్లిలో 'వీరేశలింగకవి సమాజము' వెలసినది. 1899 వ సం॥ లో కొల్లూరులో రీడింగుక్లబ్బు వెడలినది. 1900 సం॥ లో గుంటూరునందు 'యంగ్‌మెన్స్ లిటరరీ అసోసి యేషను', రాజమహేంద్రవరమున 'వీరేశలింగ పుస్తకభాండాగారము, విలసిల్లినవి. 1904 వ సం॥ లో హైదరాబాదులో 'కృష్ణదేవ రాయాంధ్ర భాషానిలయము' ఏర్పడినది. అప్పటినుండియు గ్రంథా లయోద్యమము క్రమక్రమముగ వృద్ధిపొందుచు వచ్చినది. అంతలో భరతఖండ మందంతటను జనుల మనంబుల నూతనోత్సాహ ముత్పత్తి అయినది; వివిధ సంస్కార రూపములతో విజృంభించినది. 1907-8 సం॥ లలో గ్రంథాలయములసంఖ్య పెచ్చుపెరిగినది. 1911 వ సం॥ న బెజవాడలో రామమోహన ధర్మపుస్తక భాండాగారము పొడచూపినది. 1913 వ సం॥ లో ఆంధ్రోద్యమము ప్రారంభమైనది. దానితో ఆంధ్రుల ఉత్సాహము హెచ్చినది. గ్రంథాలయముల సంఖ్యయును తిరిగి పెరిగినది. 1914 వ సం॥ లో రామమోహనధర్మ పుస్తక భాండాగారమువారు ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ బెజవాడలో జరిపినారు. రెండవ సభ రాజమహేంద్ర వరముననను, మూడవది నెల్లూరులోను జరిగినవి. మొదటి మూడు సంవత్సరములును పట్టణములలో జరిగి ఈ సంవత్సరము ఈ బారువ

గ్రామములో జరుగుటయే గ్రంథాలయోద్యమ శక్తిని వేనోళ్ల చాటు చున్నది. మొక్కకు జీవశక్తి బాగుగా ఉండినగాని వేళ్లువేయజాలదు. అటులే ఏ యుద్యమముగాని తగినంతబలము కలిగియున్నగాని పట్టణ ములనుండి పల్లెలకు రానేరదు. మన ఉద్యమములలో పల్లెలయందు బాగుగా వ్యాపించినది గ్రంథాలయోద్యమమే. కాన మనజతనపు మొక్కలన్నింటిలో బాగుగా వేళ్లుదన్నినమొక్క గ్రంథాలయోద్య మమే అని చెప్పకతప్పదు; ఒప్పుకొనక తప్పదు.

1914 వ సంవత్సరము మేనెల 10 వ తేదీని శ్రీకృష్ణదేవరాయ గ్రంథభాండాగారము స్థాపించి, ఈ సంవత్సరము ఆంధ్రదేశ గ్రంథా లయ ప్రతినిధుల మహాసభను ఇచ్చట జరిపి ఆదరించుటచే దీని పేరాంధ్రదేశమున శాశ్వతముగా నెలకొనగలదు.

మన ప్రయత్నములలో వాఙ్మయాభివృద్ధి ప్రయత్నము జ్ఞాన దాయకము. స్వయంసహాయముచే చాలవరకు సఫలము చేసికొనదగి నది. దీనికొఱకు బెంగాలీలు, మహారాష్ట్రులు మొదలగువారు పాటు పడుచున్నారు. ఫలము పొందుచున్నారు. మనవారును మాసపత్రి కలు, వారపత్రికలు, దినపత్రికలు, గ్రంథమాలికలు, విద్యావిషయక సంఘములు స్థాపించి పనిచేయుచున్నారు. దీనితోపాటు గ్రంథాలయ ములును బయలుదేరినవి. ఇప్పటికి నాల్గువందలకుపైగా లెక్కకు వచ్చినవి. కాని యివి మిక్కిలి తక్కువ. విద్యార్థులుగాక చదువ నేర్చినవారు నూరుమందిఉన్న ప్రతిగ్రామమునందును గ్రంథాలయ ములు స్థాపించుట ఆవశ్యకము. ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, జపాను దేశములలోను, ముఖ్యముగా అమెరికా సంయుక్త రాష్ట్రములలోను గ్రంథాలయములు పెక్కులు గలవు. కొన్ని కోట్లకొలది విలువగల వియును ఉన్నవి. అందుచే సమస్త విషయములను తెలుపు గ్రంథ ములతోను, పటములు, చిత్తరువులు మొదలగు సాధన సామగ్రి తోడనునిండి పిల్లలకును, పెద్దలకును ఉపయోగపడుచున్నవి. భరత ఖండమున బరోడా సంస్థానములో గ్రంథాలయోద్యమము చక్కగా

వర్ధిల్లి జనోపయోగకరముగా పనిచేయుచున్నది. ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము వ్యాపించినను ధనలోపముచేతను, ఉత్సాహ లోపముచేతను జరుగవలసినంతపని జరుగక కావలసినంత సాయము జనులకు సమకూడకున్నది. ఉత్సాహ లోపమునకు కారణము మనమే. 'శ్రేయాంసి బహు విఘ్నాని' అనుమాట మనకు క్రొత్తదికాదు. ఎన్ని విఘ్నములు వచ్చినను తగ్గక నిలుచునదే సరిఅయిన ఉత్సాహము. అట్టి ఉత్సాహశక్తి మనకున్నచో రెండవలోపముకూడ త్వరలోనే చాలవరకు తీరును. కావున, గ్రంథాలయ కార్యనిర్వాహకులారా! తక్కిన ఉద్యమములను పూనుకొనువారికంటె మీరు ఎక్కువ ఉత్సాహముగలవారనియు, మీ ఉద్యమమే ఎక్కువగ వ్యాపించినదనియు, ఎక్కువగా స్థిరపడినదనియు సంవత్సరము పొడుగునను ఎక్కువగా పనిచేయుచున్నదనియు పేరుపొందినది. కావున మీ రిక సంపూర్ణోత్సాహము కనబఱపుడు; పనిచేయుడు; గ్రంథాలయోద్యమము సఫలము చేయుడు; ఇతరులకు మార్గదర్శకులగుడు. ఆంధ్రులు సంస్కారప్రియులు, నూతనోత్సాహము చూపువారుగాక కార్యశూరులనికూడ మెప్పు తెండు.

ఇప్పటి స్థితినిబట్టి విద్యార్థులకు పాఠశాలలలోను, కళాశాలల లోను భాండాగారములు కలవు. గాన పై గ్రంథాలయములందు హెచ్చుగా పెద్దలకు పనికివచ్చు గ్రంథములే కొంతకాలము వఱకు సమకూర్చుట కర్తవ్యమని తోచుచున్నది. రామమోహన ధర్మ పుస్తక భాండాగారము పిల్లలకుకూడ పనికివచ్చునటు లేర్పాటుచేసిన తత్కార్య నిర్వాహకుల ప్రయత్నము శ్లాఘనీయము. గ్రంథాలయములకు పత్రికా సమూహ మొకఅంగము. కాన అది బలపఱచుటకును, గ్రంథాలయ కార్యనిర్వాహకులు తోడ్పడవలసియున్నది. అందులో ఆంధ్రపత్రికయే మనకున్న దినపత్రిక. ఎంతో నష్టము భరించి నాగేశ్వరరావుపంతులుగా రది జరుపుచున్నారు. దాని

ప్రచారము హెచ్చింప యత్నించినగాని వారి నష్టము తగ్గుట దుర్లభము.

వాఙ్మయాభివృద్ధి

ఏ దేశమునందుగాని, వాఙ్మయ మభివృద్ధి పొందనిస్థితిలో గ్రంథాలయోద్యమము ఫలించుననుకొనుట నీరు లేక పంటపండునను కొనుటయే. కావున మన గ్రంథాలయములు మంచిస్థితిలోనికి వచ్చుటకు మంచి గ్రంథములు పెక్కులు కావలయును. ఇదివఱకున్నవి చాలతక్కువ గాన క్రొత్తవి ఎన్నో వ్రాయవలసియున్నది. అవి సులభ శైలిలో నుండవలెను. ఈ శైలికి రావుబహద్దరు కందుకూరి వీరేశలింగంపంతులుగారు మార్గదర్శకులయిరి. వారి ననుసరించి మహారాజశ్రీ వేమూరి విశ్వనాథశర్మగారు మొదలగువారు రసాయన శాస్త్రము మొదలగు కొన్ని మంచిగ్రంథములు వ్రాసి దేశమునకు చాలమేలు చేసినారు. వివిధ విషయములనుగూర్చి పద్యకావ్యములుగాని, గద్యకావ్యములుగాని హృదయరంజకముగా రచించినప్పుడే వాఙ్మయ మభివృద్ధిచెందును. ప్రచురించిన గ్రంథములు తగినవగు నపుడవి చెల్లునటులచేయుట భాషాభిమానులకు విధి. ఉన్నగ్రంథములే చెల్లనపుడు ప్రోత్సాహములేక కృతికర్తలు క్రొత్తవి ప్రచురింప జంకుదురు. గ్రంథరచనకు మితియేలేదు. కావున సమర్థులకు విషయములులేకపోవు. చదువరులు హెచ్చినకొలదిని గ్రంథములును హెచ్చుగా బయలుదేరును; మంచి గ్రంథములున్న కొలదిని చదువరులెక్కువగుదురు. కాన చదువరులును, కృతికర్తలును తమధర్మ మొనరించి వాఙ్మయాభివృద్ధి చేయవలయును.

పై భాషలలోనున్న వివిధశాస్త్ర గ్రంథములను మనభాషలోనికి తెచ్చుటబాగు. అర్థముకాని క్రొత్త సంస్కృతపదములు వాడుటకంటె వాడుకలోనున్న అన్య భాషాపదములు వాడుటయే మేలు. పావులూరి గణితము, క్షేత్రగణితము, లీలావతి మొదలగు కొన్నియే మన కిప్పటికున్న గణితశాస్త్ర గ్రంథములు. వీనిలో ఉన్న

అంశములు చాలతక్కువ. గణితశాస్త్ర సంబంధములగు అంశము లనేకములు తెలిసికొనవలసి యున్నది. కాన వానిని తెలుపు గ్రంథ ములు వ్రాయుట ఎంతో ఉపయోగకరము. ప్రజల హక్కులను తెలుపు గ్రంథములు తక్కువగా ఉన్నవి. ఈ విషయమునుగూర్చి తెలుపు ఆంగ్లేయభాషలోని పెక్కు గ్రంథములు సులభశైలిని తెనుగు చేయవలసియున్నది. అందుకు అనుగుణమైన శబ్దజాలము దొరక నపుడు సుప్రసిద్ధములైన అందలిపదములే ఉపయోగించుట యుక్తము. ప్రవేశ పరీక్షవఱకును, శాస్త్రములు దేశభాషలో నేర్పుట యుక్త మని చాలామంది అభిప్రాయపడుచున్నారు. అందు కుపయోగపడు నట్లు బాలురు చదువవలసిన గ్రంథములు నిర్జీవముగా తర్జుమా చేయుటకంటె మృదుమధురమగు శైలిని వ్రాయుటకర్తవ్యము. ఇప్ప టికి మనము వాఙ్మయాభివృద్ధికి జేసినపని వాకిలిదాటి వారణాసి ఎంతదూరమను స్థితిలో ఉన్నది. కాన, పట్టుదలతో పనిచేసినగాని కావలసిన గ్రంథములన్నియు వెలువడవు. అందుచే వాఙ్మయాభి వృద్ధిగానికాదు. కావున భాషాభిమానులందఱును ఈ విషయమున తగిన ప్రయత్నము చేయనగును.

గ్రాంథికభాష – వ్యావహారిక భాష

ఈ సందర్భమున నేనొక విషయమును గూర్చి మనవి చేయ దలచుకొన్నాను. మనలో కొందఱు మేముగ్రాంథిక భాషా వాదులము– మేము వ్యావహారిక భాషావాదులము అని భేదము కల్పించుకొని, వైషమ్యములు పెంచుకొని, ఒండొరులను శత్రువులనుగా చూచు కొనుచు వ్యవహరించుచున్నారు. ఉభయ పక్షములవారును పండి తులే; అంతేకాక దేశాభిమానులు. అట్టిస్థితిలో అవసరమగు భాషా సంస్కారము చేయరాదా? అనవసరములగు మార్పులు మానరాదా? సామాన్యులగు చదువరులకును తెలియునటుల గ్రంథములలో వ్రాయుచు వచ్చిన భాషకు బదులుగా దూష్యములై జనాదరణీయ ములుగాని పదములు కష్టపడి వెదకి చేర్చిన భాష వాడుటేల? భాషను

బట్టి వ్యాకరణముండును. వ్యాకరణమును బట్టి భాషా నిబంధనలు విద్యార్థులకు నేర్పవలసి యుండును. కాని మార్పదగిన అంశమైనను ఎప్పటికిని మార్పరాదనుట అనుచితము. అన్నిభాషలలోను కాలక్రమముగ మార్పులు జరుగుచునే యున్నవి. ఆంధ్రభాషలో గ్రంథములు వ్రాయువారు సాధారణముగా సంస్కృత పండితులగుటచేతను, సహజమగు దేశభాషలలో గ్రంథములు వ్రాయుటవలన విశేష గౌరవములేదని కొందఱు తలచుటచేతను, ఆంధ్రగ్రంథములు చాలవఱకు సంస్కృతపదములతో నిండిపోయినవి. అంతేకాదు నన్నయ భట్టకృతమని చెప్ప 'ఆంధ్ర శబ్ద చింతామణి' సంస్కృతమందే ఉండుట తటస్థించినది. లేకున్న తెనుగు వ్యాకరణము పైభాషలో ఉండుట ఏమి న్యాయము? మొన్నమొన్న వ్రాసిన చిన్నయసూరి వ్యాకరణము తెనుగు భాషలోఉన్నను సంస్కృత వ్యాకరణ పరిభాషతోకూడి సంస్కృత పదములతో నిండియేయున్నది. మార్పు సజీవభాషకు సహజము. స్థల భేదమునుబట్టి పదములకు అర్థభేదము కలుగ వచ్చును. క్రొత్తపదములు వాడుకలోనికి వచ్చుచుండును. క్రొత్తరూపములును వచ్చును. 'మోటారు బండి', 'గ్యాసులైటు', 'రేడియం' 'రామ్యూయడు' మొదలగు పదములకు ఎప్పుడును, ఎవరును వాడని క్రొత్తపదములు కష్టపడి కల్పించుటవలని ప్రయోజనము కానరాదు. అటులే మన భాషలో 'విమానము' అనుపదము వాడుకలో ఉన్నప్పుడు 'ఎయిరోప్లేను' అనియు, 'వేళ ఎంతయినది' అనుటకుబదులు 'టైమెంతయినది' అనియు అక్కరమాలిన అన్య భాషాపదములు వాడుటయు హాస్యాస్పదమే. కాన 'అతి సర్వత్ర వర్జయేత్' ను నీతినిబట్టి ఉభయ పక్షములవారును సహజ లక్షణము చెడకుండ భాష నభివృద్ధి చేయ పూనుకొనుట ఉత్తమము.

ఇంగ్లీషుపదములు కలిపి వాడిన భావము సులభముగా బోధపడునపుడు ఉపన్యాసకులు డొంకతిరుగుడుగా సభలలో ప్రసంగింపవలసిన నిర్బంధమేమి? అన్యదేశ్యములు మన పూర్వకవులే స్వేచ్ఛ

గా వాడినారు. ప్రతికాధిపతులును, పత్రికా విలేఖకులును తోడుపడిన యెడల భాష చాలావఱకు అభివృద్ధి కాగలదు.

స్వభావసిద్ధములగు వర్ణనలతోను, చక్కని ఉపమానముల తోను సులభశైలిని గ్రంథములు వ్రాయుట పూర్వులపద్ధతి. ఆ సదాచారమును వదలి మధ్యకవులు తమ పాండిత్యమును కనబఱచుటకో, ప్రభువుల మెప్పునొందుటకో అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలు పెంచి శబ్దాడంబరముతో కఠినశైలిని గ్రంథములు కూర్ప మొదలిడిరి. ఆ దురాచారము పెక్కురు కవులకు రుచ్యమయినది. అయినను ఇప్పుడిప్పుడు మన కృతికర్తలు కొందఱు స్వభావసిద్ధముగా గ్రంథములు వ్రాయు పూర్వాచారము నవలంబించుట మెచ్చదగినది. కవులందఱును ఈ మంచిదారిత్రొక్కి భాషకును, దేశమునకును మేలుచేయుదురుగాక! కవులు నిరంకుశులే కాని వారు తమ స్వాతంత్ర్యమును మంచికై ఉపయోగించిన మేలుగదా!

ఆంగ్లేయ భాషలో పాండిత్యముగల మహాదేవ గోవింద రనడేగారు మాతృభాషయగు మహారాష్ట్రములోను, రమేశ చంద్ర దత్తుగారును, రవీంద్రనాథఠాగూరుగారును స్వభాషయగు బంగాళీలోను,ఇటులే ఇంగ్లీషు భాషయందారితేరిన స్వదేశ పండితులు పెక్కురును గ్రంథములు వ్రాసి పేరు పొందిరి. అట్టివారు, మనవారును కొందఱీ పద్ధతి ననుసరించి వ్రాయుచున్నారు. కాని పలువురీ పనికి పూనుకొనినగాని త్వరలో వివిధవిషయములను గూర్చి తెలుపు గ్రంథములు గ్రంథాలయముల నలంకరింపవు కాని, ఇంగ్లీషు తెలుఁగు భాషలు రెండును తెలిసిన పండితులు మంచి గ్రంథములు వ్రాసినచో చాలమేలు.

గ్రంథ సంపాదనము

అచ్చుపడిన పుస్తకములు చేర్చుటతోనే గ్రంథాలయముల పని పూర్తికానేరదు. మనదేశమున తాటాకు పుస్తకములు పలువురి యిండ్లలో ఉన్నవి. కొందఱు తాము ప్రాణమువలె చూచుకొనుచు

దాచుకొని గ్రంథము లీయరనుట నిజమే కాని, తగినంత ప్రయత్నము చేసి జాగ్రత్తగా ఉండునను నమ్మకము కలిగించినయెడల చాలమంది తమ గ్రంథము లీయకపోరు. అచ్చుపడినంత మాత్రమున గ్రంథముల వ్రాతప్రతులు వదలి వేయరాదు. ప్రాత వ్రాతప్రతులవలన లిపి భేదములు తెలియవచ్చుటయేగాక పాఠాంతరములుకూడ బయలుపడును. ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ఈ విషయమున చేయుప్రయత్నము మిక్కిలి మంచిది. వ్రాతప్రతులు సంపాదించుటకు చేయుయత్నమే అచ్చుపడినవానిని గూర్చికూడ చేయనగు. భాండాగార నిర్వాహకులు కొందఱు కొంతవఱకు పై పద్ధతులవలంబించి పనిచేయుచున్నారు. కాని, హెచ్చు మేలుకలుగవలెనన్న ఇదివఱకు చేసినదానికంటె హెచ్చు ప్రయత్నము చేయవలసియున్నది.

దొరతనము వారి సాయము

గ్రంథాలయములకు దొరతనమువారు సాయము చేయవలసియున్నది. కావున 'కోఆపరేటివ్ సొసైటీల' వలెనే ఇవియును ధనవ్యయములేకుండ రిజిస్టరీ చేయించుకొనుట కవకాశమిచ్చి రిజిస్టరీ అయినవానికి వ్యవసాయము, ఆరోగ్యము, పరిశ్రమలు మొదలగు వానిని గూర్చి తాముచేయు ప్రచురములు ప్రతికాధిపతుల కిచ్చునట్లె ఇచ్చుచు, గ్రంథాలయముల వృద్ధికొఱకు క్రొత్తగా కొను గ్రంథముల విలువలో సగము ప్రభుత్వమువారుగాని, మున్సిపాలిటీవారుగాని, బోర్డువారుగాని ఉచితముగా దయచేయించుటకూడ ముఖ్యమని నా అభిప్రాయము.

మన గ్రంథాలయములలో ప్రాచీనమయినదగు తంజావూరి భాండాగారము ఇంగ్లాండునకు తీసికొనుపోవు ప్రయత్నము జరుగుచున్నట్లు తెలియవచ్చుచున్నది. అది నిజమేఅయిన యెడల దయచేసి దొరతనము వారీ దేశమునుండి అది తొలగింపకుండ జేయ ప్రార్థితులు.

గంజాం విశాఖపట్టణము జిలాలస్థితి

గంజాం జిల్లాలోను, విశాఖపట్టణము జిల్లాలోను ఉండవలసినన్ని గ్రంథాలయములు లేకపోవుట శోచనీయము. రెండు జిల్లాలలోని పెద్దలును శ్రమతీసికొని, ఎక్కువ గ్రంథాలయములు స్థాపింప ప్రయత్నించుట కర్తవ్యము. విశాఖపట్టణముజిల్లా శృంగవరపుకోట తాలూకా గొల్జాము గ్రామములో ఆంధ్ర సరస్వతీ పుస్తకభాండాగారమునకు కార్యదర్శిని అగు శ్రీమతి తూర్పాటి సన్యాసమ్మగారు శూద్రస్త్రీ. ఆ గ్రామములో శూద్రులు మాత్రము కలరు. విద్య నేర్చినవారు చాలతక్కువమంది. అట్టిస్థితిలో ఆమె గ్రంథాలయము స్థాపించుట, 1100 గ్రంథములు చేర్చుట, పెక్కుమంది అక్కడకు వచ్చి చదువునట్లు చేయుట, చదువు లేనివారికి గ్రంథములు చదివి వినిపించుట శ్లాఘనీయములు. స్త్రీలే ఉత్సాహముతో పనిచేయుచున్నపుడు పురుషులీ విషయమున అశ్రద్ధచేయుట ధర్మముకాదు.

గ్రంథాలయ సర్వస్వము

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు గ్రంథాలయాభివృద్ధికై చేయుప్రయత్నములు సర్వజన సమాదరణీయములు. అందులో గ్రంథాలయ సర్వస్వము ప్రచురింప బూనుకొనుట మిక్కిలి యెన్నదగియున్నది. ప్రథమసంపుటము నాలుగు భాగములుగా ప్రచురించినారు. దానివల్ల రు. 504-4-0 నష్టమువచ్చినను వెనుదీయక రెండవసంపుట భాగములు ప్రచురించుచున్నారు. గ్రంథాలయముల పక్షమున ఏదో పత్రిక ఉన్న యుక్తముగా నుండునని ఈ మహాసభ ద్వితీయాధ్యక్షోపన్యాసాంతమున సూచింప బడినది. గ్రంథాలయ సర్వస్వము బయలుదేఱి ఆలోపము తీర్చినది; దానియందలి అచ్చు, చిత్రపటములు, మనోహరముగా నున్నవి. విషయములు జ్ఞాన దాయకములు. కాని దానికి నష్టముకలుగుటచూడ తగినవానికి తోడ్పడు నేర్పు మనవారికింకను కలుగలేదుగదా! యని చింతిల్లవలసి వచ్చుచున్నది. త్వరలో మనకీ లోపము తొలగుగాక! ఆంధ్రదేశ గ్రంథా

లయ సంఘమువారు కార్యశూరులు; మార్గదర్శకులు. అట్టివారెవ రికి పూజ్యులుకారు? ఇక తమ సహజౌదార్యముతో గ్రంథాలయ సర్వస్వమునకు నూరురూపాయల వార్షిక మేర్పఱచి, వారికి తోడ్పడి ఇతర ధనవంతులకు మార్గదర్శకులైన శ్రీ పిఠాపురం రాజుగారు మనకందఱకును మాననీయులని వేఱె చెప్పనక్కఱలేదుగదా?

గ్రంథాలయముల ముఖ్యపుపని

గ్రంథాలయములు బయలుదేఱినవి; బయలుదేఱును; పని చేసినవి; చేయుచున్నవి; చేయును. కాని అవి ముఖ్యముగా చేయ వలసినపనియేమి? గ్రంథసంపాదనమా? అదేకాదు; బడులుపెట్టుట, పురాణములు చదువుట మొదలగువానివల్ల జ్ఞానదానమా? అది యును ఇప్పటివలెకాదు; అనగా దీనితోను, దానితోను ఏదో మిడి మిడి జ్ఞానము కలిగించుట మాత్రముకాదు; ఒక్కొక విషయము నందు కావలసినంత జ్ఞానముకలిగించి, అది లాభకరముగా చేయు టయే గ్రంథాలయముల ముఖ్యపుపని. ఎట్లందురా? దయచేసి వినుడు. గ్రామములందును, పట్టణములందునుగదా గ్రంథాలయము లుండును. గ్రామములయందలి జనులకు ఏవో కొన్నివృత్తులే ముఖ్య ములుగా ఉండును. పట్టణములయందలి వారలకు పెక్కువృత్తు లున్నను, అక్కడను అందులో కొన్నియే ముఖ్యములగును; ఒక్కొక చోట ఒకటియే ముఖ్యమయి యుండును. మనదేశపు ముఖ్యవృత్తి వ్యవసాయము. పట్టణములకంటె పల్లెలే భరతఖండమున ఎన్నోరెట్లు హెచ్చు. అందుచే మనదేశమనగా పల్లెలే. అందుచే వ్యవసాయమే పెక్కు పల్లెలలో ముఖ్యవృత్తి; కాన అట్టిచోట్లనుండు గ్రంథాలయ ములు వ్యవసాయముతో సంబంధించిన గ్రంథసామగ్రి సాధ్యమగు నంతవఱకు సంపాదించి క్రొత్తసంగతులు బోధించి, ఆవృత్తి అభివృద్ధి చెంది లాభకరమగునటుల చేయవలె. కొన్ని గ్రామములయందు నేత ముఖ్యవృత్తిగా ఉండును. ఆస్థలములయందుండునవి నేతనుగూర్చిన పుస్తకములుచేర్చి, క్రొత్తసులువులునేర్పి, ఆవృత్తి కొంతవఱకైనను

నిలిచి లాభము కలిగించునటుల చేయవలె. ఇటులే వడ్రంగము, కమ్మరము, కంచుపని, రాగిపని, వెండిపని, బంగారుపని, వెదురుపని, మట్టిపని, దంతపుపని, వాణిజ్యము, వైద్యము, కవిత్వము, సంగీతము, నాటకము, చిత్రలేఖనము మొదలగు వృత్తులలో ఒకటి ముఖ్యముగా ఉన్న ఒకదానినిగూర్చియు, కొన్ని ముఖ్యములుగా ఉన్న కొన్నిటిని గూర్చియు, పెక్కులు ముఖ్యములుగాఉన్న పెక్కింటిని గూర్చియు తెలుపు గ్రంథములును, పనిముట్లును వీలుకొలదిని ఒక్కసారియే కాకున్న క్రమక్రమముగానైనను జాగ్రత్త పెట్టి, ఆయా వృత్తులవలంబించువారికి సాయపడి, వారికి సుఖజీవనోపాధి కలిగించుటయే గ్రంథాలయోద్యమ పరమావధిగా ఉండవలెనని నా కోరిక! గ్రంథాలయము లిదే తమ ముఖ్యపు పనిగా ఎంచి పనిచేయుటకు తగిన సదుపాయములు పరాత్పరానుగ్రహమున లభించుగాక!

— గ్రంథాలయ సర్వస్వము, ద్వితీయ సంపుటము 3, 4 భాగములనుండి.

# ఐదవ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, విశాఖపట్టణము

## [ 1918 జూన్ 22, 23 ]

## శ్రీ విక్రమదేవ వర్మ *

భారతవర్షమున బూర్వకాలమునందు బ్రభు సౌధములును, దేవ ప్రాసాదములును బండిత సామంతజన విశ్రాంతంబులును, బౌద్ధ విహారములును బుస్తక భాండాగారములై పరగుచుండెను. శారద నవరాత్రులందు బుస్తకరూపిణీ సరస్వతీపూజ విధింపబడి యుండుట వలన బెద్దలకు బొత్తములయందెట్టి బత్తియుండెనో మనకు తేట తెల్లముగ దెలియుచున్నది. పూర్వకాలమున మహోత్కృష్టములగు గ్రంథములు మాత్రము పండిత మాన్యతను బడసి, భూర్జపత్రముల పైని, దాళపత్రములపైని లిఖింపబడి భాండాగారముల సేకరింపబడుచు బెన్నిధానములుగ నెన్నుకొనబడుచుండెను. గ్రంథముల సంగ్రహింప దలచినచో దూరాధ్వములు గడచి, శ్రమములకోర్చి, బహుళాయాసమున లిఖించుకొని వాంఛలను బరిపూర్తి గావించుకొనవలసి వచ్చుచుండెను. ఇంచుకేని పాండిత్యములేనివారలకు గ్రంథాలయ సందర్శనమే దుర్ఘటముగా నుండెను. స్వహస్తలేఖనము వలన మన పండితులకు దెలియుత్తైముల చాలనదగు వ్రాలును, గీలెఱింగిన చదువును నలవడుచుండెను.

అక్షర చణులగువారు లిపికారత్వమున వింత నైపుణిని బొంది యుండెడివారు. విచిత్రలేఖనమున నుత్తమ గ్రంథములు మాలికలు గను, వీవనలుగను, మత్స్యాకృతిని, బక్షిరూపముననుం, నింకను బలుదెఱంగుల వ్రాయబడుచు సరసుల హృదయముల నాకర్షించు

---

* ఆహ్వాన సంఘాధ్యక్షులు



శ్రీ భూపతిరాజు వెంకటపతిరాజు



శ్రీ విక్రమదేవవర్మ

చుండెను. ముద్దులు మూటగట్టుచు మఱిచూచినతోడనే కనుల నరి
కట్టివైచుచు నక్షత్రమాలికవలె బ్రకాశించు నక్షరపంక్తి యిప్పుడరు
దయి తోచుచున్నది. లేఖన కళాదీప్తి మందమై కానవచ్చుచున్నది.
అచ్చువలె వ్రాయనేర్చిన లిపికారుల నేర్పు నశింపకుండ దగు ప్రయ
త్నములు సలుపబడుంగాక! ప్రపంచముయొక్క పూర్వచారిత్ర మా
యా దేశముల వాఙ్మయమువలననే తెలియదగియున్నది. యుగాంత
రముల గడచి సమధిక వయో జీర్ణదశచే గృశించినట్టియు నట్టి కావ్య
ముననే వింత తేజమున విరాజిల్లు విజ్ఞానమయమగు ప్రాచీనభాషా
వాఙ్మయమే ప్రపంచ చారిత్రమునకు మూలాధారమై యున్నది.
అస్సిరియా దేశపు శిలీముఖాక్షర శాసనములును, ఈజిప్టు రాజ్యమం
దలి పక్షిమృగాంకాక్షర పంక్తులును, నశోకుని జయస్తంభములును,
గతయుగ నాగరకతా విశేషమును సహస్రముఖంబుల జాటుచున్నవి.
త్రయీ విద్యయందెట్టి యద్భుత నాగరకతా చిహ్నములుండునవియు
నెట్టి యాధ్యాత్మిక విద్య యుపదేశింపబడి యున్నదియు నది యనుభ
వైకవేద్యము; కాన వేరుగ విస్తరింప బనిలేదు. కాని నాగరకతారు
ణోదయ ప్రభామరీచికలు మాత్ర మందు దోచుచున్నవనియును, నట్టి
ప్రాభాత సమయమున మానవజ్ఞానము పరతత్త్వాన్వేషణమున సలిపిన
ప్రయత్నములు బాల జల్పితముల పగిది మహోపనిషద్విద్యయందు
భాసించుచున్నవనియు పాశ్చాత్యపండితులలో గొందఱు నుడువుట
యెంతమాత్రమును సరికాదు. మానుష శేముషీ ప్రభ వెలుగొంది
నంతదనుక వేదములయందును, వేద శిఖలందును బ్రతిపాదితములగు
నుత్తమరహస్యములను గ్రహించి యుండెనని చెప్పజాలము. వేద
ములు బ్రహ్మముఖోదితములైనను గాకున్నను బ్రామినుకులకంటె
బ్రాచీనములగునట్టియు, వానిని బోలునట్టియు జదువులేవియును బుడ
మిని గానరావు. అట్టి యమూల్యధనము మనపాలబడియుండ నద్దాని
మనమెట్లుపయోగించుకొను చున్నామో చెప్ప సిగ్గగుచున్నది.
త్రయీ రహస్యంబుల మాట యటుండనిచ్చి ప్రపంచ నాగరకతా

చారిత్ర పునర్నిర్మాణమునకు హేతుభూతమగు గీర్వాణభాషను గను
గొనుడు. దేవభాషయని కొనియాడబడు సంస్కృతము భాషలకెల్ల
దల్లియని ప్రసిద్ధి గాంచినది. ఆర్య జనైకభావమును బోధించినది.
అభినవ శబ్దశాస్త్ర పరిజ్ఞానమున వివిధరూపములు దాల్చి వేసములు
మాఱియున్న బాసలన్నియు నొక భాషాకల్పకముయొక్క శాఖోప
శాఖలని తెలియజెప్పినది; దేశమతాచార విభేదజనిత వైషమ్యరహిత
మగు జాతీయైక్య భావమును ప్రాక్పశ్చిమదేశ విజ్ఞాన ధర్మైక్యమును
ప్రబోధించినది. మఱి మన భాగ్యవశమున మన భరతఖండమునందు
నది నిక్షిప్తమై యున్నది. దానిని మన ముపయోగించుచుండిన విధ
మును దలపోయ దలలు వంచుకొనవలసి వచ్చుచుండును. లెక్కకు
మిాఱిన గ్రంథరాజములతో రాజిలుచు షట్ఛాస్త్రములు, చతుష్షష్టి
కళలు మున్నగు విద్యలకెల్ల నాకరంబై రత్నాకరంబు పగిది శోభిలు
చుండిన గీర్వాణ వాఙ్మయమంతయు మన వశమైయుండగ దేశమున
స్వాతంత్ర్య మస్తమించి సామ్రాజ్యము పరహస్తగతంబగుటకు గొంత
వఱకు విద్యలు క్షీణించి విజ్ఞానము తమోవృతము గాజొచ్చెను. మన
యాంగ్ల ప్రభువర్యులాదినుండియు దేశభాషా పోషణపరాయణులై,
దేశీయ మతాచార ధర్మపరిపాలనా తత్పరులై యుండుటను బ్రప్రథమ
మున సర్ విలియమ్ జోన్సు అను మహనీయు డైరోపా ఖండము నం
తయు నాశ్చర్య నిమగ్నము గావించిన కాళిదాస కృతమగు నభిజ్ఞాన
శాకుంతల నాటకమును నాంగ్లమున ననువాద మొనర్చి ప్రకటించెను.
తదాదిగ భారతీయులకు పాశ్చాత్య పండితవర్యులుకూడ బొగడదగిన
విజ్ఞాన విస్తరంబగు వాఙ్మయము గలదని నెమ్మది నమ్మి పాశ్చాత్య
పండితు లనేకులు సంస్కృత భాషాభ్యాసమునకు గడంగిరి. జర్మనీ,
ఆస్ట్రియా, రష్యా, ఫ్రాన్సు, అమెరికా మొదలగు దేశముల విద్వ
ద్వరేణ్యులు సంస్కృతభాషను బూర్ణముగ నభ్యసించి తన్మూలమున
బెక్కు శాస్త్ర సంతతుల నుత్పాదించి విజృంభింప జేయుటయేగాక
సంస్కృతమునగూడ మన పండితులకు దుర్ఘటములగు కార్యములను

ఘటియించిరి. మోక్షమూలరు మహాపండితుని యుత్కృష్టభాషాసేవ యందఱకును విదితమే. ఋగ్వేదమును శాయనాచార్య భాష్యముతో శ్రీమదానంద గజపతీ మహారాజేంద్ర సాహాయ్యమున జర్మనీ వ్యాప్తి జేసి శాశ్వత కీర్తిని బడసెను. ఇంకను బలువురు పలువిధంబులగు సేవల జేసియున్నారు. పాశ్చాత్యదేశీయులకు గీర్వాణ భాష యందు నూతనముగా నుదయించిన యాదరభావమునకు ఫలము మనయమూల్య పుస్తకరత్నములను మన దేశమునుండి తీసికొనిపోయి తమ తమ దేశములందలి భాండాగారముల నించుటయే. కావుననే లండను, బెర్లిను, వియన్నా, సెంటుపీటర్సుబర్గు (పెట్రోగ్రాడు) మున్నగు పాశ్చాత్య దేశ రాజకీయ పుస్తక భాండాగారములయందు మన దేశము నం దిప్పుడు సంగ్రహముగాని యమ్భుతగ్రంథము లెన్నియో స్థిర వసతిని గాంచినవి. స్వామిదయానందసరస్వతిగారు జర్మనీ నుండి తెప్పించువరకును మన నాలుగవ వేదము మన దేశమున లేకుండెను! లిఖిత ప్రతుల నన్నింటిని మహోపాధ్యాయ మోక్షమూలరు మన దేశమునుండి నిజఖండంబునకు దీసికొనిపోయి యుండుటవలన నతడు ఋగ్వేదమును బ్రకటింపకున్నచో నది మన కలభ్యమై యుండును. మన యాంగ్ల ప్రభుత్వము వారిగ్రంథ సంగ్రహణ కార్యమునగాంచె మాలస్యము సలిపినట్లు కానవచ్చెడిని. అట్లయినను బ్రిటిషు మ్యూజియములోని 56000 గ్రంథములు ప్రాచ్యవిద్యలతో సంబంధించినవని తెలియుచున్నది. వంగదేశమందలి యేష్యాటిక్ సొసైటీ మొదలగు పండిత సభలవలన గొన్ని గ్రంథములుమాత్రము సేకరింపబడి మన దేశమున నెలకొల్పబడియున్నవి. మనరాజధానియందలి యుత్తర మండలములలో విశేషకాలము పనిచేసి ప్రజల యనురాగమును గడించుకొనినట్టియు బ్రౌణ్య నిఘంట్వాది గ్రంథకర్తయునగు బ్రౌనుదొర గారి ప్రోత్సాహమున బ్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నెలకొల్ప బడినను గొలదికాలము క్రిందటివఱకును దానిని వృద్ధి బొందించు ప్రయత్నములు మిగుల సలుపబడియున్నట్లు—కానరాదు. బ్రిటిషు

ప్రభుత్వమునకు బూర్వము దేశ మశాంతిజెంది యల్లకల్లోలముగనున్న కాలమున మన గ్రంథరాజములెన్నియో మంటగలిసినవి; కొన్ని క్రిమిభక్షితములైనవి; అనేకములు నానాటికి గాలవశమున జీర్ణములైనవి. అందువలన దేశమున గలిగిన జ్ఞానవిప్లవమింతయని తెలుప శక్యముగాదు. బౌద్ధమతము దేశాంతర గతమగుటచే తదనుసరణ పద్ధతిని బెక్కు మతగ్రంథములు బౌద్ధదేశములకు బోయినవి. హానుత్సాంగను చీనాబాటసారి 600 వ్రాతప్రతులను గొనిపోయెనట. రమారమి పదునేను వందల సంవత్సరముల క్రిందటనే క్షీణదశ ప్రారంభమై పుస్తకభాండాగారములును, బుస్తకములును నశింపదొడంగినవి. కాశ్మీరము, నేపాళము, మైసూరు మొదలగు స్వతంత్ర రాజ్యములయందు మాత్ర మాది సరస్వతీపీఠము గదలక నిలిచియున్నది. తంజావూరు నగరమున నాంధ్రరాజులచేత నెలకొల్పబడిన యుత్తమ గ్రంథభాండాగారమును జర్మనులుగొని నిజదేశమునకు దీసికొని పోవ సంసిద్ధులయియుండ నీ ఘోర సంగ్రామము తటస్థించుటవలన దత్ప్రయత్న మాగెను. ఇపుడు దానిని మన దొరతనమువారే కొని మన దేశమునందే యుంచుటకు వలయు ప్రయత్నములను జేయుచున్నారని విని సంతోషించు చున్నాము. ఈ తంజావూరు గ్రంథాలయము పదునాఱవ శతాబ్దమునగాని, పదునేడవశతాబ్దమునగాని స్థాపింపబడి యుండును. అందు 18000 లిఖితగ్రంథము లున్నవని తెలియవచ్చుచున్నది. వంగదేశ స్థితాశియాసంఘ గ్రంథాలయము 1784 సం॥ నాటనుండియు వృద్ధిగాంచుచున్నది. స్వదేశసంస్థానముల యందుండు పుస్తకభాండాగారముల స్థాపనకాలము దెలియుట కష్టమయిన నది గడు బ్రాచీనమని నిస్సంశయముగ దెల్పవచ్చును. ఈజిప్టుదేశమున క్రీస్తునకుముందు 1600 సం॥కు బూర్వము పేరుగాంచిన పెద్ద గ్రంథాలయములు నెలకొల్పబడియుండెను. 36,525 మతగ్రంథములే యవన విజయము నాటి కందుగానవచ్చెనని తెలియుచున్నది. ప్రాచీనైగుప్తీయ నాగరికతయు, హైందవ నాగరికతయు సమీపసంబంధముగలవని

చరిత్రకారులు నిర్ణయించి యుండిరి. అలెగ్జాండ్రియా నగరమున 7,00,000 గ్రంథములుగల పుస్తక భాండాగారము క్రీస్తుశకమునకు ముందేయుండెనన్నచో, నిరువదియవ శతాబ్దమున బ్రిటిషు మ్యూజియమున 20,00,000 గ్రంథము లుండుట యచ్చెరువుగా దోపదు. అచ్చుకూటములును, యంత్ర సహాయమును, 'గాపీరైటు' పద్ధతులును, నవీనదేశయాత్రా సౌకర్యములును జేరి యిరువది లక్షల గ్రంథములను మాత్రము సేకరించినవి. బెర్లిను నగరమున నెలకొల్పబడిన గ్రంథాలయ మొక యాంగ్ల విద్వాంసునివలన గొనబడి వృద్ధిగావింపబడినట్లు కానవచ్చుచున్నది.

ఇన్ని గ్రంథము లిన్ని స్థలముల నిట్లు చెదిరియున్నను నింక నెన్నియో యముద్రిత గ్రంథములు, రహస్యవిషయములు గలవి దుర్గమములును, దుస్సాధ్యములునగు స్థలములను, గిరిగహ్వరములను, నూరూర దిరుగు బైరాగులకడను గానవచ్చుచుండును. శిష్యశిక్షకై మాత్రము గురుప్రసాదమున నొసంగబడుచు మఱి యేరికి నీయబడగూడదని శాసింపబడుచు బరంపరగ గైకొనబడుచుండు గ్రంథము లెన్నియోకలవు. మంత్రశాస్త్రమును, దంత్రములలో నుత్తమ గ్రంథములును నింతవరకును ముద్రితములు గాలేదని చెప్పవచ్చును. మహానిర్వాణతంత్రమను నుద్గ్రంథమొక భాగము మాత్రము ఆంగ్లమున ననువాదము గావింపబడినది. రెండవభాగ మొక నేపాళదేశ పండితునికడ నున్నదనియు, దాని ననువాదించి ప్రకటించినచో దాని మహిమ పోవునని దాని నాతడన్యుల కొసంగడనియు, గలకత్తా హైకోర్టుజడ్జీగారగు న్యాయమూర్తి ఉడ్రాఫుదొరగారు దెలిపియున్నారు. మఱియు నా గ్రంథరాజముయొక్క మహత్త్వమును గొనియాడియున్నారు. ఈ విధమున నమూల్యగ్రంథములను దాచుకొని విద్యను గాపాడు విద్వాంసు లెందఱోగలరు. కొన్ని విద్యా రహస్యములు గురుముఖమునంగాని తెలియవు. సామాన్యముగ బ్రాచీన గ్రంథములను విడుచుట గృహమేధికి గొంత కష్టముగానే యుండక మానదు.

దారిద్ర్యమున దోగుచున్నను దన తండ్రి తాతల ధనమగు పొత్తము
లను నుయ్యేలలపై నునిచి యూచుచుండుంగాని వానిని విక్రయింప
నొల్లడు. సరస్వతీ విక్రయము పూర్వకాలమున గన్యా విక్రయము
కంటె హైన్యముగా నెంచబడుచుండెను.

వర్తమాన గ్రంథాలయములు

గ్రంథాలయోద్యమము ఆంధ్రదేశమున వెలసి నాలుగు హాయనంబులు మాత్రము గడచినవి. విజయవాటిక యందీ యుద్యమము ప్రభవము చెందినది. ఈ యభినవోద్యమ ముద్భవించినది మొదలు దినదిన ప్రవర్ధమానముగ దేజరిల్లుచున్నది. ఈ గ్రంథాలయోద్యమమునకును, నాంధ్రోద్యమమునకును మూలశక్తి యాంధ్రభాషయే. ఆంధ్రభాషాసేవ యభినవ ప్రబోధముగాంచినది. ఆంధ్రోద్యమమే యిట్టి ప్రబోధమునకు గార్యరూపమై యున్నది. నూతన జాతీయ తత్త్వ వికాసము దేశమందెల్లయెడల నిండు దీధితులతో దేజరిల్లుచుండునప్పుడును, దదన్వీక్షణమున బ్రజల హృత్సరోజములు వికసించి యున్నతాదర్శ సౌరభ సంవాసితములై నెత్తావుల దిశల వెదచల్లుచుండునపుడును, మహోన్నత భావాదర్శ విజృంభణమునకు సాధనభూతముగ మాతృభాషాభ్యసనానురక్తియు, దేశభక్తియు, నూతనశక్తియు బ్రేరేపింప మాతృరూపిణియగు నాంధ్ర సరస్వతి తన దివ్యరూప సాక్షాత్కారము నాంధ్రులకొసంగి తనియం జేసినది. ఆంధ్ర వాఙ్మయము సర్వ కావ్యకళా నాటకాది వివిధ గ్రంథమాలాంతరంగ వీచీవిక్షోభ సంఘూర్ణిత మహావారాన్నిధివలె గంభీర నిర్ఘోషమున నుప్పొంగుచున్నది. శిల్పు లంగుళీక మణులందు శిల్ప నైపుణ్య మొప్ప విచిత్రములను జెక్కినట్లు పూర్వకవులు ప్రబంధములందు గల్పనా చాతుర్యము దీపింప శృంగార రసప్రధానకవితనె చెప్పుచుండిరి. ఇప్పుడట్లుగాక యాంధ్రవాఙ్మయ మతి విశాలదృష్టితో సర్వప్రపంచము నావరింప దలచి భూనభోంతరముల దాకుచు మహోన్నత భావవస్తు పరికల్పనా కౌశలమున నానందించుచున్నది.

అట్టి నవ్యాంధ్ర సరస్వతీపర్యటనమున కుత్తమ యానము వచనకావ్య రూప మరాళమైయున్నది. ఆంధ్రవచనకావ్య రచన ఆధునికమైనను అది నూతనభావగుంభితమై, యసమాన పటుత్వ చాతురీ విలసితమై, మఱి లసదనూనా నవ్య నవ్యాలంకార శోభితమై చదువరుల హృదయమ్ముల కిమ్మగు భావములను, గొత్తరసములను దరిచిన కొలదిని విరియజిమ్ముచు సుదనాగమ్మురేవ శీవిం బ్రసరించుచుండును. రాజకీయ విషయమునను, వాఙ్మయమునను దేశమున నూతన శక మావిర్భావమును జెందినది. జనుల సాంఘిక జీవనము వాఙ్మయాదర్శ ఫలకమున బ్రస్ఫుటగతిం బ్రతిఫలించుచుండును. వర్తమానమునందు వాఙ్మయాదర్శమున జాతీయాదర్శములు బింబ ప్రతిబింబన్యాయమున బ్రతిఫలించుచున్నవి. వాఙ్మయ జీవన జాతీయ జీవనములు పరస్పరాధారాధేయ భావముగలవై యద్భుతశక్తితో విరాజిల్లుచున్నవి. వాఙ్మయమునకును, ప్రజాహిత జీవనమునకును నవినాభావ సంబంధముగలదు. సాంఘిక జీవనమునగల గుణాగుణములు వాఙ్మయనికషోపలమున బరీక్షింపబడి పరిశుద్ధిగాంచుచుండును. ఆంధ్రత్వ మన్నియెడల సహస్రధా ప్రకాశించుచున్నది. శాస్త్రములు, కళలు, చరిత్రములు, జీవితచారిత్రములు, విమర్శనములు చాటువులు మొదలగు సమస్త విషయములును వాఙ్మయమున బ్రవృద్ధి గాంచుచున్నవి. ప్రపంచము నందంతట నుత్తమ నాగరకతగల దేశములయందు దేశభాషలు సమస్త విజ్ఞాన సంపన్నములగు గ్రంథరాజములచేత విలసిల్లుచున్నవి. భారతవర్షమున మాత్రమట్టి యుద్యమ లాభము సంపూర్ణముగ నింతవరకు జేకురలేదు. వంగ ఘూర్జర మహారాష్ట్ర భాషలందు నీ మహోద్యమము చాలవఱకు బెంపుజెంది యున్నది. ఆంధ్రమునను, నా మాతృభాషయగు నోఢ్రమునను నీ నవీనోద్యమము మొలకలెత్తుచున్నయది. అచిరకాలమున నీ పవిత్ర వాఙ్మయములు రెండును సమున్నత దశనుజెంది శాశ్వత సంపదతో దులదూగుచుండునట్లు జగ

దీశ్వరు డనుగ్రహించునుగాత! మృదుమధుర గంభీరస్వరయుతమై, మానుషబుద్ధి గ్రాహ్యంబులగు నైహికాముష్మిక సంబంధము లయిన సమస్త విషయములను లలిత పద విన్యాస క్రమమునను బాఠకుల మనంబుల జేర్చ సమర్థంబైన సంస్కృత సాహిత్యము గలదియై యాంధ్రభాష ప్రకృత వ్యవహారంబులను సాధింపజాలని దొకండును గలదని యూహింపజాలము. కాన భీతిలనేల? విద్వాంసులకొక విజ్ఞాపనము:- ప్రాచీన గ్రంథముల బరిశీలించి ప్రకృతోపయుక్తములగు భాషా పరికరముల సేకరించి రూఢియగు నర్థములను, బదములను నిర్వచించి వ్యవహారమున బ్రసరించునట్లు గావించుట కర్తవ్యమైయున్నది వంగీయ సాహిత్య పరిషత్తు మొదలగు విద్వత్సభలు గావించుచున్న పనిని మన యాంధ్ర పరిషత్తుగూడ జేయబూనవలసియున్నది. కౌటిల్యుని యర్థశాస్త్రము నొకదానిని గ్రమముగ జదివి చూచినచో రాజకీయ వ్యవహార విషయమున నుపయుక్తములగు పదము లెన్నియో కానవచ్చుచున్నవి. కొలది యుదాహరణము లిందు గైకొందము:- లక్షణాధ్యక్షుడు = Superintendent of mint, రూపదర్శకుడు = Examiner of coins, ఆగంతులవణమ్ = Imported Salt, వర్తని=Road Cess, సంకుల దోషమ్ = Centralisation, సర్వదేయ విశుద్ధమ్ = free from all taxes, యాత్రావేతనమ్=Ship freight, శాసకుడు = Captain of a Ship, మంత్రి పరిషత్తు = Cabinet or assembly of ministers, కర్మాంతికుడు = Superintendent of manufactories. ఈవిధముగ రాజకీయ వ్యవహారమున బెక్కు విధములగు పనులకును, దదధ్యక్షులకును బేర్లు గానవచ్చుచున్నవి. దీనినిబట్టిచూడ వర్తమాన వ్యవహారము ప్రాచీన హైందవ రాజ్యాంగ విధానముకంటె హెచ్చు విస్తృతిగలదిగా గానరాదు. ఇతర శాస్త్రములందుగూడ నీ విధముననే ప్రకృతోపయోగములగు పదములును, భావములును దొరకుట కభ్యంతర ముండదు. శాస్త్ర విషయముల జర్చించుటలో నాంధ్రమునకేకాక దేశభాష

లన్నింటియందును రూఢిగ నేకార్థమున నేకపదము వాడబడుట సమంజసమై యుండును. అట్లు కానిచో దేశమునందు విజ్ఞానము విస్తరిల్ల నేరదు. శాస్త్ర పరిజ్ఞానము దేశము నందంతట నొక్క విధముననే యుండవలయును. పూర్వకాలమునందు శాస్త్ర పరిజ్ఞానము సంస్కృతమువలననే గ్రహింప బడుచుండుటచేత నాసేతు హిమాచలపర్యంతము నేదేశ పండితుడైన సంస్కృతమున శాస్త్రచర్చయు, విద్యాభ్యాసమును జేసి కృతార్థత జెందుచుండెను. ఇప్పు డాంగ్లమున విద్యాభ్యాసమును, శాస్త్రపరిచితియు గలుగుచున్నను మాతృభాషా ముఖమున విద్యలభ్యసించినగాని విజ్ఞానవికాసము గలుగ నేరదనియును, బుద్ధి స్వాతంత్ర్యముగలిగి నూతన విషయములను గనిపెట్టనవకాశము లభింపదనియును, కఠినమగు నన్యభాషాభ్యాసమున లేత వయసున గ్రహణశక్తిగల కాలము వృథా చనుచుండుటచేత దుదకు మొఱకు దేఱి నైసర్గిక తేజమును గోల్పోవుటయు దటస్థించుచుండునని పెద్దలందఱు నభిప్రాయముజెంది యున్నారు. మధ్యమవిద్యయు, నుత్తమ విద్యయుగూడ దేశభాషలయందు గఱపబడినంగాని జాతీయాత్మ నైసర్గిక వికాసముతో దేజరిల్ల నేరదనియు, నందఱును గ్రహించిన విషయమై యున్నది. ఆంగ్లదేశమున విద్యానిలయములగు నాక్సుఫర్డు, కేంబ్రిడ్జి సర్వకళాశాలలు పాండిత్యమునకు మూలముగ ఖ్యాతిని, గ్రీకుభాషల నేర్పుచుండినంత కాలము ఆంగ్లభాషయు, నాంగ్లజనబుద్ధి వికాసమును, ఉత్తేజముగాంచియుండలేదు. ఆంగ్లభాషకు బ్రాముఖ్య మొసంగి విద్యనొసంగుట కా ప్రాచీన విద్యా నిలయములు గడంగిన తోడనే యాంగ్లవాఙ్మయము పెల్లు వెల్లువిరిసి మహాప్రవాహమువలె వృద్ధిజెంద దొడగినది ఆంగ్లభాషకుకూడ నవీనశక్తియు, వింత తేజమునుగలిగి పెంపొందినవి. నేడాంగ్లము ప్రపంచమున నుత్తమశాస్త్రి జ్ఞానమునకును, నుత్తమనాగరికతకును ముఖ్యసాధనముగ నగ్రస్థానము నధిష్ఠించియున్నది. ఆ తీరుననే భరతవర్షమున దేశభాషలయందు విద్య గఱపుటకు బ్రయత్నములు సలుపబడినచో జాతీయతత్త్వము

నూతనాద్భుత వికసనమును గాంచుననుట కించుకయు సంశయము లేదు. మనదేశమునం దక్క నేదేశముననైనను అన్యభాషాభ్యాసమున శాస్త్రపరిచితి గ్రహించుట గలుగదు. ఆంగ్లభాషాభ్యాసమున భారతీయులకు రవి యస్తమింపని యాంగ్లసామ్రాజ్యము నందంతటను గల విశేషానుభవము సంలభ్యమగుచున్నను బ్రకృతమున దేశకాల పరిస్థితుల ననుసరించి యుదరపోషణమునకుగాక వేఱు విధమున జన సామాన్యమునకు నాంగ్ల విద్య గొఱగాకున్నయది. దేశభాషల నభివృద్ధి గావింపవలయుననియు, దన్మూలమున విద్యాభ్యాసము సాధ్యమైనంతవరకు జరుపబడ వలయుననియు బ్రభుత్వమువారు కూడ గ్రహించియున్నారు. కాని తగిన ప్రయత్నము లింతవఱకును జరిగియుండలేదు. జాతీయ విద్య నెలకొల్పుటకై ప్రయత్నములు మహానీయులవలన జేయబడుచున్నవి. అవి సంస్తవనీయములు.. విజయనగరమునందుగూడ "నాంధ్ర విద్యానిలయము" నెలకొల్పి పండితులు గొంద ఱుత్తమ విద్యల నాంధ్రమున ప్రజలకు గఱప యత్నించుచున్నారు. అట్టి యుద్యమములను బరాత్పరుడు ఫలింపజేయును గాక! గ్రంథాలయములు ముఖ్యముగ నీ విషయమున గృషిసలుపవలసియున్నవి. ఉత్తమ విద్యాభ్యాసమునకు దగిన పుస్తక సంభారమును గ్రంథాలయములు సేకరింపవలసియున్నది. గ్రంధాలయములు గొన్ని గ్రంథరచనకు సాహాయ్యమొనరించుచున్నవి. కావున శాస్త్ర రచనకు దగిన ప్రోత్సాహమునుగల్పించి శాస్త్రాభివృద్ధిజేయుట వానికొక ముఖ్య విధియై యున్నది. రాజపోషణము గొఱవడి ప్రజా పోషణమే గ్రంథకర్తలకును, భాషా జీవనమునకును మూలాధారకమగుటం జేసి యీ కాలమున గ్రంథాలయము లీ పనికి గడంగవలసియున్నది. విజ్ఞాన చంద్రికామండలి వారి కొఱంతను గొంతవరకు దీర్చినను, అది యొకటి రెండు సంఘములవలన నెఱవేఱు పనికాదు.

గ్రంథాలయములు, రాజపోషణము

ఇప్పటి గ్రంథాలయములు నవీనాంకుర దశలోనున్నవి. అవి పెంపుజెందుట కెన్నియో సాధన సంపత్తులు గావలసియున్నవి. బరోడారాజ్యమందువలె ప్రభుత్వమువారు చేబూనినంగాని యీ యుద్యమము గొనసాగి ఫలము నిచ్చునదిగాదు. దొరతనము వారొక యుత్తమ గ్రంథాలయమును స్థాపించినంత మాత్రమున బ్రభుత్వ విధి నెఱవేఱజాలదు. గ్రంథాలయములు శాఖోపశాఖలుగ దేశము నందంతటను వ్యాపించునట్లును, బ్రజల కందఱకును సుకరముగాను, సులభముగాను గ్రంథములు లభించునట్లును జేసినంగాని విద్యవ్యాపించి దేశమున నిండియుండు నజ్ఞానతమము విరియంజాలదు. సంచార గ్రంథాలయములందులకు ముఖ్యసాధనములు. ఆంగ్లదేశమున గ్రంథాలయ పోషణమున కొక పన్ను విధింపబడుచున్నట్లు కాన వచ్చుచున్నది. అట్టి పన్నును విధించి గ్రంథాలయములను జనోపయోగముకొఱకు స్థాపించు స్వాతంత్ర్యము పత్తనాదులకు గలదు. 1850 వ సం.లో రూపొందిన పబ్లిక్ లైబ్రరీల చట్టము 1919 వ సం.నాటికి సర్వాంగీణముగ వెలసినది. దానినిబట్టి దేశమునందు హెచ్చుగ గ్రంథాలయములు స్థాపింపబడినవి. ఇంచుమించుగ బ్రతి పట్టణమందును, పెద్ద పల్లెలయందును బుస్తకభాండాగారము లింగ్లండు దేశమునగలవు. మనదేశమున దొరతనము వారట్టిపనికి దొడగియుండలేదు. ప్రజల యందీ భార మింతవఱకును నిక్షిప్తమైయున్నది. దీనిని దొరతనము వారు గొంతవఱకైనను భరియింతురుగాక! యని వేడుకొను చున్నారము. ఆంగ్లదేశమున "కాపీరైటుచట్టము" ననుసరించి యచ్చుపడిన గ్రంథము లన్నింటిని గొన్ని గ్రంథాలయములకు విధిగ బంపుచుండ వలయును. గ్రంథాలయములు వృద్ధిజెందుటకది యొక కారణము. మనదేశమున దొరతనమువారు ముద్రించు గ్రంథములనైన నుచితముగ గ్రంథాలయముల కిచ్చినచో గొంత ప్రోత్సాహకరముగ నుండును. మరియు బురపాలక సంఘములు తాలూకాబోర్డులు, మొద

లగు సంఘములు గ్రంథాలయోద్యమమునకు దోడ్పడి ద్రవ్య సాహాయ్య మొనరించుట యత్యావశ్యకము. పన్నులు హెచ్చుగనున్న మనదేశమున గ్రంథాలయముల కొఱకు గ్రొత్త పన్నును విధించుట కష్టముగా దోచును. కాని ప్రజలవలన స్థానిక పరిపాలనా సౌకర్యము కొఱకు గ్రహింపబడిన ధనమున నొక కొంత గ్రంథాలయములకై వెచ్చించినచో బాగుగ నుండును. ప్రజలకు విద్యనేర్పుట స్థానిక స్వపరిపాలనా సంఘములకున్న విధులలో నొకటియైయున్నది. బడులలో నేర్చిన చదువు సామాన్యముగ బొట్టబోసికొనుట కుపయోగించును. కాని, దానివలన నధిక ప్రయోజనములేదు. నిజముగ మానవుని చదువు బడి విడిచిన పిదప నారంభమగును. కడుపు గడుపుకొనుటకై చదువు సన్నగిల లేతవయసున బడివదలి పనులలో దిరుగువారలకు విద్యగఱప వలయునన్న గ్రంథాలయములే యాధారము. కావుననట్టి విద్యావ్యాపనమునకు సహకారులగుచున్న పుస్తక భాండాగారములకు దోడ్పడుట ప్రజాహితైక తత్పర కార్యనిర్వాహక దీక్షగల స్థానిక స్వపరిపాలనా సంఘములకు కర్తవ్యము. పాశ్చాత్య దేశములయందు లక్షలకొలది పుస్తకముల సంగ్రహించియు; నేటేట నూతన గ్రంథములను సంగ్రహించుచు హెచ్చు వచ్చుబడితో నొప్పు గ్రంథాలయము లెన్నియో కలవు. ఒక్కొక్క మహనీయుని యుదార దాతృత్వము వలనను, బూనికవలనను, కృషివలనను, నుత్తమ పుస్తకభాండాగారములు పాశ్చాత్యదేశముల యందేర్పడియున్నవి. రాజపోషణమున వృద్ధిజెందియున్నవి. ఆంధ్రూకార్నజీయను కోటీశ్వరుడు పుస్తక భాండాగారముల నెన్నియో నెలకొల్పెను. పూర్వకాలమునగూడ నా రీతినె యాక్సుఫర్డులోని బాడ్లియను లైబ్రరీ మున్నగునవి స్థాపింపబడి వృద్ధిగాంచినవి. వానిని పేర్కొనిన పిదప బేర్కొనుట కనర్హము లయినను ఈ మండలమున జనోపయోగముకొఱకు విజయనగరమున వెన్లాకు పబ్లిక్ లైబ్రరీయును, మా పట్టణమున క్యాంపుబెల్ లైబ్రరీయును నుచితముగా బ్రసాదించి మహారాజశ్రీ మహాజన పేర్లనారా

యణ శ్రేష్ఠిగారును, నాతని పుత్రులగు రావుసాహెబ్ మహాజన పేర్ల రామమూర్తి శ్రేష్ఠిగారును మహోపకారమును గావించిరి; రామ మూర్తి శ్రేష్ఠిగారింకను గావింప గలరని నమ్ముచున్నారము.

గ్రంథాలయోద్యమము

గ్రంథాలయములు చిరకాలమునుండియు దేశమున నెలకొల్ప బడుచున్నను గ్రంథాలయములు జనులచేత నాదరభావమున నుప యోగింపబడుచున్నను నీ నవీన గ్రంథాలయోద్యమము గ్రంథాల యములకు వన్నె దెచ్చినది. గ్రంథాలయ సూత్రములను గేంద్రీకృ తము గావించి యుత్తమ పద్ధతుల నడిపింప సమకట్టియున్నది. నూతన గ్రంథాలయ స్థాపనమునకును, వాని యభివృద్ధికిని, వాని కార్యక్ర మమునకును నూతనశక్తిని బ్రసాదించినది. గ్రంథాలయ కృత్యముల నిర్వచించుచున్నది; మఱి గ్రంథాలయ స్వాతంత్ర్యములను గూడ బ్రతిపాదింప సమకట్టుచున్నది. కాన నాంధ్రులందఱు నీ గ్రంథాల యోద్యమమునకు దగిన సాయమొసర్చి శీఘ్రఫలమునొందబూనని చో నుద్యమము సంపూర్ణ దీప్తినిగాంచ నేరదు. దేశమునందంతటను, బుస్తక భాండాగారములు విస్తారముగా వెలయవలెను. పట్టణముల యందును, బక్కణములయందును, బల్లెలందును, గళాశాలలందును, బాలశాలలందును, బల్లెకూటములందును నుత్తమ పుస్తకభాండాగా రము లుండవలెను. ప్రతి మండలముయొక్క ముఖ్య పత్తనమున నొక ప్రధాన పుస్తకభాండాగారమును, నాంధ్ర దేశమున కంతకును గేంద్ర ముగ నొక పుస్తకభాండాగారమును స్థాపింప బడవలయును. ఇవిగాక కొన్ని సంచార గ్రంథాలయములుకూడనుండవలెను. ఉత్తమవిద్యా భ్యాసము కొఱకును, నాధ్యాత్మిక జ్ఞానము కొఱకును, శాస్త్రాభ్యాస నము కొఱకును, రాజకీయ వ్యవహారబోధము కొఱకును, జరిత్ర పరిచ యము కొఱకును, గృషి వాణిజ్య శిల్పాది కళాకలాప విజ్ఞానము కొఱకును, బారిశ్రామిక పద్ధతుల యెఱుక కొఱకును దగు పొత్తముల తో భాండాగారముల నించుటయేగాక శాసనములను బంధకాప్రాచీన

పత్రికలను, వంశచరిత్రములను సంపాదింప సర్వదా యత్నించు చుండవలెను. మఱియు భాండాగారములందు నాంగ్ల సంస్కృతాంధ్ర గ్రంథములేకాక, యన్యభాషా గ్రంథము లుండుటయు దత్సభ్యులితర భాషాభ్యాసరతులై తత్ జ్ఞానముచేత మాతృభాషాభివృద్ధిని గావించుటయు నావశ్యకములు. ఇప్పుడు సాధారణముగా నాంగ్ల పారశీక వంగ మహారాష్ట్రభాషలనుండి యాంధ్రమున కనువాదములు సలుప బడుచున్నవి.

వంగ, ఘూర్జర, మహారాష్ట్ర భాషావాఙ్మయము లుచ్చదశలో నున్నవని వినుచున్నారము. సర్ రవీంద్రనాథ్ టాగూరువంటి కవీంద్రుడు వెలసి వంగభాషకు వన్నెదెచ్చెను. బంకించంద్ర చటర్జీ మొదలగు నుత్కృష్ట గ్రంథకర్తలు భాషాసేవ వేయివిధముల సలిపి యుండిరి. ఆంధ్రముననేగాక నా మాతృభాషయగు నుత్కళమున గూడ వంగ వాఙ్మయచ్ఛాయలు ప్రతిఫలించు చున్నవి. వర్తమాన కాల స్థితులనుబట్టి యాంధ్రులుగాని, మఱి యితర దేశీయులుగాని యొక్క మాతృభాషాభ్యాసముతోడనే తృప్తి జెంద ననువుగాదు. భారతజాతీయ జీవనము సహస్రనాళముల ప్రవహించుచున్నది. అంతటను జాతీయాంతరాత్మ ప్రతిబింబము ప్రతిఫలించుచున్నది. కావున భారతీయులందఱును బాగుగ జాతీయతత్వమును గుఱుతెఱుంగదలచిరేని జాతీయ జీవనప్రభావము నన్నిదిశలను గాంచవలసి యుండును. భారత జాతీయతా పోషణమున కేకభాష దేశమునందంతట వాడ బడవలయు ననియును నట్లుకాకున్న నేక లిపియైన నుపయోగింపబడుట సమంజసమనియు గొందఱు మహనీయులు ప్రబోధించుచున్నారు. లిపి మాత్రమొకటియై భాషలు భిన్నములైనచో లాభమంతగా గలుగదు. శాస్త్రపరిభాష లేకరీతిగానుండుట విశేషలాభకరము. ఇప్పటి స్థితినిబట్టి భారతీయులు నిజమాతృభాషలందేగాక, సాధ్యమగునంత వఱకు నన్యభాషలందు బరిశ్రమము సేయుట యుక్తము.

వర్తమాన మందాంధ్ర సారస్వతము వెల్లువెల్లువయై ప్రవహించుచున్నది. నవలలును, నాటకములునెన్నియో వెలువడుచున్నను - జరిత్రలును, మహాపురుషుల జీవితములును, శాస్త్రములును, కళలును వాణిజ్యాది విషయక గ్రంథములును మాత్రము కొదుగా గానవచ్చుచున్నవి. సాంఘిక శక్తు లభినవాదర్శ సంచారితములై కేంద్రీకృతము లగుటకు బరిభ్రమణమును జెందుచున్నవి. ఈ మహాసమయమున నట్టి శక్తులను దగిన విధమున జాతీయ ప్రణాళుల బ్రసరింప జేయుటకు యుక్త గ్రంథము లుత్పన్నములు గావలెను. "నా ఋషిః కురుతే కావ్య"మని యుండుటవలన ఋష్యంశ సంజాతుడే కవియగును. ఋషివోలె నాగతానాగత వృత్తాంతములను గవి నిజ దివ్య తేజః ప్రభావముచేత లెస్సగా దెలిసి గ్రంథరచన సేయును. లోకజ్ఞుడును, సర్వకళా పరిపూర్ణుడును, దివ్య తేజో విరాజితాంతరంగుడును గాని కవియొక్క కవిత యెక్కడ నెప్పుడును శోభిల్లదు. దేశకాలానుసారముగా సద్గ్రంథములను రచించి జనులను జ్ఞానవంతులను జేయుభారము సత్కవులయందు మోపబడియున్నది. "కవులందఱును గాళిదాసుగా"రను లోకోక్తి సత్యమే యయినను, గవియగుటకు నిచ్ఛయించువాడు మాత్రము కాళిదాసుని మార్గమునే యనుసరింప సర్వదా యత్నించుచుండవలెను. పూర్వకావ్యములను బాగుగ బరికించి నచో నీకాలమునకుగూడ నుపయోగించు సూత్రము లందు బొందుపఱుపబడియున్నట్లు తోపకమానదు. సంస్కృత కావ్యములయందును, దేశభాషా ప్రబంధములయందును రమ్యములగు వర్ణనములెన్నియో కలవు రమ్యవస్తు గుణవర్ణనమున మన కావ్యములు వన్నెమీఱినవి. ఆధ్యాత్మికాది భౌతిక విషయములనుగూడ జక్కని వర్ణనముల బొందుపఱిచి మనకవులు వింతగా విశదీకరించియున్నారు. పద్యమునగాని, గద్యమునగాని కావ్యమునకు వ్యంగ్యము ప్రాణము. ఆంగ్ల వాఙ్మయ

సూత్రములనుబట్టి చర్చించినను జదువరుల యూహాకు ననువుగ వర్ణ నాంశముల సూచించి విడుచుట ముఖ్యమని తెలుచున్నది. చదివిన కొలదిని వింత చవుల గాంచురీతిని, నూహలకు బెక్కువిధములు నూహ్యములగు తీరునను బదములందు నిమిడ్చిన భావము పలువిధ ముల ననేక రుచులకు రుచించుపగిదిని భావములను బొందుపఱచు టయే మహాకవుల కవిత్వము నందలి ముఖ్యలక్షణము. "ఉన్మీలితం తూలికయేవ చిత్రం । సూర్యాంశు భిర్భిన్నమివా రవిందం । బభూవ తస్యాశ్చతురశ్రశోభి । వపుర్విభక్తం నవయౌవనేన." కాళిదాసుని కుమార సంభవమున బార్వతీ వర్ణనమున బొందు పఱుపబడిన యీ శ్లోక మెట్టి విచిత్ర నైపుణ్యమును జూపుచున్నది! ఆంగ్లమున మిల్టు, షేక్స్పియర్ మహాకవుల ప్రాభవము నిట్టిదియే. ఇట్టి కవిత్వము దుర్ల భ్యమగుచున్నది. ఉత్తమ విమర్శన గ్రంథములు వెలువడునేని యు త్కృష్ట కావ్యరచనకు ననువుగనుండునని తోచెడిని. ఆంగ్ల సంస్కృ తాంధ్రములందు సమాన ప్రతిభగల పండితవర్యులు విమర్శన గ్రంథ రచనకు గడంగుదురుగాక!

ఆంధ్రభాష చిరకాలమునుండి యున్నతదశలోనున్నను, బుట్టి నది మొదలది యట్లున్నదని చెప్పజాలముకదా. దానికిని గొంతకా లము బాల్యదశయందుండుట స్వాభావికము. అయినను వాగనుశాస నునకు బూర్వమది యెట్లుండెనో యవ్విషయ మింతవరకును దెలియ కున్నది. అది భాషాభిమానుల చిర పరిశ్రమమునకు దగు విశాల విష యము. ఆంధ్రభాషా చారిత్ర మింతవఱకును వ్రాయబడి యుండ లేదు. మఱి భాషా స్వరూపమును సమగ్రముగా నిర్వచింపదగు వ్యా కరణము లేదు. ఆంధ్రశబ్ద చింతామణి ప్రభృతి గ్రంథలక్షణమును బట్టి భాషా స్వరూపమును నిర్ణయింప గడంగినచో స్ఖాలిత్యము లధిక ములై కనుపట్టెడిని. నాగరకుల బాస కిట్టి లోటుండరాదు. దానిని సర్వాంగ సుందరముగా జేయవలెనన్నచో దోశ్శిద్రావిడి భాషలతో సమన్వయము గావించి కాంచుట సయిత మావశ్యకము. కనుక సం

సంస్కృత ప్రాకృతము లందేకాక, ద్రావిడభాషలందునుగూడ నిపుణులగు విబుధు లాంధ్రభాషకు సంపూర్ణమగు నొక వ్యాకరణమును రచించి, దేశవాసుల వందనములను బడయుదురుగాక! అట్టి పాత్ర మొందు వెలయునేని గ్రాంధిక భాషా వాదులమని కొందఱును, వ్యావహారిక భాషావాదులమని మఱికొందఱు నిపుడు వెలువడి చేయుచున్న వ్యర్థ వాద మడుగంటుటయేగాక, సుస్వరూపముతో నాంధ్రవాణి విహరించుట కనువగును.

గ్రంథాలయ విధులు

గ్రంథాలయములు గ్రంథ సంపాదనమునకును, దత్పఠనమునకును మాత్రమేగాక, సాంఘికజీవనమునందును, వాఙ్మయ జీవనమునందును బెక్కు విధముల సహకారులుగ దగియున్నవి. అవి యింత వఱకు గ్రంథసంపాదనమున మాత్రము హెచ్చుకృషిని సలుపుచున్నవి. ముద్రిత గ్రంథములు సాధారణముగా సంగ్రహింప బడుచున్నను, అముద్రిత గ్రంథములంతగా సమకూర్చ బడుచున్నట్లు కానరావు. కొన్ని యుత్తమ గ్రంథాలయములు పనిబూని తాళపత్ర సంపుటములను సమకూర్చుచున్నవి. దొరతనమువారి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాదు లిందులకు దృష్టాంతములు. మన యాంధ్రదేశమున బ్రతి మండలమునను ముద్రితములుగాని యమూల్య గ్రంథము లెన్నియో గలవు. ముద్రితములనియు, నిజ భాండాగారమున నున్నవనియు నుపేక్షింపక పురాతన తాళపత్ర ప్రతులను సంపాదించుచుండవలెను. మఱి వానియందుగల పాఠభేదముల నెత్తి వ్రాయుచుండవలెను. ఇట్లొనరించు చుండుటవలన నిప్పటి ముద్రిత పుస్తకములు పునర్ముద్రితములగు నపుడు వాని యందలి తప్పులను దిద్దవీలగును. కొన్ని యుత్తమ గ్రంథము లొకటి రెండుసార్లు మాత్రము ముద్రితములై యిప్పుడు సాధారణముగా లభింపకున్నవి. అట్టి వానినిగూడ బూనికతో సంపాదింపవలెను. విదేశవాసులు వ్రాతప్రతులనుగొని కొనిపోవుచుందురు. అట్టి తరుణమున గ్రంథాలయమువారే తన్మూల్యమిచ్చి పాత్రములను గాపాడవలసియుండును.

పాతనాణెములను, భగ్నము లయినను ప్రాచీన శిల్పములను సేకరించుచుండవలెను. స్థల చరిత్రములను, బుక్కిటి పురాణములని నిరాకరింపక దేశస్థులచేత జెప్పబడుచుండు కథలను, గ్రామ్యజనులు పాడుపాటలను, సామెతలను వ్రాయించి భద్రపఱుపవలెను. గ్రంథాలయమునకు వసతిగానుండు వాసమును, నుపచరించు నుపకరణములు నుండవలెనని వేఱుగా నుడువ నక్కఱలేదుకదా! పైన బేర్కొనిన వానిని సంగ్రహించి యుంచుటయేగాక గ్రంథాలయములనుండి పొత్తములను స్త్రీ పురుషులు దీసికొనుచు గ్రమముగా జదివి మరల నప్పగించు చుండునట్లు చేయవలెను. మఱి సద్గ్రంథ రచయితలకు దగు సాహాయ్య మిచ్చుచు వాఙ్మయవృద్ధి గావించుచుండవలెను. కొన్ని గ్రంథాలయములు బీదలకన్నదానమును, మఱికొన్ని రాత్రి పాఠశాలలను స్థాపించి కర్మకరులకు విద్యాదానమును జేయుచున్నట్లు విందుము. ఇట్టి కార్యము లల్పము లయినను సంఘాభివృద్ధికరము లగుటంజేసి ప్రశంసనీయములు.

మా మండలమున నిప్పటికి బదునేడు గ్రంథాలయములే నెలకొల్పబడి యుండుటవలన నీ యుద్యమమున మా మండలము వెనుకబడెనని చెప్పుటకు సిగ్గగుచున్నది. ఈ సిగ్గును బాపు కృత్యము మా మండలమందలి ధనవంతుల యందును, విద్యావంతులయందును, గర్మకులయందును న్యస్తమయి యున్నది. వారల చిత్తము - ప్రజల భాగ్యము. గ్రంథాలయ సంఖ్యచేత మా మండలము నిమ్నదశలో నున్నను, దత్కార్యములచేత మాత్ర మట్లుండలేదు. అమూల్య గ్రంథరత్నములతోనిండి ప్రాచీన గ్రంథాలయములలో నెన్నికగన్న పరవస్తువారి "యార్ష గ్రంథాలయము"ను సుమారిరువది సంవత్సరములకు బూర్వము సార్వజనిక గ్రంథాలయముగానుండి పిదప విశాఖ పట్టణ గ్రంథాలయ మనుపేర గొంతకాలము వెలసిన "యాది సరస్వతీ నిలయ గ్రంథాలయము"ను గలిసి యేర్పడి త్వరలో జిల్లా గ్రంథాలయముగా బనిచేయ యత్నించుచున్న "యానంద గజపతి గ్రం

థాలయము”ను పెక్కు దెలుగు బొత్తములతోనొప్పు “జాలీ బ్రదర్సు క్లబ్బు”. వారి గ్రంథాలయమును, మా విశాఖపట్టణమున బహుజనోపయోగములుగ భాసిల్లుచున్నవి. మా పురినున్న శారదానంద నిలయమును, శృంగవరపుకోటతాలూకా యందున్న బాల సరస్వతీ పుస్తకభాండాగారమును ముఖ్యముగా స్త్రీల విద్యాభివృద్ధిచేయుచున్న చేతలు గడు బొగడదగి యుండును. మఱియు విజయనగరమునందలి యాంధ్ర విద్యానిలయము గొన్ని పరీక్షల నేర్పఱిచి వానియందు కృతార్థులగువారికి దగు ప్రోత్సాహమునుగలిగించుచు మాతృభాషా సేవసేయబూనుట యాంధ్రదేశ వాసులకు నూతన సమాచారము గాదు. జ్ఞానానందమయుండగు జగదీశుని కృపవలన మనదేశము నందంతటను గ్రంథాలయములు హెచ్చి తద్వారా మానవులు జ్ఞానపూర్ణులగుదురుగాక !

—గ్రంథాలయసర్వస్వము - మూడవసంపుటము - మూడవభాగమునుండి.

# ఆఱవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, చెన్నపట్టణము

[ 1919 నవంబరు 16 ]

శ్రీ సూరి వేంకటనరసింహశాస్త్రి

శ్రీలిం పొందెడు విజయవాటికయందు కృష్ణవేణి దాది పాల్గుడుప, రాజరాజ నరేంద్ర పురమున గౌతమి చనుజేప. నెల్లూరు పురమున పెన్న అంగరక్షలుపెట్టి అభ్యంగనమిచ్చి యందగింప, బారువ విశాఖపట్టణముల ప్రథమాన్న ప్రాశనమొనర్చి, ఇంచుక మెతుకు గతుకనేర్చి, శిశుత్వము గడపి, యౌవన ప్రాదుర్భావమున సర్వకళా పరిపూర్ణయై, సమానులలో నుత్తమ స్థానము నలంకరించుటకో యన ఆంధ్ర గ్రంథాలయోద్యమము విశ్వవిద్యాలయ స్థానమును, రాజధానియునైన చెన్నపురి చేరెను.

## గ్రంథాలయోద్యమము

గ్రంథాలయోద్యమ మననేమి? దీని స్వరూప స్వభావము లెట్టివి? దీనికి ప్రాప్యమెద్ది? వ్యాప్తి యెంతవరకు? ఈ యుద్యమముతో ప్రత్యేక సంబంధములేని సామాన్య జనులకు గ్రంథాలయమనగా పుస్తకములను భద్రపరచి యచ్చటి కరుగు పాఠకులకు వానిం జదువ నిచ్చు స్థానమనియు, గ్రంథపాలకుడు (Librarian) అనగా పుస్తకముల కాపరి యనియు నర్థమగును. ప్రాచీన గ్రంథాలయములును, ప్రస్తుతము మనదేశమున దొరతనమువారిచే నిర్వహింపబడుచున్న గ్రంథాలయములును అట్టివే. కాని యాధునిక నాగరకతయందు నభివృద్ధిగాంచిన గ్రంథాలయ మట్టిదికాదు. అది సార్వజనీన విశ్వవిద్యాలయము. జనసామాన్యమునం దిమిడియున్న ప్రతివ్యక్తికిని దేశకాల పాత్రముల ననుసరించి జ్ఞానదాన మొనర్చునది ఆధునిక గ్రంథాలయము. ఇట్టి గ్రంథాలయమువలన లాభము నొందుటకు వానివద్ద

కరిగి తీరవలసినపనిలేదు. గ్రంథాలయమున కరుగలేనివారికడకు గ్రంథాలయమే అరుగుచుండును. మరియు గ్రంథాలయమువలన కలిగెడు లాభము కేవల గ్రంథపఠనమువలన నలవడు బుద్ధివికాసముమాత్రమే కాదు. సంపూర్ణ మనుష్యత్వమును వికసింపచేయుటకు తగిన సాధనములన్నిటి నవలంబించి తత్సిద్ధికొఱకు కృషిసలుపుటంతయు గ్రంథాలయోద్యమ కార్యములో చేరినదే. కావున మరియొకచో నేను చెప్పినట్లు "మనుజుని జీవితమును పవిత్రవంతముగను, పురుషార్థసాధకముగను చేయుటయే" గ్రంథాలయోద్యమముయొక్క ప్రాప్యమై యున్నది.

ఈ యుద్యమ పక్షమున జరుగు కార్యములను రెండుభాగములుగ విభజింపవచ్చును. 1. ఉద్యమవ్యాపనము, 2 ఉద్యమ నిర్మాణము. మొట్టమొదట ఈ విషయములనుగూర్చి పాశ్చాత్య దేశములయందు, ఆదేశముల ననుసరించి యుద్యమ ప్రచారము చేయుచున్న బరోడా దేశమందును జరుగుచున్నపనినిగూర్చికొంతముచ్చటించెదను.

ఉద్యమ వ్యాపనము

గ్రంథాలయములను దేశమంతటను స్థాపించుటకుతగిన ప్రోత్సాహమును జనులయందు పురికొల్పుట, స్థాపించిన గ్రంథాలయముల యుపయోగములనుగూర్చి జనసామాన్యమునకు బోధించి వారలను అట్టి లాభమును పొందునట్లుచేయుటయే ఉద్యమ వ్యాపనము. నిరక్షరకుక్షులు కలికమున్నకైన దొరకని పాశ్చాత్య దేశములందుకూడ నీ యుద్యమ వ్యాపనమునుగూర్చి జరిగెడు కృషి యనంతము. ఇందుకొరకై ప్రత్యేకసభలు, సమావేశములు చేయబడుచుండును. ప్రత్యేక సంఘములు లేర్పడును. వార్తాపత్రికలయందు నుద్యమ ప్రాశస్త్యమును గూర్చి యనేక వ్యాసములు ప్రచురింపబడు చుండును. ఒక్కొక గ్రంథాలయముయొక్క విశేషాంశములను సమర్థులగు లేఖరులు పత్రికలయందు వర్ణించుచుందురు. బడిపిల్లలు సెలవుదినములయందు విహారములకొరకు జట్లుగాచేరి వెడలునపుడు వారలతో గ్రంథాలయ

ములనుండి విద్వాంసులు పంపబడుచుందురు. ఈ విద్వాంసు లా పిల్ల లకు పనికివచ్చు విషయములనుగూర్చి యుపన్యసించి, యా విషయము విపులముగా నేయే గ్రంథములయందు వ్రాయబడియుండెనో ఆగ్రంథ నామములను వారికి తెలిపి, యవి తమ గ్రంథాలయమున దొరకునని ప్రోత్సాహము చేయుచుందురు. కూలివాండ్రు పనిచేయు కర్మాగా రములయొద్ద గోడబల్లలమీద వారల కుపయుక్తములగు గ్రంథముల పేర్లును, అవి దొరకు గ్రంథాలయముల పేర్లును వ్రాసి ప్రకటించు చుందురు. గ్రంథాలయముల యందుండు ప్రత్యేకపు గదులను పేరు పొందిన క్లబ్బుల పరమునందుంచి, యాక్లబ్బులలో చేరిన సభ్యులకు గ్రంథాలయముల యందభిరుచిని జనింపజేయుదురు. ఇట్లు ప్రతివ్యక్తి కిని గ్రంథాలయములయందు తీవ్రమగు అభిమానము కల్పింపబడును.

ఉద్యమ నిర్మాణము

గ్రంథాలయములు సామాన్యముగా రెండు తరగతులని చెప్ప వచ్చును. 1. స్థాయీ గ్రంథాలయములు. 2. సంచార గ్రంథాలయ ములు. సంచార గ్రంథాలయములనగా ప్రత్యేకముగా స్థాయీ గ్రంథా లయములు స్థాపించుటకు వీలులేని స్థలములయందు జనసామాన్యమున కుపయుక్తముగా నుండునట్లు ప్రత్యేకముగా తయారుచేయబడిన పెట్టె లలో పుస్తకములుపెట్టి, అనేక ప్రదేశములకంపి గ్రంథములను చదువు నట్లు చేయుచుందురు; బడిపిల్లల కుపయుక్తములగు గ్రంథములు ఉపాధ్యాయుల పరముగ నివ్వబడుచుండును; ప్రత్యేక భాండాగారి యొకడు బీదలు నివసించు కుటీరములకు గ్రంథములను గొనిపోయి చదువగలవారికి పుస్తకముల నిచ్చియు, చదువలేనివారికి స్వయముగా చదివి చెప్పియు, జ్ఞాన తేజమును వెదజల్లుచుండును; ఇట్లే వైద్యశాల లకును పుస్తకములను బంపుచుందురు.

స్థాయీ గ్రంథాలయములయందు "లోకోభిన్నరుచిః" అను న్యాయానుసారముగ నెల్లరకు వారివారి రుచుల కనుకూలమగు జ్ఞానో పార్జన సాధనములు కల్పింపబడుచుండును; సాంకేతిక శాస్త్రజ్ఞులకు

తగిన గ్రంథములు వారల యుపయోగముకొఱకు సేకరించబడును. స్త్రీల కుపయుక్తములగు గ్రంథములు ప్రత్యేకముగా నుంచబడును. ఉద్గ్రంథములు కావలసినవారల కవియు సిద్ధముగా నుంచబడును. "ప్రతి వ్యక్తికి తగిన గ్రంథము నొకదానిని, ప్రతి గ్రంథమునకు తగిన వ్యక్తినొకరిని" సమకూర్చుటకు తగిన ప్రయత్నము లన్నియు గ్రంథాలయమున చేయబడుచుండును. గ్రంథాలయములన్నియు సంపూర్ణముగా నుండుట అసంభవమును, అనావశ్యకమును గనుక ఏక దేశమందు గల గ్రంథాలయము లన్యోన్యాశ్రయములుగ జేయబడుచుండును.

## ఆంధ్ర గ్రంథాలయోద్యమము

ఇక ఆంధ్ర గ్రంథాలయోద్యమ పక్షమున జరుగుచున్న పని యేమి? కీర్తిశేషులగు గంజాం వెంకటరత్నం పంతులుగారిచేతను, డెల్టా రైతుల బాధలను తొలగించుటకు బద్ధకంకణులయి తమ జీవితమును ధారవోయుచున్న శ్రీయుత కాళ్లకూరి నరసింహము మొదలగు దేశ బాంధవులచేతను, దేశమందు రాజకీయ పరిజ్ఞానమును వ్యాప్తి నొందించుటకై యాధునిక ఆంధ్ర గ్రంథాలయములు తొలుదొల్త స్థాపింపబడినవి. అట్టి సందర్భముననే స్థాపింపబడిన కృష్ణాజిల్లా భీమవరం తాలూకా కుముదవల్లి యందలి శ్రీ వీరేశలింగకవి సమాజము దినదినాభివృద్ధిగాంచుచు కేవల గ్రంథనిక్షేపమేగాక సేవాసమితియు, వైద్యశాలయు, పరపతిసంఘ కార్యాలయమును, ప్రార్థనసమాజమును ఇది యది యననేల గ్రామపురోభివృద్ధి సాధకమగు ప్రతి యుద్యమమునకును ఉత్పత్తిసాధనమును ప్రవర్ధకమునునై యలరారుచున్నది. ఇది ఆంధ్ర గ్రంథాలయోద్యమమున ప్రథమ శకము. రెండవ శకమున స్థాపింపబడిన గ్రంథాలయములలో, తొలుదొల్త శ్రీ "వీరేశలింగ యువజన సమాజ"మను పేర బరగి పిమ్మట సార్వజనిక గ్రంథాలయమనబడి ప్రస్తుత "గౌతమీ గ్రంథాలయము"గ పరిణ

మించిన రాజమహేంద్రవర సంస్థాపనమును, దక్కను హైదరాబాదు నందు కీర్తిశేషులగు రావిచెట్టు రంగారావుగారిచేతను, ఆంధ్రలోకమున వెలువడు ధర్మసంస్థాపనలన్నిటికి పట్టుగొమ్మగా నలరారుచున్న శ్రీ రాజా నాయని రంగరావుగారిచేతను స్థాపింపబడిన శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయమును సుప్రసిద్ధ సరస్వతీ నికేతనములు. పాశ్చాత్య గ్రంథాలయోద్యమ పరిచయము మనవారలకు కల్గకపూర్వము కూడ వారిప్పుడు ప్రచారమునకు తెచ్చుచున్న సూత్రములను, మనవారా కాలముననే అనుష్ఠింపగలిగిరి. స్త్రీలకు ఇండ్లకు ధర్మముగ పుస్తకములను బంపుట, ఆ పుస్తకములను వారు చదువునట్లు ప్రేరేపించుటకై వారలకొరకు బహుమతి పరీక్షలు జరుపుట, జనసామాన్యమునకుపయుక్తమగు కరపత్రముల నచ్చొత్తించి ప్రకటించుట మొదలగు సాధనములు గ్రంథాలయములకు వచ్చువారలకేకాక తదితరులకు గూడ కల్పింపబడి జ్ఞానము వెదజల్లబడుచుండెను. మూడవశకమునందు స్థాపింపబడిన ఆంధ్రగ్రంథాలయములు కేవల సరస్వతీ నికేతనములేగాక మనుజుని జీవయాత్ర సంబంధమగు ప్రతియంశమునందును గ్రంథాలయము కృషిసలుపుట విధియను సూత్రము నవలంబించుచున్నవి. ఆధునికకాలమున స్థాపింపబడు గ్రంథాలయముల పక్షమున, రాత్రిపాఠశాలల స్థాపించుట, పురాణపఠనము జరుపుట, వీధినాటకములు, తోలుబొమ్మలు ఆడించుట, సేవాసమితుల స్థాపించి ప్రజాసేవ చేయుట, జంగమకథలు చెప్పించుట, పోటీపరీక్షల నేర్పరచి బహుమానముల నిచ్చుట, ఆటల నాడించుట, బహుమతులొసగుట, ఉపన్యాసముల జరుపుట, మ్యాజికులాంతరు (Magic lantern) ప్రదర్శనము చేయుట, జాతీయోత్సవములు జరుపుట, మహాపురుషులయొక్కయు, అవతార పురుషులయొక్కయు వర్ధంత్యుత్సవములు జరుపుట మొదలగు నెన్నియో కృషులు జరుపబడుచుండుట మనము ప్రతి దినమును కనుచు, వినుచు, చదువుచునేయున్నాము. ఆంధ్రపత్రిక వ్రాసినట్లు మన గ్రంథాలయములు "వ్యాయామ నిలయంబులై, కళాక్షే

త్రంబులై, నాటక రంగంబులై, ధర్మసంరక్షణ సాధనంబులై" విరాజిల్లుచున్నవి. ఈ యుద్యమమును వ్యాపనచేయుటకై ప్రత్యేక సభలు సమకూర్చబడుచున్నవి. మన మహాసభయేగాక జిల్లాసభలు, తాలూకా సభలు జరుగుచున్నవి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమును జిల్లా సంఘములును, తాలూకా సంఘములును కృషి సలుపుచున్నవి. గ్రంథాలయ సర్వస్వమునందు మనదేశమందు జరుగుచున్న పనినిగూర్చియేగాక ప్రపంచమందంతటను ఈ యుద్యమ పక్షమున జరుగుచున్న పనినిగూర్చి ప్రత్యేక వ్యాసములు ప్రచురింపబడుచున్నవి. ఇంకను ఆంగ్ల పత్రికలయందును, దేశభాషా పత్రికలయందును ఈ విషయములు వ్రాయబడుచున్నవి. గ్రంథాలయముల సంఖ్య రానురాను హెచ్చుచున్నది. విజయవాటికయందు ఈసభ మొట్టమొదట కూడినపుడు 163 గ్రంథాలయములే లెక్కకురాగా ఈ సంవత్సరపు లెక్కల వలన మన యాంధ్రదేశ మందంతటను 600 వరకు గ్రంథాలయములున్నట్లు తేలుచున్నది. "ఈ యుద్యమ ప్రచారకులలో కొందరు ఇతర ఉద్యమములనుకూడా తమపై వైచుకొని గ్రంథాలయోద్యమమునకు తక్కిన యుద్యమములను అతుకుచున్నారేగాని పైన జెప్పిన వివిధములగు కృషులన్నియు గ్రంథాలయోద్యమములో చేరినవెల్లగు" నని కొందఱు శంకించుచున్నారు. పూర్వపక్షు లపోహపడుచున్నట్లు పైన చెప్పబడిన ప్రయత్నములన్నియు ఆంధ్ర గ్రంథాలయోద్యమమున కతుకు పెట్టబడక దానితో అంగాంగీభావము కలవై యున్నవి. ఇందుకు ప్రమాణముల నీ క్రింద అక్టోబరు, నవంబరు నెలల మాడరన్ రెవ్యూ (Modern Review) పత్రికలనుంచి ఇచ్చుచున్నాను. 1850వ సంవత్సరప్రాంతమునందు డెన్మార్కు దేశస్థితి మనదేశవర్తమానస్థితిని బోలియుండెను. ప్రజలయందు నాత్మ విశ్వాసములేదు. దేశాభిమానము మృగ్యము. విద్య సున్న. అన్యోన్యవిశ్వాసము హుళక్కి. ద్రవ్య సంపాదనా సామర్థ్యము ప్రజలయందు శూన్యము. ఇట్టి సమయమున

వర్ణింపబడినది:- డెన్మార్కు దేశపు ప్రతి పల్లెయందు సభాభవన
మొకటి నిర్మింపబడెను. దీనికగు ద్రవ్యమునకు గ్రామస్థులందఱు చం
దాల నిచ్చిరి. గ్రామస్థులందరు కూడుట కిది కేంద్రస్థానముగా నుం
డెను. అచ్చటకు పురుషులును, స్త్రీలును తమపనులు తీరినవెనుక
వెళ్లుచుండిరి. ఇట్లు చేరినజనులు ఒండొరులతో మాట్లాడుటయందును,
గ్రంథములనుగాని, పత్రికలనుగాని చదువుటయందును కాలము గడ
పుచు తమ శ్రమను తీర్చుకొనుచుండిరి. గ్రామమందలి స్త్రీపురుషు
లందరు కూర్చుండుటకు తగినంత విశాలముగా ఆ భవనముండెను.
ఆ భవనముయొక్క ఒక చివరను సభావేదిక యుండెను. రెండవ
కొనను గ్రంథాలయమును, పఠనమందిరమును నెలకొల్పబడి యుం
డెను. వారమున కొకదినమచ్చట గ్రామమందలి యువకులు కుస్తీలు
పట్టుచుండిరి. మరియొక దినమున ఉపన్యాసముల నిచ్చుచుండిరి. మా
సమునకు రెండుతూరులు ఏదేని యొక గొప్ప విషయమునుగూర్చి
తీవ్రమగు చర్చ జరుగుచుండెను. అందు విశ్వవిద్యాలయ విద్యా
ర్థులు సహాయులగుచుండిరి. నెలకు రెండుమారులు గానసభలు జరుగు
చుండెను. అప్పుడప్పుడు వీధి నాటకములు, నాట్యములు, ఉపాహా
రపు విందులుకూడ జరుగుచుండెను." ఇక రెండవ ప్రమాణము
వజీదాలీదారు మనదేశమున జనసామాన్యమునకు విద్యగరపుట కవ
లంబింపవలసిన సాధనములనుగూర్చి ప్రశంసింపుచు ఇట్లు చెప్పియు
న్నారు:— "విద్య వ్యాపింపచేయుటకు అవలంబించు సాధనము
లలో అక్షరములొక సాధనముగాని యదియొకటిమాత్రమే సాధనము
కాదు. కావున నక్షరములు నేర్పకనే మనుజుని జ్ఞానవంతునిగ జేయ
వచ్చును. విద్యయనగా మనుజుని భౌతిక శరీరమును, మనస్సును అభి
వృద్ధి నొందించుట. అట్టి జ్ఞానము నిచ్చు సాధనములలో పుస్తకము
లొక సాధనము. అట్లే చిత్రకళలు, వ్యాయామములు, పురాతన
కథలు మొదలగునవి. ఏయొక్క సాధనమును చాలదు. అన్నిటిని
సంపుటీకరణము చేయవలసియున్నది. మన జానపదులకు నిచ్చు విద్య

లో నొక భాగముమాత్రమే సారస్వతమునకు సంబంధించినదిగా నుండవలెను. మన కృషి యింతకన్న పెద్దదియగు కార్యక్షేత్రమున వినియోగించవలెను. మన దేశమునందు ఆధ్యాత్మిక విద్యను వ్యాప్తి నొందించుటకు మన పూర్వులవలంబించిన సాధనములను మనము గ్రహించవలెను. నటుడు, జంగమకథలు చెప్పువాడు, చిత్రకారుడు కథకుడు, గాయకుడు, పహిల్వాను మొదలగువారి నందరిని జ్ఞానవ్యాపనమందు మనకు సహాయులనుగా తీసికొనవలెను. ఇట్టి విద్య సంపూర్ణముగా పాఠశాలలయం దలవడదు. మనుజుని పరివేష్టించియున్న వాతావరణము నంతను ఒక పెద్ద పాఠశాలగా మనము మార్చవలయును." కావున వ్యక్తియొక్క అభివృద్ధికి కేవల చక్షురక్షర సంయోగమేకాక, ఇంక నెన్నియో సాధనములు ఉన్నవనియును, వాని నన్నిటిని అవలంబించినగాని ఆ వ్యక్తియం దిమిడియున్న సర్వ శక్తులును విజృంభింపజాలవనియు మనకు దృఢమగుచున్నది. మఱికొన్ని ప్రమాణములు: శ్రీయుత చల్లా శేషగిరిరావుగారు గ్రంథాలయ సర్వస్వమునం దిట్లు వ్రాసియున్నారు:– "గ్రంథాలయ స్థాపనవలన ప్రతి గ్రామమును దేశమునకు బలకరమగు పునాది కాగలదు. మన జాతీయ ప్రతిష్ఠాపనలన్నియు దేశౌన్నత్యమునకు శాశ్వత సహాయమొసంగగలవు. కాన ప్రజాహిత జీవనమునకంతయు గ్రంథాలయములోనే బీజములు మొలకలెత్తవలెను. అంతకన్నను ప్రస్తుత స్థితిలో ప్రజాహిత జీవనాభివృద్ధికి సాయపడు ప్రతిష్ఠాపనలు వేరు కానరావు. గ్రంథాలయము లిట్టి మహాశయములను, ఆడంబర రహితముగా త్వరలో ఫలోన్ముఖమునకు తేగలవు."

విద్యకు నాగోజిభట్టుగారు 'పరమోత్తమ పురుషార్థ సాధనీ విద్యా' అని నిర్వచనము చేసినారు. కావున గ్రంథాలయములు కేవల విద్యావ్యాపక సాధనములే యని కొందరు చెప్పినను వజీదాలీగారు చెప్పినట్లు మనను పరివేష్టించిన వాతావరణమంతయును ఒక పెద్ద పాఠశాలగా మార్చవలసియున్నది. ఇందుకు మనము గ్రహించ

వలసిన ధర్మసూత్ర మొకటి గలదు. మనము పాశ్చాత్య వాసనలతో నిండి, వారి సాంప్రదాయములనే సిద్ధాంతములని స్వీకరించుటచే ఎన్నియో తప్పు దారులకు దిగియుంటిమి. పాశ్చాత్య సిద్ధాంతములకు ముఖ్య సూత్రము ప్రత్యేక వ్యక్తి స్వాతంత్ర్యము. సంఘ శక్తులను సమీకరణము చేయుట వారికి తెలియదు. అందుచేతనే వారి సాంఘిక వాతావరణమందును, ఆర్థిక స్థితులయందును, సంతత మన్యోన్య స్పర్థలచే విప్లవములు కలుగుచుండును. మన సంఘ నిర్మాణము అన్యోన్య సహకారముచే గల్గెడి సమిష్టి భావముపై నాధారపడి యున్నది. కావున పాశ్చాత్య దేశములయందు "Division of labour is carried to the extreme. There is not that integrations of Social forces there which is the ruling Principle adopted in the construction of our social organism" ఈ విషయముననే రాధాకమల ముఖర్జీగారు 'Foundations of Indian Economics' అను గ్రంథమున విపులముగా వర్ణించియున్నారు. విషయము గొప్పది. వివాదభూయిష్ఠమయినది. ఈ విషయమునుగూర్చియే నిక్కడ చర్చించుట అప్రస్తుతము. కావుననే నిప్పుడు చెప్పు విషయమేమన సంఘశక్తుల నన్నిటినీ ఏకముఖముగ చేయుటయు, పురోభివృద్ధికిచేయు ప్రయత్నములయందు అన్యోన్య విరోధము లేకుండునట్లు సంఘమునందు సమిష్టిభావమును పెంపొందించుటయు మన భారతభూమియందు సాంప్రదాయసిద్ధముగా వచ్చు ప్రతిష్ఠాపన లన్నిటియొక్క ముఖ్య సూత్రము. ఇదియే సంఘ విప్లవముల నణచగల గారుడమంత్రము. లోక కల్యాణమును సమకూర్చు పరుసవేది. మనదేశ దేవాలయములు, గ్రామసంఘములు, ఉత్సవములు, యాత్రలు మొదలగు ప్రతిష్ఠాపనల తత్త్వమును మన మారసిన, ఈ సూత్రము మనకు గోచరము కాగలదు. కావుననే మన దేవళము, వివాహములకు సాక్షి, ధర్మశాస్త్ర చర్చలకు సభాభవనము, పరదేశీయులకు ధర్మశాల, పనివాండ్రకు ప్రాపు, సన్యాసులకు మఠము, భక్తవరుల కునికిపట్టు. ఇదియది యనచేల ప్రజలకు జీవనాధా

కమై, విద్యాపోషకమై, ఆనందాంబుధియై దేవళంబు విరాజిల్లుచుండు. పూర్వపు మన గ్రామసంఘముల చరిత్రమును పరికించినను జన సామాన్యమునందు సమిష్టి భావమును వృద్ధిపరచుచు వారలకు జ్ఞానాభి వృద్ధి కెట్లు సహకారిగానుండెనో మనకు బోధపడగలదు. ఇట్లే ఇతర ప్రతిష్ఠాపనలును. ఈ ప్రాచీన ప్రతిష్ఠాపనలలో కొన్ని సంపూర్ణముగ నశించినవి. కొన్ని నామమాత్రావశిష్టములుగ నున్నవి. కాని సంఘ శక్తుల నన్నిటి నొక్కచో జతపరచి ప్రజల యందైక్య భావమును వృద్ధిపరచుచు, వారల జ్ఞానాభివృద్ధికి సాధనభూతమగు ప్రతిష్ఠాపన యొకటి మన దేశపు నూతన పరివేష్టనలకును, నూతన భావములకును అనుకూలమగునట్లును, ప్రాచీన సాంప్రదాయములకును, పరిజ్ఞానముల కును, ధర్మసూక్ష్మములకును విరోధము లేకుండునట్లును ఒక ప్రతిష్ఠా పన ఆధునిక కాలమున దేశతారకమై వెలయవలసి వచ్చినది. అదియే ఆంధ్ర గ్రంథాలయము. నిష్పక్షపాతబుద్ధితో చూచిన అంతకన్న వేరొండు శరణ్యము కానరాదు.

ఇది యంతయు భావనాప్రపంచ నిర్మాణమేనా లేక అనుభ వముమీదకూడ గ్రంథాలయము లిట్టి పనులు చేయుచున్నవా? చేయగల సామర్థ్యము వీనియందు గలదా? ఇది యది యననేల? కొందరు అడుగుచున్నట్లు ఈ యుద్యమమందు జీవకళ ఉన్నదా? అను విషయ మిక్కడ చర్చనీయము. జీవకళయున్నదో లేదో నిర్ణ యించుటకు గుర్తేది? అట్టి గుర్తునొక్కదానిని మాత్ర మిక్కడ వివ రించెదను. సంఘమునం దుద్భవించుచున్న నూతన శక్తులను గమ నించి, వానిని సరియైన మార్గముల నడుపుటకు తగిన సామర్థ్యము కలిగియుంటయే యీ గుర్తు. ఇట్టిది ఆంధ్రగ్రంథాలయమందు కలదనుటకు ఋజువు ఏదియన :— ప్రస్తుతము మన దేశమందు తీవ్రముగ చర్చ జరుగుచున్న విషయములు మూడు. మొదటిది 'అంతమొందినదని చెప్పకొనుచున్న ఐరోపా మహా సంగ్రామము' రెండు 'రానున్నవని చెప్పకొనుచున్న రాజ్యాంగ సంస్కరణములు'

మూడు సాడ్లరు కమీషన్ (Sadler Commission) చే ప్రచురింప బడిన కలకత్తా విశ్వవిద్యాలయ విచారణ సంఘ నివేదిక.

ఈ మూడు విషయములకును, మన గ్రంథాలయమునకును సన్నిహిత సంబంధము కలిగి ఈ మూడు సమస్యలకును సంపూర్ణ సమాధానము మన యుద్యమమిచ్చుచున్నది. అన్యోన్యస్పర్థ విలయ మునకు కారణభూతమనియు, సంఘసమిష్టి లోకకల్యాణ సాధనమని యు ఐరోపా మహాసంగ్రామ చరిత్ర ప్రపంచమున కుద్ఘోషించినది. ఈ సంఘసమష్టిని వృద్ధిపరచునదియే మన గ్రంథాలయము. సంఘము నందు చేరిన వివిధాంతరములుగల వ్యక్తులను ఏకత్ర సమావేశపరచి, అన్యోన్య సహాయముచే సమష్టిసంఘమునకును, ప్రత్యేక వ్యక్తికిని అభివృద్ధి నిచ్చునది మన గ్రంథాలయము. ఇట్టి అన్యోన్యసహాయ మెట్లు గ్రంథాలయమూలమున కలుగగలదో స్థలాంతరమున నేను వివరించియుంటిని. గ్రంథ విస్తరభీతిచే నిచట వదలితిని. మాంటేగ్యు మహాశయుడు ప్రచురించిన సంస్కరణ నివేదికయందు స్వపరిపాలన పొందుటకు భారతీయులకు హక్కుకలదుగాని చెలాయించుటకు సామ ర్థ్యపు మెట్లవరుసను వా రభ్యసింపవలసి యున్నదని వ్రాసిచ్చెను. భారతీయులు వెంటనే స్వరాజ్యమును పొందుట కర్హులగుదురా కారా యను సంశయ మిచ్చట ప్రస్తుతముకాదు. స్వపరిపాలనా దక్షత భార తీయులు దృఢపరచుకొనుటకు కొన్ని ప్రతిష్ఠాపన లుద్భవించవలసి యున్నవి. వానిలో గ్రామసంఘము మూలమగు పునాది. ఆ గ్రామ సంఘ ముద్భవిల్లుటకు గ్రంథాలయము ముఖ్యమగు సాధనము. గ్రంథాలయము నడపుటయందు స్వపరిపాలనకు కావలసిన శక్తి యుక్తుల నన్నిటిని సాంఘికు లభ్యసించెదరు. కేవల గ్రంథాలయమే ఇట్టి సాధనమేల కావలెను? ఇతర సంఘములేల కాకూడదన్నచో అట్లవి కాలేవు. ఇవియైనవనియే ప్రత్యుత్తరము. మన దేశమున 30 సంవత్సరముల కాలమునుండి రాజకీయ సంఘములు పనిచేయు చున్నవి. అంతకు పైబడి సంఘ సంస్కరణ సంఘములును ఉద్భవించి

యున్నవి. వీనియందు దేనిమూలముననైనను ప్రజా సామాన్యము నందు ప్రబోధము కల్గినదా ? 1905 సం॥ర ప్రాంతమున స్వదేశాం దోళనము కలిగినపుడు ఈ గ్రంథాలయముల మూలముననే ఆ యుద్య మము పల్లెటూళ్లలో ప్రవేశించినది. 1917 సం॥రమున స్వరాజ్యాం దోళనము ప్రబలినప్పుడు ఈ గ్రంథాలయములే ఆంధ్రదేశమం దంత టను స్వరాజ్య నినాదము మారుమ్రోగునట్లు చేసినవి. తిరిగి ఒకదాని కొకటి అతుకు పెట్టుచున్నావందురేమో అట్లుకాదు. బంగారము మనచేత నున్నచో దానిని మనకు కావలసిన యాభరణములుగా నెట్లు నిర్మించుకొనుచున్నామో, సంఘశక్తు లనేక ముఖములుగ తే గల ప్రతిష్ఠాపన యొకటి యున్నపుడు దానిని మనకు కావలసిన పని యం దుపయోగించుకొన వచ్చును.

మనము చిరకాలమునుంచి ఆందోళన జరుపుచున్న దేశభాషల మూలమున మన పాఠశాలలయందు విద్యను గరపవలయునను విషయ మును సాడ్లరు కమీషనువారు సిద్ధాంతీకరించిరి. ఈ విషయమునే మన గ్రంథాలయములు మొదటినుండియు ననుష్ఠానమునకు తెచ్చు చున్నవి. కొన్ని గ్రంథాలయములయందు ప్రకృతి శాస్త్ర విషయి కోపన్యాసములు జరుగుచున్నవి. మ్యాజికు లాంతరు సహాయముతో శాస్త్రపాఠములు బోధింపబడుచున్నవి. కొన్ని గ్రంథాలయముల కను బంధముగ విజ్ఞానచంద్రికాపరిషత్తునకును, నర్సాపురం పరిషత్తునకును తగిన శాస్త్రపాఠములను బోధించుటకు తగిన సదుపాయములు చేయ బడుచున్నవి. కాన పైన చెప్పిన మూడు విషయములకు తగిన సమా ధానము మన గ్రంథాలయమందు కలదు. ఇంతటితో ఆంధ్రగ్రంథా లయోద్యమము అత్యుత్తమ స్థానము నధిష్ఠించి యున్నదనిగాని, దాని యందు లోపములు లేవనిగాని, అభివృద్ధికి తావులేదనిగాని నా మత ముకాదు. ఆ యుద్యమమందలి లోపములు నాకు తెలిసినంతగా నిత రులలో చాలమందికి తెలియవనికూడ నేను చెప్పగలను. ఆ యుద్య మము ప్రస్తుత స్థితికన్న మిక్కిలి అభివృద్ధి గాంచవలసియున్నది. ఇంక

నెక్కువ జనాదరణ పొందవలసి యున్నది. ఆంధ్ర దేశ మందలి ప్రతి మనుజునకును ఈ యుద్యమముతో సంబంధ మేర్పడవలసి యున్నది. అప్పుడుగాని ఉద్యమము సఫలత చెందినదని చెప్పుటకు వీలులేదు.

మనము చేయవలసిన పని

గ్రంథాలయముల సంఖ్య హెచ్చవలెను. ఏక ప్రాంతమందలి గ్రంథాలయములు అన్యోన్యాశ్రయములుగా నుండవలెను. ఉద్యమ ప్రచారకుల సంఖ్య హెచ్చవలెను. ధన సహాయము సమృద్ధిగా రావలెను. గ్రంథాలయములు నామ మాత్రముగా నుండునవిగాక నిరంతరము కృషి సల్పునవిగా నుండవలెను. సరస్వతీదేవి అచ్చట తాండవమాడుచుండవలెను. సర్వ జనాకర్షకములును, సర్వ జనోపయుక్తములునై జనుల వాంఛలను తీర్చునవిగా నుండవలెను.

కార్య విధానము

ఇట్లు చేయుటకు మన మవలంబింపవలసిన కార్య విధానము ఏది? ఏ యుద్యమమైన జయప్రద మగుటకు ముఖ్యసాధనములు రెండు. ద్రవ్యము, ఉద్యమ ప్రచారకులు. ఇందులో మొదటి దాని కంటె రెండవదే ఎక్కువ ఆవశ్యకము. ఉద్యమ ప్రచారకుల యందు ముఖ్యముగా ఉండవలసిన లక్షణములు:- ఆత్మ నిగ్రహము, నమ్రత, సర్వసమత్వము, పరోపకార బుద్ధి, కార్యదీక్ష మొదలగునవి. ఇట్టి లక్షణములు ఈ యుద్యమ ప్రచారకులలో నున్నట్లుదాహరణ మిచ్చుచున్నాను. విశాఖపట్టణము జిల్లాయందు గొలజాం అను గ్రామము కలదు. ఆగ్రామము తూర్పాటి సన్యాసమ్మగారు అను నారీ తిలకమునకు కాపుర స్థలము. ఆమె ఆ గ్రామమున బాల సరస్వతీ గ్రంథాలయమను పేర ఒక గ్రంథాలయము స్థాపించి దానికి అధ్యక్షపదవి నధిష్ఠించి యున్నది. దైవ ప్రాతికూల్యముచే ఆమె విగతభర్తృక యాయెను. సంతానముకూడ నష్టమాయెను. కొన్ని లౌక్య వ్యవహారములలో ద్రవ్యనష్టముకూడ నాయెను. ఇట్లయ్యును విద్యాపోషకులగు దేశాభిమానుల యాదరణయందు సంపూర్ణ విశ్వాసము కలదై ఆమె

పట్టిన పట్టును వీడక యీ సరస్వతీ నిలయ సంరక్షణమునకై సతతము పాటుపడుచున్నది.

ఈ యుద్యమ ప్రచారమునకు తగినవారు మన పట్టణముల యందును, పల్లెలయందును అనేకులున్నారు. వారికి సరియైన ప్రాప్యముల నలవడచేసి దేశారాధనయందును, భాషాసేవయందును, వారల శక్తియుక్తులను వినియోగించునట్లు చేయుట దేశనాయకుల విధి. ఈ యుద్యమ ప్రచారణ చేయుటకు తగినవారలను తయారుచేయుటకు కొంత శిక్షణ కావలయునని నా నమ్మకము. ఇప్పుడు మన యాంధ్ర దేశమున వ్యాప్తి నొందుచున్న బాలభటోద్యమమును ప్రచారణ చేయుటకు ఉపాధ్యాయుల కెట్లు శిక్షణ యొసంగబడుచున్నదో అట్లే మన యుద్యమమును ప్రచారణ చేయుటకుకూడ అచ్చటచ్చట కూడలి స్థలములయందు ఒక నెలదినములకు మించని తాత్కాలిక విద్యాశాలల నేర్పరచి అచ్చట విద్వాంసుల చేతను, రాజకీయ పరిజ్ఞాన పారీణుల చేతను, గ్రంథాలయ శాస్త్రవేత్తలచేతను ఉపన్యాసముల నిప్పించవలెను. ఇట్టి సమావేశములు మన మేర్పరచవలయును గాని అవి జయప్రదమగుటకు సందేహములేదు. ఉత్సాహ ముండవలయును. కార్యదీక్ష యుండవలెను. కార్యము తప్పక సఫలమగును.

ధనము

రెండవ సాధనము ధనము. మన దేశమందు ప్రజాహిత కార్యము దేనికైనను ధనము కావలసివచ్చినపుడు చందాలను వసూలు పరచుట మనకొక యలవాటైనది. అందువలన సహజముగా ఉద్యమమునందు గౌరవము తగ్గి ఉద్యమ ప్రచారకులయందు పలుచతనముకూడ ఆపాదింపబడుచున్నది. ఇందుచే విరాళములను వసూలు పరచగూడదని నా మతముకాదు. అట్టి యలవాట్లను వీలయినవరకు మనము తగ్గించవలెను. అట్లైనచో మన యుద్యమమునకు ద్రవ్యమెచ్చటనుండి రాగలదని యందురేమో! మన పూర్వులు ప్రతి గ్రామమునందును సాముదాయపు టాస్తులను నిర్మాణము చేసియున్నారు. ఆ

ఆస్తుల పరిపాలన ఇపుడు సక్రమముగా జరుగుటలేదు. కావున ఆ యా ప్రాంతములవారు మెలకువతో ప్రవర్తించినచో ఈ ధర్మాదాయ ములనుండి వచ్చు ఆస్తిలో కొంతవరకైనను మనయుద్యమమునకు మరల్పవచ్చును. మన వర్తక సోదరులు తమ సొంత సొమ్మునుండి వ్యయ పెట్టకుండగూడ ఎట్టి ఉత్కృష్టములగు ధర్మ సంస్థాపనలను సమర్థించుచున్నారో మనము కండ్లార జూచుచున్నాము. ప్రతివృత్తి నవలంబించువారును అట్లే తమకు వచ్చు అయివజునుబట్టి ధర్మనిధి నొకటి నేర్పాటుచేసి తన్మూలమున ఇట్టి యుద్యమములను నిర్వహింప చవచ్చును. మన దేశమందు సహకార సంఘములు దట్టముగా అల్లు కొనుచున్నవి. వానియందలి ధర్మనిధినుండి మన గ్రంథాలయముల సంరక్షణకొరకయి వినియోగించవచ్చును. కొలది మాసములక్రింద విజయవాటికయందు సమావేశమైన ఆంధ్రదేశ సహకార మహాసభ లో సహకార సంఘముల లాభమునుండి ప్రస్తుతమున్న విధమున స్వల్ప మాత్రమేగాక సాంఘికుల యిష్టము చొప్పున లాభమునంతను గాని, కొంతనుగాని దేశహితైక కార్యముల కిచ్చుట కధికార ముండునట్లు సహకార చట్టమును మార్పుచేయగోరి సభ్యులు తీర్మా నించియుండిరి. ఆ మార్గమునే అనుసరించి విజయవాటికయందు నూతనముగా స్థాపింపబడిన "స్టోర్సు"నందు మూలధనముమీద వడ్డీని చెల్లించిన పిదప మిగిలిన లాభమును ఆ పట్టణమందలి 'రామమో హన పుస్తక భాండాగారమున కిచ్చునట్లు నియమము చేయబడినది. ఇదిగాక ప్రతి పల్లెటూరునందును, కొలగారపు పాటలు, కాల్వ పాట లు మొదలగువాని మూలమున ఎక్కువ సాముదాయపు సొమ్ము వసూలగుచున్నది. కొన్ని పల్లెలయందు ఈ మొత్తము వేలవరకు సమకూడినది. ఇట్టి ద్రవ్యమునుండి మన గ్రంథాలయములకు సులభ ముగా పోషణ కలుగునట్లు చేయవచ్చును. మన విద్యార్థికులు తమ తమ పల్లెటూళ్లకు వెళ్లినపుడు ఈ సాముదాయపు ఆదాయములను గూర్చి యోచించి, అవి సద్వినియోగ మగునట్లు ప్రయత్నించినచో

మన దేశమందు ప్రచారణయందున్న దేశహితైక ఉద్యమము లకు అమితమగు ధనసహాయము లభించును.

అన్యోన్యాశ్రయ భావము

మరియు మన యుద్యమము స్థైర్యముజెంది ఉపయోగకారి కావలయునన్న ఏక ప్రాంతము నందున్న గ్రంథాలయములన్నియు అన్యోన్యాశ్రయ భావము కల్గి యుండవలెను. రాజధాని నగర ములలోనుండి రాజ్యాంగము వారిచే నిర్వర్తింపబడు గ్రంథా లయములు తప్ప ఇతరమగు ఏ గ్రంథాలయమును సంపూర్ణముగా నుండనేరదు. అట్టిచో ఏక ప్రాంతమందుండు గ్రంథాలయములలో ఒక్కొకటి ఒక్కొక ప్రత్యేక శాస్త్రమందుగాని, కళయందుగాని సంపూర్ణత్వమును వహించి తదితర శాస్త్రములయందును, కళల యందును సామాన్యమగు గ్రంథములను కల్గియుండినచో విశేష గ్రంథములు కావలసివచ్చినపుడు పై చెప్పిన విధానము నవలంబించి నప్పుడు ఇతర గ్రంథాలయములమీద నాధారపడియుండవచ్చును. ఇందువలన ద్రవ్యలాభమును, ఉపయోగమును కల్గును. ఈ విషయ మునకే సన్నిహితమగు విషయము కేంద్ర గ్రంథాలయ స్థాపనయు, జిల్లా, తాలూకా గ్రంథాలయ స్థాపనయును. కడచిన విశాఖపట్టణ సభయందు బెజవాడ రామమోహన ధర్మ పుస్తక భాండాగారమును కేంద్ర గ్రంథాలయముగ నుండునట్లు తీర్మానించియుంటిమి. ఈ గ్రంథాలయమునకున్న విశాలభవనమునకుదోడు గ్రంథముల సంఖ్య మిక్కిలి హెచ్చవలసి యున్నది. ప్రత్యేకశాఖలు ఏర్పడవలసియు న్నవి. ఆంధ్ర దేశమందంతటను గ్రంథాలయోద్యమము ప్రచారణ చేయుటకు ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘమొకటి చాలదు. ప్రతి జిల్లాకును ప్రత్యేక జిల్లా గ్రంథాలయ సంఘ మేర్పడి, ఆ సంఘమున కనుబంధముగ జిల్లా గ్రంథాలయముండవలెను. అట్టి గ్రంథాలయము లేర్పడుటకు భాషా సేవాపరతంత్రు లెందరో సహాయము చేయుటకు సంసిద్ధులుగా నున్నారు. తగిన భవనమును ఉద్యమ ప్రచారకులున్న

చో రు. 1000 ల ఖరీదు గల గ్రంథము లుచితముగా లభించును. ఆ దాతలలో అగ్రేసరులు ఈ పట్టణ వాస్తవ్యులగు శ్రీయుత వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు. ఇట్లే తాలూకా గ్రంథాలయము లేర్పడ వలయును. ఇవియన్నియు గాక స్థాయి గ్రంథాలయములను భరించ లేని స్థలములకు సంచార గ్రంథ పేటికలను బంపుటకేర్పాటు చేయ వలెను.

మన మాతృభాషకు ఈ కాలమున ప్రోత్సాహము సంపూర్ణ ముగా తగ్గిపోయినది. మన పూర్వులు కావ్యకన్యకను సప్త సంతాన ములలో నొకటిగా చేర్చియుండుటచే నిన్న మొన్నటివరకును మన దేశమందలి శ్రీమంతులును, ధీమంతులును కావ్యములను కృతి నొం దుచు భాషాభివృద్ధికి కారణభూతులుగా నుండిరి. మనల నిప్పు డావ రించియున్న నూతన వాతావరణమున పూర్వవాసనలు నశించినవి. క్రొత్తవి యలవడలేదు. కొంత కాలము విశ్వవిద్యాలయము కొంత మంది గ్రంథకర్తలకు కొలది సహాయము నిచ్చుచుండెను. ఇప్పుడు ఆ సహాయముకూడ తగ్గినది. వర్తమానకాలమున భాషాసేవచేయు భాషాకోవిదులకును, గ్రంథకర్తలకును సన్మాన మొనంగు బాధ్యత గ్రంథాలయముపై బడినది. ప్రతి గ్రంథాలయమును నూతనముగా వెలువడు గ్రంథములను తెప్పించుచో భాష వృద్ధియగును. గ్రంథ కర్తలకు ప్రోత్సాహము కలుగును. ఇంతటితో ప్రతి గ్రంథాలయ మును ప్రతి ఆంధ్ర గ్రంథమును తెప్పించవలయునని నా యాశయము కాదు. పాశ్చాత్య దేశములయందు ప్రతి సంవత్సరము ప్రచురింప బడెడి గ్రంథములలో గ్రాహ్యగ్రంథములను నిర్ణయించి, వాని పట్టిక లను ప్రచురించుటకు గ్రంథాలయ సంఘముననే ఒక ఉపసంఘము ఏర్పడి యుండును. అట్లే మన దేశమున ఏర్పడవలెను. సాహిత్య పరిషత్తువారుగాని, సారస్వత సభవారుగాని ఈ పనిని పూనుకొన వచ్చును. కానిచో గ్రంథాలయ సంఘమునకే ఇట్టి ఏర్పాటు చేయ వలసియుండును. ఇచ్చట నింకొక ముఖ్యవిషయము చెప్పవలసి యు

న్నది. పాశ్చాత్య దేశములయందు ఇది ప్రత్యేక శాస్త్రమై అభివృద్ధి గాంచినది. మన భాషయందు ప్రచురింపబడినట్టియు, అముద్రితముగా నున్నట్టియు గ్రంథనామములను, వెలువడిన శాసనములయొక్క పేర్లను సంగ్రహించి అందలి విషయముల ననుసరించియు, నామముల ననుసరించియు, గ్రంథకర్తల ననుసరించియు వేరువేరుగా విభజించి ఆ విధానమును ప్రచురించవలెను. ఈ విషయమున ఇదివరకే 4000 గ్రంథ నామములను సేకరించి గ్రంథవిభజనచేసినట్టి శ్రీయుత వెలిదండ్ల శ్రీనివాసరావుగారు ఎంతయు వందనీయులు. రాజమహేంద్రవరపు సార్వజనిక గ్రంథాలయమువారు ప్రచురించిన గ్రంథ విభజన పట్టికకూడ మిక్కిలి ఉపయోగకరముగా నున్నది. శ్రీ పురాణం సూరిశాస్త్రిగారు ఈ పనిని పెద్ద యెత్తుగడతో ప్రారంభించిరిగాని సంపూర్ణము చేయరైరి. దీనికి ధనసహాయ్యము ఎక్కువగా గావలెను. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి వలన ఈ సహాయము లభించుటకు తగిన సూచనలు కన్పడుచున్నవి.

సర్వజనాకర్షకము

వీని యన్నిటికన్నను ముఖ్యము గ్రంథాలయము సర్వజనాకర్షముగా నుండవలెను. జన సామాన్యముయొక్క సామాన్యవాంఛ (Wants) లకును, గ్రంథాలయముచేయు కృషికిని సంబంధ ముండినగాని సర్వజనాకర్షకము కానేరదు. ఇట్లు చేయుటకు పలు సాధనములు అవలంబింపబడుచున్నవి. అంగలూరు గ్రంథాలయమున ఆ గ్రామ లెక్కలును, గ్రామ నక్షాయును, రైల్వే మ్యాపులును, రైళ్లును ఉంచబడియున్నవి. పలు గ్రంథాలయములవారు ఆటలకు పందెములను ఏర్పరచుచున్నారు. దేశములో కొందరికి పత్రికా పఠనము నిద్రాహారములతోపాటు స్వాభావిక వాంఛ అయినది. పిన్న పెద్దలందరు నేకత్రసమావేశమగుటకు గ్రంథాలయము గమ్యస్థానమైనది. ఇదిగాక గ్రామములో జరుగు ప్రతి సదుద్యమమును గ్రంథాలయముతో సంబంధము గలదిగా చేయవలెను. హరికథలను చెప్పించ

వలెను. చిత్రపటములను చేర్చవలెను. విద్వాంసులచే కథలు చెప్పించవలెను. తత్వములు పాడించవలెను. ఇట్లు సర్వజనులకు సుద్బోధకమగునట్టియు, రంజన చేయునట్టియు కార్యములను గ్రంథాలయముల పక్షమున సమకూర్చుచుండవలయును. గ్రామమందలి దేవాదాయ ధర్మాదాయములలో గ్రామ గ్రంథాలయము జోక్యము కలుగజేసుకొని అవి సక్రమముగా జరుగునట్లు చేయవలెను. ఈ సంఘములు ధర్మశాస్త్ర బద్ధములుగా నుండవలెను. లేనిచో చిక్కులకు కారణమగును. ఇది రెండు విధములుగా చేయవచ్చును. ఒకటి సొసైటీసు ఆక్టు క్రింద రిజిస్టరీచేయుట, రెండవది దాతలచే ధర్మశాసన పత్రికలను వ్రాయించుట. సహకార సంఘములకు రిజిస్ట్రేషన్ రుసుము మినహాయించినట్లు మన గ్రంథాలయములకును మినహాయించుట న్యాయమైన పని.

అఖిలభారత పౌర గ్రంథాలయ సభ

ఇక నొక విషయము. అంతటితో విరమించుచున్నాను. మన దేశమునకు ధర్మ గ్రంథాలయోద్యమము తెచ్చిన గౌరవము కీర్తి వహించిన బరోడా గాయక్వాడీగారిది. వారి దేశమందు వ్యాప్తమగుచున్న ఉద్యమము ననుసరించియే భారతదేశముయొక్క ఇతర భాగములయందు ఈ యుద్యమము వ్యాప్తమగుచున్నది. అటు పిమ్మట లాహోరు విశ్వ విద్యాలయమువారు అమెరికా ఖండమునుండి ప్రత్యేక గ్రంథాలయ శాస్త్రవేత్తను రప్పించి వారి మూలమున ఈ దేశమున కొంతవరకు ఈ శాస్త్రప్రచారణ గావించిరి. ఇందుకు ఫలితముగ లాహోరు నగరమున దొరతనమువారు ప్రథమ అఖిల భారత గ్రంథాలయసభను సమావేశపరచిరి. ఈ సభకు స్వదేశ సంస్థానములనుండి కొందరు ప్రతినిధులు వెళ్లినను అది కేవలము దొరతనము వారి నియమములకే లోబడి ప్రజాసామాన్యమున కచ్చట స్థానము లేకపోయెను. ఆ సభకు మన ఆంధ్రదేశమునుండి ప్రతినిధులను పంపుటకు ప్రయత్నములు జరిగెను. దొరతనమువారు సావకాశ

మీాయగైరి. ఆ సభ కేవల శాస్త్రవేత్తల కుపకరించినదిగా పరిణమించినది. కాని గ్రంథాలయోద్యమ ముఖ్యసూత్రములలో రెంటిని మాత్రము వారంగీకరించిరి. ఒకటి గ్రంథాలయములు అన్యోన్యాశ్రయములుగా నుండవలయుననుట. రెండవది శాస్త్ర పరిశోధన చేయువారలకు తగిన పరికరములను సిద్ధపరచి అమర్చుట రాజ్యాంగ విధి యనునది. పల్లెటూరు గ్రంథాలయములనుగూర్చిగాని, కేంద్ర గ్రంథాలయములను గూర్చిగాని వీరు జోక్యము కలుగు జేసుకొనలేదు. అందుచే ప్రజల పక్షమున ఇట్టి సభ యొకటి మన సభతోపాటు సమావేశపరచవలసినదని ఆంధ్ర గ్రంథాలయ సంఘ పక్షమున కొంత కృషి జరిగినది. దానికి కల్గిన ఫలితమును గడచిన రెండు దినములనుండియు అఖిల భారత గ్రంథాలయ సభ ఈ పట్టణము (మద్రాసు)ననే సమావేశమగుట మీరు చూచియేయున్నారుగదా!

—గ్రంథాలయ సర్వస్వము - నాల్గవసంపుటము - రెండవ భాగము నుండి

# సప్తమ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, మహానంది

[ 1920 మే 18 ]

## శ్రీ చిలుకూరి వీరభద్రరావు

ఆంధ్రదేశము నం దనంత ముఖముల ప్రకాశించుచున్న యాంధ్ర వ్యక్తి ప్రబోధకాంతు లజ్ఞాన తిమిరంబును పాఱద్రోలుచు నాంధ్రులలో నవీనోత్సాహమును, నవీన సంకల్పములను, నవీన ప్రయత్నములను వికసింపజేయుచున్న వనుమాట యాంధ్రేతరులయిన భారతీయులు సహితము విశ్వసింపుచున్నారు.

మన భరత వర్షము వివిధములయిన భిన్నవ్యక్తులకు నిలయమై యున్నదనుటను మఱువరాదు. అట్టి వ్యక్తులలో నొక్కటియగు నాంధ్ర వ్యక్తిత్వము నిన్న నేడు జనించినది కాదు. ఇప్పటికి రెండు వేల యేనూరు సంవత్సరములకు ముందే యుదయించి తదితర భారతీయ వ్యక్తిత్వములకంటె గుణశీలములయందును, సంకల్పముల యందును, బిన్నమయినదయి, భరతఖండమునందు సంరక్షితమయి యొప్పుచున్నది. ఇట్టి వివిధ వ్యక్తుల వికాసంబును, వికాసవంతంబులైన నానా వ్యక్తుల సమ్మేళనంబులును భారత జాతీయ తత్త్వార్థముగ గ్రహింపగల ధీ విశాలురాంధ్ర వ్యక్తి సంరక్షణపోషణ పాలనములు ధర్మమార్గ మతిక్రమించుటలేదనియు, భారత వర్షాభ్యుదయ సాధనములనియు గ్రహింపకపోరు. ఆంధ్రదేశ వ్యక్తి ప్రబోధప్రదములయిన సకలోద్యమములు నాంధ్రోద్యమ గర్భస్థములయి యాంధ్ర మహాజన సభయందు కేంద్రీకృతములై యున్నవి.

ఆంధ్ర గ్రంథాలయోద్యమము

అట్టి ఉద్యమములలో ప్రప్రథమున గణింపదగినది యాంధ్ర గ్రంథాలయోద్యమము. ఇది యన్నిటికి బునాదివంటిది. దీనింగూర్చి

యిటీవ యాంధ్రదేశ గ్రంథాలయసభ కధ్యక్షులుగా నుండినవా
రును. ఆంధ్రత్వ సిద్ధిని గాంచినవారు నయిన బ్రహ్మశ్రీ సూరి వేం
కట నరసింహశాస్త్రిగారు చక్కగా వర్ణించినారు.

సర్వకళా పరిపూర్ణమై యౌవన ప్రాదుర్భావమున నున్న యీ
యాంధ్ర గ్రంథాలయోద్యమ మిపుడు కల్యాణ సిద్ధినిగోరి ప్రమథ
గణాధిపతియైన మహానందీశ్వరుని వరప్రసాదమును బడయుటకై యీ
పుష్కర పర్వకాలమున నీ పుణ్యక్షేత్రమునకు విచ్చేసి మీ మహదా
శీర్వచనమునకై వీక్షించుచున్నది. మీర లీ దివ్యక్షేత్రమును సంద
ర్శించుటచేత నేడు మీ హృదయములు పవిత్రములగుచున్నవి. మీ
పవిత్ర హృదయములతో నొక్కమారు దీవింపుడు. ఆంధ్ర గ్రంథా
లయోద్యమము మీ మహదాశీర్వచన బలముతో మహానందీశ్వరుని
వరప్రసాదమును బడసి, కల్యాణ సిద్ధినిగాంచి తన కల్యాణ విజయ
గీతము నాంధ్రదేశమున నింటింట వినిపించుచు ప్రత్యాంధ్రుని జీవిత
మును పవిత్రవంతమైనదిగను, పురుషార్థ సాధకమైనదిగను జేసి యాం
ధ్రులకు భరత ఖండమున నుత్తమస్థానము నొసంగి, ప్రపంచమున
వారి యశస్సు దిగంతములవరకు వ్యాప్తి నొందింపగలదు.

అర్ధ శతాబ్దికి బూర్వము మన యాంధ్రదేశమున గ్రంథ సం
పాదన మెంత కష్టముగ నుండెనో యీ క్రింది కథవలన మీకు విశ
దము కాగలదు.

ఈ నవీన శకమున మన దేశమునందలి సకలోద్యమములకు
మూల పురుషుండనదగి కీర్తిశేషులయిన సంస్కర్తలు వీరేశలింగం
పంతులుగారు తమ స్వీయచరిత్రమునం దీ రీతిని వ్రాసియున్నారు:-
“ఆంధ్ర కావ్యములలోనెల్లను వసుచరిత్ర ముత్తమమైనదని పలు
వురు చెప్పుచు వచ్చిరి. అందుచేత దానినేలాగునైన జదువవలెనని
నా మనస్సువ్విళ్లూర జొచ్చెను. మాయింట గల తాటాకుల పుస్తక
ముల నెల్లను విప్పిచూచితిని. గాని వసుచరిత్ర మందు గానరాలేదు.
అప్పుడేమి చేయుటకును తోచనివాడనయి, నా తల్లి నడుగుదునా,

మానుదునా యన్న సందేహముచే డోలాందోళన మానసుడనై కొన్ని దినములు నాలో నేను తలపోసి, తుదకు సాహసముచేసి యొక నాడు మెల్లగా నామెను డాయబోయి వసుచరిత్రమును కొనిపెట్ట మని దీనముగా వేడితిని. అది నా పాఠపుస్తకము కాదని మొఱిగిన దయి యామె నా కోరికను చెల్లింపక నిరాకరించెను. ఇట్లాశాభం గము నొందిన వాడనైనను నిరాశజెంది యూరకుండక యేలాగునైనను వసుచరిత్రమును గొని చదువవలయునని నిశ్చయించు కొంటిని. ఎట్లు కొనగలుదును? అప్పుడు పుస్తకము వెల నాలుగు రూపా యల యెనిమిది అణాలు, నాచేత నెనిమిదణాలకంటె నెక్కువగా లేవు; నా తల్లినడిగిన నేమియు నిచ్చు జాడకనబడలేదు; న్యాయ మార్గమున నంతవిత్తము నార్జించుటకును నా కప్పుడాధారము కనబడ లేదు. అందుచేత నాయొద్దనున్న యెనిమిదణాలును తోడనే పుస్తక విక్రేత చేతిలోబెట్టి, తరువాత నెల కెనిమిదేసి యణాలచొప్పున ప్రతి మాసము నిచ్చుచుండు పద్ధతిమీద పుస్తకమును కొని చదువవలెనని, నా కప్పుడొక దురాలోచన తోచినది. నెలనెలకు నెనిమిదేసి యణాల చొప్పున నిచ్చుచుండుటకు సహితము నా కప్పుడు శక్తిలేదు. కాబట్టి ప్రతి దినము వేళకు భోజనముచేసి పాఠశాలకు బోవుచున్నట్లు నటిం చుచు నెక్కడనో కూర్చుండి సాయంకాల మింటికి వచ్చుచుండుట కును, పాఠశాల జీతము నిమిత్తమిచ్చెడి యెనిమిదణాలును పుస్తకము నిమిత్తము వ్యయపెట్టుచుండుటకును నిశ్చయించితిని... పుస్తక పఠనా భిలాష నన్నవివేకుని జేయగా నేను వెంటనే పుస్తక విక్రేతయగు పందిరి మహాదేవుడను వైశ్యునికడకు బోయి నా వాంఛను దెలిపి తిని. నా యతిలాలసత్వమును జూచి కనికరించి పుస్తకము వెల తీరు వఱకును తన పుస్తక విక్రయశాలలోనే నేను కూరుచుండి దానిని చదువుకొనుచుండునట్లు సమయమేర్పఱచి యా వణికుడు నా ప్రా ర్థన మంగీకరించెను. ఆ వఱకు నా యొద్దనున్న యెనిమిదణాలును, నా కప్పుడు నెల జీతముకొఱ కిచ్చిన యెనిమిదణాలును జేర్చి యొక

రూపాయ పుస్తక విక్రేతకిచ్చి, యాతని యంగడిలోనే కూరుచుండి యతి కుతూహలముతో పుస్తకమును జదువ నారంభించితిని. నేను పాఠశాలకు బోకుండుట రెండవ నెలలోనే నా సహపాఠులవలన నా దల్లికి తెలిసినది. అప్పుడామె నన్ను మందలించి అడిగినతోడనే సత్యము చెప్పినందుకు గొంత సంతోషించి మిగత సొమ్మిచ్చి నా కా పుస్తకమును గొనిపెట్టి నన్ను మరల బాఠశాలకు బంపెను.

అప్పటి రాజమహేంద్రవర స్థితికిని, ఇప్పటి రాజమహేంద్రవర స్థితికిని నెంత వ్యత్యాసము గలదో పరికించితిరా? ఇప్పుడు రాజమహేంద్ర పురమున గావ్య పఠనాభిలాషియగు నెట్టి విద్యార్థికైనను ఎంత యధిక మూల్యముగల యాంధ్ర గ్రంథమైనను నచ్చుపడినదగునేని వ్యయప్రయాసలతో నవసరములేకయే సులభ సాధ్యమగుచున్నది. ఇట్టి అభివృద్ధికి గారణమేమి? అప్పుడొక చిన్న యాంధ్ర గ్రంథాలయమయిన లేని యా నగరమున నిప్పుడొక మహత్తరమైన యాంధ్ర గ్రంథాలయ మేర్పడియుండుట కారణమని చెప్పుటకన్న మఱి యేమి చెప్పదగును? ఇప్పుడు మన యాంధ్ర దేశమునందు రాజమహేంద్రపురముననే గాక పెక్కు పట్టణములలోను, పల్లెలలోనుగూడ గ్రంథాలయములు పెక్కులు నెలకొల్పబడినవి. కావుననే యాంధ్ర గ్రంథాలయోద్యమ మవతరించి, వాని యభివృద్ధికిని, వ్యాప్తికిని మహత్తరమైన కృషి సలుపబూని, మహా భారమును సంతోష పూర్వకముగా శిరమున వహించి నడచుచున్నది. ఇదెంతయు ప్రశంసనీయము. ఈ యాంధ్ర గ్రంథాలయోద్యమము బయలు వెడలినది మొదలు నద్భుతములయిన మార్పులను, వికాసమును బుట్టించుచున్నది. దీనికి మార్గదర్శిని బరోడా రాజ్యమునందలి గ్రంథాలయోద్యమముగా గన్పట్టుచున్నది. మొదట నీ భరతభండమున గ్రంథాలయోద్యమము నెలకొల్పి నడుపుచున్న మహనీయుడు బరోడా గాయకవాడీగారు. ఇమ్మహారాజు భరతఖండమున గల స్వదేశ సంస్థానాధీశ్వరులలో నాయకమణి యని చెప్పదగును. ఇమ్మహనీయుడు

ప్రపంచము నంతటను సంచారముచేసి పాశ్చాత్య దేశము లెట్లభివృద్ధి గాంచుచున్నవో యా మార్గము లన్నిటిని గన్నులార గాంచి, యా మార్గముల ననుసరించి తన రాజ్యమున సంస్కరణముల గావింప మొదలుపెట్టెను. ఈయన ప్రారంభించిన యుద్యమములలో నీ గ్రంథాలయోద్యమ మొక్కటిగా నుండెను. ఈ భూమండలమున నున్నత స్థానము నధిష్ఠించిన యమెరికా దేశముయొక్క ప్రాభవమున కంతకు గారణము గ్రంథాలయోద్యమమేయని కనిపెట్టి 1910 సంవత్సరమున తన రాజ్యమున గ్రంథాలయమును నెలకొల్పెను. నాటినుండియు నియ్యది దినదినక్రమాభివృద్ధిగాంచుచున్నది. దేశాభిమానియు, దృఢచిత్తుడునైన మహారాజు నడుపు నే యుద్యమము జయప్రదమై వర్ధిల్లకుండును? బరోడా గ్రంథాలయోద్యమ చరిత్రమునుగూర్చి పెక్కు వ్యాసములు గ్రంథాలయ సర్వస్వములోను, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలోను, ఆంధ్రపత్రికలలోను బ్రకటింపబడియుండుటచేత దాని నిట మరల దెలుపుట మాని, యాంధ్ర గ్రంథాలయోద్యమమునుగూర్చియే కొంత వివరింపబోవు చున్నాడను.

ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘము

బరోడా గ్రంథాలయోద్యమము భారతీయులలో నాంధ్రుల నాకర్షించినట్లుగా మఱి యెవ్వరి నాకర్షించినట్లు కన్పట్టను అనుకరణయం దాంధ్రులు ముందంజ వేయువారనియెడు ప్రసిద్ధి యూరక పుట్టినది కాదు. అందును సదుద్యమము పట్టున నాంధ్రులు పెడమొగము బెట్టువారు కారు. స్వాతంత్ర్యాభిలాషులు జాతీయ తత్త్వవాదులు, జాత్యభిమానులు, స్వస్థాన వేషభాషా నిరతులు, కర్మాసక్తులు నగుటవలన నాంధ్రులు కేవల మనుకరణమునందు మాత్రమే తమ చిత్తమును జొనుపక స్వజాత్యుచిత సంస్కరణ విధానములతో నవలంబించి యెట్టి యుద్యమమున నయినను నడుప సమర్థతగలవారని వీరు పూనిన గ్రంథాలయోద్యమమే లోకమునకు వేనోళ్ల జాటి చెప్పగలదు. చూడుడు. బరోడా గ్రంథాలయోద్యమమునకు దరువాత నాంధ్ర గ్రంథాలయోద్యమమే భరతఖండమున వన్నెయు

వాసియు గాంచియున్నది. అయ్యది బరోడా మహారాజుగారి ప్రాపున వర్ధిల్లుచుండగ నియ్యది యాంధ్రుల స్వయంకృషి మాత్రముననే వర్ధిల్లుచున్నది అచ్చటి యుద్యమ వ్యాప్తికి నే విధమైన యాటంకమును లేదు. మన యీ యుద్యమమునకో యెదుర్కొని నివారింపవలసిన యరిష్టములు పెక్కులు గలవు. అయిన నాంధ్ర యువకుల యుత్సాహాము ముంగట నే యడ్డును నిలువం జాలదు. బరోడాలో గ్రంథాలయోద్యమము బయల్వెడలిన నాలుగేండ్లకు అనగా 1914 వ సంవత్సరమున విజయవాటికా నగరమున నెలకొనియున్న రామమోహన ధర్మ పుస్తక భాండాగార సంఘముయొక్క సభ్యు లాంధ్ర దేశమందలి గ్రంథాలయములనుండి ప్రతినిధులను రావించి వారలతో నాలోచించి, అప్పటికి నెలకొల్పబడియున్న గ్రంథాలయముల నభివృద్ధి పరచుటకును, నవీన గ్రంథాలయముల స్థాపన చేయుటకును, గ్రంథాలయోద్యమ మే దేశముల ప్రఖ్యాతి గాంచుచున్నదో యా దేశముల నీ విషయమయి జరుగు కార్యములనుబరిశీలించి, యా కార్యక్రమమును దేశ కాల పాత్రములకు దగినట్లు మార్పుచేసి మన దేశమునగూడ ప్రవేశపెట్టుటకును, ఆంధ్ర దేశ గ్రంథ భాండాగార సంఘమను పేరుతో నొక సంఘము స్థాపింప నెంచి యీ సంవత్సరమున నాంధ్ర మహాసభతోపాటు ఆంధ్ర దేశ గ్రంథాలయ ప్రథమ సభను సమావేశపరచి పై సంఘము నేర్పఱచిరి. నాటినుండియు పై సంఘమువారు అత్యంతోత్సాహమున బనిచేయుచుంట మనము కన్నులార గాంచుచున్నారము. 1914 వ సంవత్సరములో 'ఆంధ్ర దేశ గ్రంథ భాండాగార సంఘ' మేర్పడునాటికి 133 గ్రంథాలయము లాంధ్ర దేశమున గలవని లెక్కలవలన దేలినది. ఇప్పటి కాంధ్ర దేశమున నించుమించుగా 600 గ్రింథాలయములు గలవు. ఆంధ్రి గ్రంథాలయోద్యమమునుగూర్చిన వాఙ్మయము దిన క్రమమున బెఱుగుచున్నది. ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘమువారు చేయుపనిగాంచి యుత్సాహవంతులము కావలసిన దేగాని నిరుత్సాహము బొందవలసిన పని లేదు.

గ్రంథాలయ సర్వస్వము

ఆంధ్ర దేశ గ్రంథ భాండాగార సంఘము పక్షమున "గంథాలయ సర్వస్వము" అను పేరిట నొక గ్రంథము ప్రకటింపబడుచున్నది. దీని భారమునంతను వహించి నడుపుచున్నవారు శ్రీయుతులు అయ్యంకి వెంకట రమణయ్య పంతులుగారు. వీరు తమ జీవితము నంతను ఈ గ్రంథాలయోద్యమమునకు నర్పణముచేసి పాటుపడు చున్నందుకు నాంధ్రులు వీరి కెంతయు గృతజ్ఞత చూపవలసి యున్నది. కాగితము వెల పెరిగి కరవయియున్న యుద్ధకాలమున మంచి కాగితములపై చిత్రపటములతో సంవత్సరమునకు నాలుగు సంచికలుగా బ్రకటింపుచు మాతృభాషా సేవనుజేసి వందలకొలది రూప్యములను నష్టబెట్టుకొనిరి. మన దేశమునం దిన్ని గ్రంథాలయములు వెలసియున్నప్పుడు గ్రంథాలయమున కొక్క ప్రతి చొప్పున దెప్పించుకొని చందాల సరిగా నిచ్చినచో వీరింత నష్టమునకు బాల్పడి యుండరు. ఇవ్విషయమున నాంధ్ర దేశ గ్రంథాలయముల వారుపేక్షాపరులై తోడ్పడ కుండుట మిక్కిలి శోచనీయము. ఇట్లుండుట యాంధ్ర దేశమునకు గౌరవప్రదము కాదు. ఆంధ్ర దేశ సేవా తత్పరుడైన యిమ్మహానీయునిపట్ల నాంధ్రులకు గౌరవము లేకపోలేదు. చెన్నపురిలో జరిగిన యాఱవ యాంధ్ర గ్రంథాలయ సభలో వీరి దేశసేవా తత్పరతకు మెచ్చుకొనుచు నొక బంగారు పతకము నీయ గొందరు యువకులు ప్రయత్నించగా సోదరులారా! నాకు బంగారు పతకము నొసగుట నన్ను గౌరవించుటకాదు. నా కార్యమునకు దోడ్పడుటయే నన్ను గౌరవించుట యని వారు చెప్పుకొనగా మీ యుద్దేశ్యమేమని యడిగిరి. గ్రంథాలయ సర్వస్వమును ముద్రించుకొనుటకు నాకొక ముద్రాయంత్రము కావలసియున్నది. దానిని కొనదలచుకొని యున్నాడను. మీరు సహాయము చేయదలచుకొన్న యెడల దానికి జేయుడు. అందువలన దేశ సేవచేయుట కవకాశ ముండునని చెప్పినతోడనే యుదార గుణ సంపన్నులగు బారిష్టరు

టంగుటూరు ప్రకాశం పంతులుగారు రు. 500-0-0 లు విరాళము నొసంగుచున్నామని వాకొనగా గొందరు యువకు లభినివేశముతో గొన్ని వందలవరకు విరాళములను బ్రకటించిరి. ఎంతవరకీ యువకులు తమ విధ్యుక్తము నెఱవేర్చియుండిరో నాకు దెలియదు గాని వేంకటరమణయ్యగారు ముద్రాయంత్రమును గొనియున్నట్లు విని యున్నాడను. వీరు శీఘ్రకాలములోనే తమ పనిని ప్రారంభించి, యిదివరకు ముద్రింపబడక నిలిచియున్న గ్రంథాలయ సర్వస్వమును ముద్రించి, ప్రకటింతురుగాక యని కోరుచున్నాను. మన దేశము నందలి గ్రంథాలయముల వారెల్లరును వారికి తోడ్పడి యొక్కొక్క ప్రతిని దెప్పించుకొనుచు వారింకను నధికోత్సాహముతో దేశసేవను సలుపుటకు సహకారులగుదురు గాక యని ప్రార్థించుచున్నాడను. వీరు 1915 వ సంవత్సరమున ఆంధ్రగ్రంథాలయ వృత్తాంత చరిత్రమును దెలుపు గ్రంథమును బ్రకటించి యున్నారు.

గ్రంథాలయ వ్యాప్తి

ఉత్తర సర్కారులనియెడు గంజాం, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, గుంటూరు మండలములలోను, నెల్లూరు మండలములోను గ్రంథాలయోద్యమము వ్యాప్తిగాంచుచున్నట్లు తదితరాంధ్ర మండలములలో వ్యాప్తిగాంచుచుండలేదు. గంజాంమండలమున 24, విశాఖపట్టణ మండలమున 23, గోదావరి మండలమున 140, గుంటూరు మండలమున 151, నెల్లూరు మండలమున 31 గ్రంథాలయములు గలవు. చిత్తూరు, కడప, అనంతపురం, బళ్లారి, కందనోలు (కర్నూలు) మండలములలో 30 గ్రంథాలయముల కన్న నెక్కువ లేవు. చిత్తూరు 9, కడప 11, అనంతపురం 5, బళ్లారి 4, కర్నూలు 1, సేలం 7, చెంగల్పట్టు 2, చెన్నపురి 6, బెంగుళూరు 4, ఆంధ్రేతర దేశములలో 11, హైదరాబాదు రాష్ట్రమున 19 గ్రంథాలయములు గలవు. గంజాం, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, గుంటూరు నెల్లూరు మండలములలో గ్రంథాలయ సంఘములున్నట్లు గన్పడు

చున్నది. దీనికి గ్రంథాలయముల సంఖ్య పెరుగుచుండుటయేగాని
మరి వేరు కారణములేదు. 'పశ్చిమ యాంధ్ర దేశమున నూతన గ్రం
థాలయముల నెలకొల్పుటకై యాంధ్ర దేశ గ్రంథాలయ సంఘము
వారు విశేషముగా కృషి సలిపినిగాని యాంధ్ర దేశమున సమానాభి
వృద్ధి గనుపింపదు. అందును కర్నూలు మండలములో శిరివెళ్ల యను
గ్రామమున సుజ్ఞాన వర్ధనీ గ్రంథాలయమను పేరుతో నొక గ్రంథా
లయము నల సంవత్సరములో స్థాపింపబడినదట. అందు 94 గ్రంథ
ములు మాత్రమున్నవట. ఆహాహా! ఏమి యీ వింత? ఆంధ్ర దేశ
ములో కర్నూలు మండలము సుప్రసిద్ధమైన చరిత్రముగలది. సుప్ర
సిద్ధ శైవక్షేత్రమగు శ్రీశైలమును, వైష్ణవక్షేత్రమగు నహోబిలమును
కర్నూలు మండలములోనివేగదా! ప్రాచీనకాలమున శ్రీ పర్వతము
(శ్రీశైలము) ఒక మహా పట్టణముగా నుండెను. బౌద్ధయుగము నా
డిందొక సంఘారామముగలదు. ఇచట నొక మహావిద్యాలయ మాం
ధ్రచక్రవర్తుల పోషణమున వర్ధిల్లెను. తర్కశాస్త్రవేది, మహాతత్త్వ
వేత్త, మహాయాన బౌద్ధమతోద్ధారకుడైన నాగార్జునాచార్యు డిందే
కొంతకాలము నివసించియుండెను. అంత ప్రాచీనకాలమునకు బోవనేల?
ఆంధ్ర భాషా పోషకులగు కందనోలార్వీడు మొదలగు రాజులకు
కర్నూలు మండలము నిలయముగా నుండెను. ఆంధ్రభాషలో
నుత్తమకావ్యముల రచించిన మహాకవియగు పింగలి సూరనార్యునకు
వాసస్థానముగా నుండెను. ఆంధ్ర మహాకవులగు కుమార ధూర్జటి,
అందుకుల వెంకయ మొదలగువారు కృష్ణరాయ విజయము, నరపతి
విజయము మొదలుగా గల చరిత్ర ప్రబంధములను రచించి యిచ్చటి
రాజులకే యంకితము గావించి ధన్యులైరి. అట్టి యీ కర్నూలు
మండలము మాతృభాషా సేవయందు వెనుకబడియుండుట మిక్కిలి
శోచనీయము. ఇంతటినుండియైన కర్నూలు మండ లాంధ్రులు తమ
సోదరులను మేల్కొలిపి గ్రంథాలయముల బెక్కింటిని నెలకొల్పి,
మాతృభాషా సేవకు బూనుకొనవలయునని వినయముతో హెచ్చ

రింపుచున్నాడను. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో ప్రకటింప బడిన యాంధ్రదేశ గ్రంథాలయ పట్టికను గమనించినయెడల రాజ మహేంద్రపురమునందలి శ్రీ గౌతమీ గ్రంథాలయ మగ్రస్థానమును బొంది యున్నది. ఇయ్యది తొలుత శ్రీ వీరేశలింగ పుస్తక భాండా గారమను పేరిట శ్రీయుత నాళము కృష్ణారావుగారిచే 1900 సంవత్స రమున స్థాపింపబడి, మఱి కొంతకాలమునకు సర్వజన పుస్తక భాండా గారముగ మార్పునొంది గత సంవత్సరము వసురాయ పుస్తక భాండాగారముతో సమ్మేళనము గావింపబడి నేడు గౌతమీ గ్రంథా లయమను పేర బరగుచు సుమారు పదివేల (10000) గ్రంథములతో విరాజిల్లుచు, వర్ధిల్లుచున్నది. దీని కింకను స్వంత భవనమేర్పడి యుండలేదు. అయినను చక్కని నిబంధనల నేర్పఱచుకొని రాజ మహేంద్ర యువకులచే మిక్కిలి జాగరూకతతో నడుపబడుచున్నది. మరియు గోదావరి మండలమున నిది గాక 5000 కంటె నెక్కువ గ్రంథములను గలిగియుండిన శ్రీ విద్యానంద పుస్తక భాండాగార మొకటి పిఠాపురమున విలసిల్లుచున్నది. వేయి గ్రంథముల కన్న నెక్కువ గ్రంథములను సంపాదించి పెట్టియున్న గ్రంథాలయములు మఱి నాలుగు గలవు. ఇంతియ గాక 500 గ్రంథముల కంటె నెక్కువ గ్రంథములు గలవి 25 గ్రంథాలయములు గలవు. గంజాం మండల మున బరంపురంలోని శ్రీ బ్రహ్మపురాంధ్ర భాషాభివర్ధనీ సమా జము 2000 గ్రంథములను కలిగియుండి యా మండలమునందలి గ్రం థాలయములలో నగ్రస్థానమును బొందియున్నది. దీని వెనుక బారు వలోని శ్రీ. కృష్ణదేవరాయ గ్రంథాలయము రెండవ స్థానము వహించియున్నది. మరియు 500 ల కంటె నెక్కువ గ్రంథములను గలిగియున్నవి మఱి నాలుగు గ్రంథాలయములు గలవు. విశాఖ పట్టణ మండలమున విజయనగరము నందలి శ్రీ విజయాంధ్ర పుస్తక భాండాగారము అగ్రస్థానమును బొందియున్నది. మరియు 1000 కి పైబడిన గ్రంథములు గలవి ౩ గ్రంథాలయములును, 500

కు పైబడిన గ్రంథములు గలవి 2 గ్రంథాలయములును గలవు. కృష్ణా మండలమున శ్రీ రామమోహన ధర్మపుస్తక భాండాగారమున నెన్ని గ్రంథములు కలవో నే నిప్పుడు చెప్పజాలను గాని స్వంత భవనముతో నొప్పుచు, ప్రథమస్థానమును బొందియున్నదని మాత్రము చెప్పగలను. ప్రస్తుత మియ్యదియే యాంధ్రదేశమున కేంద్ర గ్రంథాలయముగా నొప్పుచున్నది. ఆంధ్ర గ్రంథాలయోద్యమ వ్యాప్తికై వీరే కృషి సలుపుచున్నారు. కృష్ణా మండలమున 'అంగలూరు' నందలి బాలసరస్వతీ పుస్తక భాండాగారము 2829 గ్రంథములతో 2 వ స్థానమును వహించియున్నది. మరియు ఏలూరు నందలి హిందూ యువజన సంఘమువారి గ్రంథాలయము 2636 గ్రంథములతో 3 వ స్థానమును వహించి యున్నది. ఇదియునుగాక 500 లకు పైనను 1000కి లోపలను పుస్తకములు గల గ్రంథాలయములు 30 గలవు. గుంటూరు మండలమున పేరుకలపూడి యందలి జ్ఞానోదయ గ్రంథాలయము 1521 గ్రంథములతో నొప్పుచు ప్రథమస్థానమును బొందియున్నది. గుంటూరు మండలమున 1000 గ్రంథములకంటె నెక్కువ గలవి 5 గ్రంథాలయములును, 500 కు పైనను 1000 కి లోపలను గలవి 20 గ్రంథాలయములును గలవు. నెల్లూరు మండలమున నెల్లూరిలోని తిక్కన పుస్తక భాండాగారము సుమారు 3000 గ్రంథములతో నొప్పుచు ప్రథమస్థానమును వహించి యున్నది మఱియు గండవరము నందలి శ్రీ రాజా రామమోహనరాయల గ్రంథాలయము సుమారు 1700 గ్రంథములతో నొప్పుచు రెండవ స్థానమును వహించియున్నది. ఇంతియ గాక 500 గ్రంథములకంటె నెక్కువగలవి మఱి నాలుగు గ్రంథాలయములు గలవు. చిత్తూరు మండలములో తిరుపతిలోని శ్రీ లక్ష్మీవేంకటేశ్వ రాన్నదాన సమాజ భాండాగారము కొంచెము తక్కువగా 1000 గ్రంథములతో నొప్పుచు ప్రథమస్థానము బొందియున్నది. రెండవదియగు నారాయణవరము నందలి హనుమద్గ్రంథాలయము 816 గ్రంథములతో నొప్పుచున్నది.

మొదటి దానికి నెలవరుమానము 5 రూపాయలయినను రెండవ దానికి నెలవరుమానము రు. 869-0-0. రెండవదియే యెక్కువ చురుకుదనముతోను, అభినివేశముతోను కృషి సలుపుచున్నట్లు కన్పట్టుచున్నది. కడప మండలమున కడపలోని శ్రీరామకృష్ణ సమాజ భాండాగారము 1680 గ్రంథములతో నొప్పుచు నగ్రస్థానమును బొందియున్నది. అనంతపుర మండలమున విద్యార్థి సంఘ పుస్తకాలయము 850 గ్రంథములతో నొప్పుచు నగ్రస్థానమును బొందియున్నది. బళ్లారి మండలమున ఆనెగొంది పట్టణమునందలి వివేక వర్ధనీ భాండాగారము 1000 గ్రంథములతో నొప్పుచున్నది. కర్నూలు మండలములో శిరువేళ్ల గ్రంథాలయమున 64 గంథములు కలవట. హైదరాబాదు రాష్ట్రమున హైదరాబాదులోని శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము 1849 గ్రంథములతోను, సికిందాబాదునందలి యాంధ్రయువజన సంఘమువారి గ్రంథాలయమును, హానుమకొండలోని శ్రీ రాజరాజాంధ్రభాషా నిలయమును 1000 గ్రంథములతోను నొప్పుచున్నవి.

—గ్రంథాలయ సర్వస్వము - నాల్గవ సంపుటము - మూడవ భాగమునుండి.

# అష్టమ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, పవిడిపాడు

[ 1923 మే 1, 2, 3 ]

## శ్రీ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యా

గ్రంథాలయోద్యమమునుగూర్చి మీ యెదుట ముచ్చటించుటకు నాకు సావకాశము కల్గినందుకు నేను సంతసించుచున్నాను. సూరి వెంకట నరసింహశాస్త్రిగారు ఇదివరలో ముచ్చటించినట్లు నా స్వభావమునుబట్టి రాజకీయ క్షేత్రమున కృషిచేయుటకు నేను తగినవాడను కాను. అయితే వర్తమాన కాలమున దేశమందలి కవులు, గాయకులు, చిత్రకారులు, తత్త్వవేత్తలు, ప్రకృతి శాస్త్రవేత్తలు, సన్యాసులు మొదలగు దేశోద్ధారకులందరు దేశాభ్యుదయమునకై సర్వతోముఖమగు కృషి చేయవలసిన సమయ మాసన్నమైనది. నా జీవితమందలి కొన్ని సందర్భములవలన నేను రాజకీయ క్షేత్రమునకు ఆకర్షింపబడి, అచ్చటనే నా యకుంఠిత ప్రయత్నము చేయవలయునను దృఢ సంకల్పము నాకు రూఢమైనది. ఈ రెండు సంవత్సరముల అనుభవమువలన సాంఘికము, విద్యా విషయకము మున్నగాగల వివిధములగు మానవ కృషినంతను ఆధ్యాత్మిక దృష్టితో సంస్కరించి కేంద్రీకరింపజేసినగాని రాజకీయముగ మనము అభివృద్ధిని పొందజాలమను మాట నాకు నిశ్చయమైనది. ఆంధ్ర గ్రంథాలయోద్యమము భారత జాతీయ సౌధ నిర్మాణమునకు ఆంధ్ర దేశమున పునాదులు వేసెననుమాట నిశ్చయము. జాతీయోద్ధారణ సాధకములగు అన్ని సదుద్యమములకును ఆంధ్ర గ్రంథాలయములు ఉనికి పట్టువులుగ నుండుననుమాట నిశ్చయము. గ్రంథాలయోద్యమము విద్యావిధానమున అంతర్భాగముగా నెంచబడతగినదై యున్నది. ఇదివరకు ఈ ఉద్యమ పక్షమున ఇట్టి కృషియే జరిగి యున్నది. ఈ సభకు అధ్యక్షుడుగా నుండుమని నన్ను కోరినందున



శ్రీ చిలుకూరి వీరభద్రరావు



శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

ఈ యుద్యమముయొక్క స్వరూప స్వభావములను నిర్ణయించుటకును, ఇందు లీనమైయున్న విజాతీయతను తొలగించుటకును ఈ సావకాశమును నేను సద్వినియోగము చేసికొనుచున్నాను. మద్రాసు అఖిల భారత సభలో ఈ యుద్యమమునుగూర్చి నేను చేసిన ప్రశంస పూర్వపక్షముగను, వర్తమానోపన్యాసము సిద్ధాంతముగను ఎంచవలయును.

మామూలుగ అందరు సభాధ్యక్షులకు ఆచారమైనట్లు అచ్చునుండి మీకు ఉపన్యాసమును నేను చదువకుండి నందులకు కొంత సమాధానము చెప్పవలసియున్నది. హావభావవిలాసములతో కూడి నా యెదుట ప్రత్యక్షముగా నున్న సభ్యులతో నేను ముచ్చటించు దునుగాని వారి మనోభావములు ఇట్లుండవచ్చునని ముందుగా నా మనోఫలకమున చిత్రించుకొని వారి పరోక్షమున నా యుపన్యాసము సిద్ధపరచు నాచారము నాకు సరిపడదు. వర్తమానకాలపు నవనాగరికపు స్త్రీ తాను కల్పించుకొన్న ఇతర వ్యావృత్తులచే నియమిత కాలములయందు మాత్రము శిశువునకు స్తన్యము నిచ్చు అస్వాభావికపు పద్ధతిని యవలంబించవచ్చును గాని శిశు సందర్శన మాత్రమునసే స్తన్యము స్రవించుటయే స్వాభావికము. వివిధ స్వభావములు గల సభ్యులు పరిషత్తులయం దుందురు గాన వారివారి రుచుల వైచిత్ర్యమును వక్త అనుసరించవలెను. కావున ఆశువుగా ఉపన్యసించి నందుకు నన్ను మన్నించవలెను.

కేవల రాజకీయములు కాని ఇతర సభలలో నేను జోక్యము గల్గచేసుకొనుటకు కారణమును ఇప్పుడు చెప్పియుంటిని. మానవ జీవితము ప్రభిన్నమైనదను వాదము నే నంగీకరింపను. ఈ రెండు సంవత్సరములనుండియు ఇతర సాధనముల మూలమున దేశాభ్యుదయము పొందు మార్గముల ననుసరించుటకంటె రాజకీయ వ్యవహారముల యందే దేశనాయకులు నిమగ్నులయి యుండిరి. జాతీయాభ్యుదయము పొందుటకు ప్రథమమున రాజకీయ సమస్యలకు సమాధానము కుదుర్చుట అత్యావశ్యకమేమైనను హిందూ దేశముయొక్క ప్రత్యేక

పరిస్థితులనుబట్టి సాంఘిక, విద్యావిషయికోద్యమములు జయప్రద
ముగా కొనసాగించుచు రాజకీయోద్యమము కొంతకాలము వరకు
వెనుకకు నెట్టుట మనకు నావశ్యకమయినది. కావుననే జైలునుండి
బయటకు వచ్చినప్పటినుండియు సాంఘిక శృంఖలములను సడల్చు
టకే నేను కృషిచేయు చుంటిని. మహాత్ముడు నిర్మాణ కార్యక్రమ
మున అస్పృశ్యతా నివారణకును, దౌర్జన్య రాహిత్యమునకును ప్రా
ముఖ్యత నిచ్చుటయందలి ఉద్దేశము సాంఘిక, రాజకీయ క్షేత్రముల
యందు తీవ్రముగు కృషి జరుపవలెనని ప్రజలను పురికొల్పుటకే యని
నే నూహించుచున్నాను. గ్రంథాలయోద్యమము ముఖ్యముగ విద్యా
విషయికమైనది గనుక దానిని మనము చేపట్టి భారత జాత్యభ్యు
చ్ఛ్రయముకొరకు ఈ యుద్యమము ఎంతవరకు సాధనభూతము కా
గలదో అంతవరకు అందుమూలమున మనము సంపూర్ణముగ లాభము
పొందవలసియున్నది. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు మూల
పురుషులగు మ. రా. శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారు ఈ
సభాధ్యక్షపదవి నధిష్ఠించవలసినదని నన్ను కోరినపుడు నేను ఆ కోరి
కను సంతోషముతో స్వీకరించితిని. ఈ యుద్యమముయొక్క ఆంత
రంగికమగు వ్యవహారములు నాకు తెలియవు గాని మహాత్ములు స్థాపిం
చిన జాతీయోద్యమముయొక్క జయము చాలవరకు ఈ యుద్యమ
మూలమున చేకూరెనని నే నెరుగుదును. ప్రతి గ్రంథాలయపు అధ్య
క్షుడును, కార్యదర్శియు గాంధి రాజ్యపు మునసబుగగాని, కరణముగ
గాని మారెను. ఈ రెండు సంవత్సరములలో ఆంధ్రదేశమందలి
చాల గ్రామములందు నేను సంచారము చేసియుంటిని. అపుడు ప్రతి
గ్రంథాలయమును ఈ మహదుద్యమమును ప్రజ్వలింపజేయు కార్య
క్షేత్రమయి ప్రాముఖ్యత వహించియుండెను. ఈ యుద్యమములో
కొంత నిజాయతీ లీనమైయున్నమాట నిజమేయైనను దీని మూలమున
దేశాభ్యుదయమునకు కల్గిన బలమునుబట్టి ఇందునుగూర్చి మనము
కృతజ్ఞులమయి యుండవలసియున్నది.

ప్రథమ అఖిలభారత గ్రంథాలయ సభ చెన్నపట్టణములో జరిగినపుడు గ్రంథాలయోద్యమము జాతీయ ప్రతిష్ఠాపనమేనా యను నంశమునుగూర్చి తీవ్రమగు చర్చ జరిగినది. అపుడు సభాధ్యక్షులగు కుడల్కారుగారు ఆయన పదవినిబట్టి ఆయనకు అదనముగా గల వోటు నిచ్చుటచే ఈ యుద్యమము విజాతీయమని నిర్ధారణ కాకుండ తప్పించిరి. అప్పటినుండియు నీ విషయమై పత్రికా ముఖమునగాని, సభలలోగాని, చర్చ జరుగలేదు. కడచిన పది సంవత్సరముల నుండియు ఉద్యమ చరిత్రను మనము పరిశీలించితిమేని ఇందు లీనమైన విజాతీయ స్వభావమును పోగొట్టుకొనుటకును. జాతీయ ప్రతిష్ఠాపనగా దీనిని నిర్మాణము చేయుటకును మన జాతీయాంతరాత్మ చేసిన కృషి మనకు బోధపడక మానదు. ఒక గ్రంథాలయము కుస్తీ పట్లు, కత్తి సాముకు ప్రాముఖ్యత నిచ్చుచున్నది. ఇంకొకటి గ్రంథ ప్రకటన కార్యము నవలంబించుచున్నది. కొన్ని గ్రంథాలయములు సంగీతము మొదలగు లలితకళల యభివృద్ధికొరకు కృషి చేయుచున్నవి. ఇంకొకటి స్వచ్ఛంద భటులను లేక రామదండును తయారు చేయుచున్నది. మరియొకటి వడుకునూలు ఉద్యమమును వ్యాప్తి నొందించుచున్నది. కొన్ని గ్రంథాలయములు సహకార సంఘముల నభివృద్ధి నొందించుచున్నవి. దీనియంతటి వలనను విజాతీయ భావములు దేశీయోద్యమములందు లీనమగుటచే స్వాభావికముగా తీవ్రమగు ఏవగింపు కల్గుననియు జాతీయాంతరాత్మయొక్క ఉత్తేజముచే అట్టి యుద్యమములు స్వాభావిక స్వరూపమును పొందుచున్నవనియు మనకు బోధపడక మానదు. నిజముగా ఐరోపా గ్రంథాలయములలో ఏదియు ఇట్టి పనులకు తలపెట్టదు.

గ్రంథాలయోద్యమమునందు లీనమైయున్న మొట్టమొదటి విజాతీయ భావము ఆ ప్రతిష్ఠాపనయందు ఉపదేష్టకు స్థానము లేకపోవుట. భారతీయ ప్రతిష్ఠాపనలలో ఏదియు మానవ ప్రకృతికి సహజమగు లక్షణములు లేనిది లేనేలేదు. ప్రతి గ్రంథాలయమును నడపు

కార్యదర్శియు, అధ్యక్షులును గ్రంథాలయమునకు వచ్చువారితో నన్యోన్య సంబంధము కల్పించుకొనువారు కారు. ముఖ్యముగా వారు పుస్తకములను సేకరింతురు. వానిని భద్రపరతురు. వర్గీకరణము చేయుదురు. ఈ వర్గీకరణము అకారాదిక్రమముగ పుస్తకముల నామములను బట్టిగాని, వాని గ్రంథకర్తల నామములను బట్టిగాని చేయబడును గాని చదువరుల మానస పరిణామమును బట్టిగాని, వారి అవసరములను బట్టిగాని జరుగుటలేదు. వారు చదువరులకు ఉపదేశము చేయువారమనిగాని లేక చదువుకొనుటయందు సహాయము చేయువారమనిగాని ఎప్పుడును చెప్పరు. ఈ గ్రంథాలయ సభ్యులు చాలవరకు యువకులుగానే యుందురుగాని వారి మానస వికాసమును, నైతికాభివృద్ధిని సరియైన మార్గముల నడుపుటకు ఒక సహాయకుడుండి తీరవలెను. గ్రంథాలయము నిర్జీవమైనదిగా నుండక సజీవమై మనుష్యత్వ వికాసమునకు సహాయము చేయునదిగా నుండవలెను. చదువరుల అధికారానుసరముగ వారలకు పుస్తకములు చదువనిచ్చిన గాని గ్రంథాలయము ఉపయోగకారి కానేరదు. చిరకాలానుగతముగ వచ్చుచున్న తత్వవేత్తలయొక్కయు, కళాభిజ్ఞుల యొక్కయు పరిజ్ఞానమును భద్రపఱచెడు ఊరగాయల జాడీలవంటివి గ్రంథాలయములని చెప్ప నొప్పును. గ్రంథాలయము సర్వజన సామాన్యము చేయవలయునను నుత్సాహముతో ఉత్తమాధమ గ్రంథములకు సమానముగ అందు స్థానమీయబడుచున్నది. ఇందువలన విచక్షణా జ్ఞానము లేని చదువరులకు ముప్పు వాటిల్లును. భారతీయ విద్యా మర్యాదలను పరికించుచో పఠనీయ గ్రంథముల నిర్ణయించుటయందు అధికారి భేదము బాగుగా పాటింపబడినట్లు బోధపడగలదు. రసాయన శాస్త్రజ్ఞుని రసశాలలో అజ్ఞాని ప్రవేశించి, అందలి వస్తువులను ఇచ్చవచ్చినట్లు స్పృశించినచో కల్గెడు ఫలితమేమో కొంచెము యోచింపుడు.

రెండవది జాతీయ భావము. గ్రంథాలయములయందు గ్రంథముల యెడల సవినయమగు భక్తి లేకుండుట. భారత జాతియొక్క

మర్యాదల ననుసరించి మనము ఏదైన పుస్తకము చదువుటకు ప్రారం
భించక పూర్వము సరస్వతి, గజానన మొదలగు దేవతా ప్రార్థన
శ్లోకములను చదువవలసి యున్నది. ఆధునిక విద్యార్థులకు ఇది నిరర్థ
కముగా తోచవచ్చును గాని అక్షర విన్యాసముచేతను, వానిని సుస్వ
రముగా నుచ్చరించుటచేతను ఎట్టి మహాశక్తు లుద్భవించుచున్న
దియు, ఆశక్తులు ఆత్మీయ శక్తియొక్క వికాసమున కెట్లు సాధన
భూతములగునదియు విచక్షణా బుద్ధితో విచారించిన రూఢమగును.
మంత్రముల ప్రభావమునుగూర్చి యిచ్చట ముచ్చటించుట అప్రస్తు
తము. పుస్తకములు కేవల విద్యా సాధనములుగనే గాక నాద నిక్షిప్త
పేటికలుగగూడ మనము పూజించవలెను. గ్రంథ పఠనము పాఠకుని
యొక్క అధికారమునుబట్టి అనేక రూపములు తాల్చవచ్చును. ఒకరు
కాసి పత్రికలో విమర్శను ప్రచురించుటకు చదువవచ్చును. ఇంకొ
కరు రాజ్యాంగ పక్షమున గ్రంథమును బహిష్కరించు నుద్దేశముతో
చదువవచ్చును. మరియొకరు తన పాండితీ గరిమను తన విద్యార్థుల
యెదుట ప్రగల్భములు కొట్టుకొనుటకు చదువవచ్చును. వేరొకరు
కునికిపాటులు వచ్చుచున్న/కాలమున ఎట్లో కాలము గడుపుటకై
చదువవచ్చును. మనము మన గ్రంథాలయము లందలి పుస్తకములను
సద్వినియోగము చేయ నుద్దేశముతో చదువవలెనని గదా మన యా
శయము. దానినుండి చదువరి సంపూర్ణ జ్ఞానము పొందవలయును.
అందలి వర్ణ సమామ్నాయోచ్చారణము వలనను, దానియందు
నిరూపణము చేయబడిన తత్త్వానుభవము వలనను కల్గెడి సంపూర్ణ
లాభమును పొంది చదువరి అభ్యుచ్ఛ్రయము పొందవలసియున్నది.
వర్ణములును, వాని యుచ్చారణయు "మహేశ్వర సూత్రములు"
అవి సర్వేశ్వరుని అలంకారమగు వర్ణమాల. బ్రహ్మ వర్ణముల నుం
డియే ప్రపంచము సృష్టిజేసెను. అవి ప్రకృతి బీజములు. మరియు అవి
ప్రపంచ పరిణామముయొక్క ప్రత్యక్ష స్వరూపము. నాదము పురు

షునియొక్క ప్రథమ స్వరూపము. అది మానవుని అంత్య స్వరూపముకూడ నగుచున్నది. తక్కిన కళలు తర్వాత ఉత్పన్నమగును.

మనము విను ధ్వనికంటె నాదము ఎక్కువ సున్నితమైనది. మనకు అనుభూతమగు దానికంటె దానియం దెక్కువ అర్థము లీనమైయున్నది. ఏక వస్తువు వివిధ శబ్దవాచ్యమై వివిధ స్థలములయందు వివిధ మానవులచే నుచ్చరింపబడుచున్నది. ఉదాహరణకు దహింపచేయు వస్తువు నొకదానిని తీసుకొందము. ఒకరు దీనిని ఫైరు అందురు. మరియొకరు అగ్ని అని పిలుతురు. ఇంకొకరు నిప్పు అందురు. వస్తువు ఒకటే, వేరువేరు మనుష్యులు దీనిపేరును, వేరువేరుగా ఎందుకు వ్యవహరించవలెను? ఫాలు ఫైరు అను శబ్దము వినినతోడనే మనకు కొన్ని యూహాలు కలుగుచున్నవి. అగ్ని యనుమాట వినినతోడనే మరియొక విధమగు నూహాలు కలుగుచున్నవి. ఈ రెండు మాటలు రెండు భాషలలోనివి. ఈ రెండుమాటల ఉచ్చారణవలన కల్గెడి మనోభావములు వేరుగా నున్నవి. అవి వ్యక్తితో సంబంధము గలవి. మనము మన ఇష్టదేవతలనే యారాధింతుము. పరిస్థితితో కూడినపుడుగాని వ్యక్తిత్వమునకు సంపూర్ణ వికాసము చేకూరదు. ఈ అనంతమగు బ్రహ్మాండమందు అనేకమగు అంతరములుగల పరిస్థితులుంశి యున్నవి. ప్రతి వ్యక్తియు తన కనురూపమగు పరిస్థితి నాశ్రయించుచున్నాడు. గ్రంథాలయమున చదువరులందరకు సమానమగు సావకాశములు కల్గచేయుట యుక్తమేగాని ఈ సావకాశములను సద్వినియోగము చేసికొనుటకు తగిన సహాయము లేనిచో అందువలన అనర్థకములు కలుగును.

కావున ఉచిత గ్రంథములను చదువరి ఏరుకొనుట ముఖ్యావసరము. తాత్కాలిక ఉద్రేకముచేతను, అసంస్కృత వాంఛ చేతను పఠనీయ గ్రంథమును నిర్ణయించుకొనినచో దారి యెప్పుడును తప్పుగానే పోవును. చదువరియొక్క అధికారమును నిర్ణయించి తదనుగుణమగు గ్రంథమును పఠింపచేయుటకు తగిన గురువు గ్రంథాలయ

ము నందుండి తీరవలయును. చదువరియొక్క యిష్టదేవత ప్రళయ కాలాగ్ని రుద్రుడై యుండి ప్రళయకాలమందు భీభత్సరసముతో నాట్యము చేయు నటరాజుయొక్క పద విన్యాసము ఆవ్యక్తి యొక్క కార్యములను ప్రేరణచేయవలసినపుడు తగిన గ్రంథమును చదువరికి మనము నిర్ణయించనిచో సంతత సమరోన్ముఖుడగు పరశురాముని బుద్ధునిగా మార్చుటకు ప్రయత్నము చేయుటయగును. ఇట్టి విపరీతములు చదువరికి అనుకూలమగు గ్రంథము లభ్యము కానప్పుడు ఏర్పడును. గ్రంథస్థ పదములను, పదములందలి వర్ణములను, పదమునుండి వాక్యములను కూర్చినప్పుడు వాని యన్నిటియందు గ్రంథకర్త మాతృవాత్సల్యము కలిగియుండును. గ్రంథమును ప్రీతితో పఠనము కొఱకు స్వీకరించుట యనగా దానిని పూజించుటయే. తల్లి తన శిశువును ఇతరులకు ముద్దాడ నందించునపుడు శిశువును అధమము ఆ ఇతరుడు ఆశీర్వదించవలయునని యైనను తల్లి తలంచును. నీ పిల్లల యందు నీకు ఎంత ప్రేమయో ఇతరులుకూడ తమ పిల్లలను అట్టి ప్రేమతో చూడవలయునని కోరుదురుగదా! నీ పిల్లలుచేయు తప్పులను నీవు ఖండించుదువు గాక! నీ పిల్లవాని అలవాట్లు మంచివి కావని నీకు సంకోచముండునుగాక! అయినను నీ పిల్లయెడ నీవు సంపూర్ణ మానవ స్వభావముతోనే ప్రవర్తించెదవు. మన జీవితాభ్యుదయమునకు సాధనభూతముగా నుండుదానినే మనము స్వీకరింతుము. మనము స్వీకరించినదానియందు మనకు భక్తియుండి తీరును. ఇట్టి భక్తిభావము శూన్యముగానున్న పుస్తకాగారమును భారత జాతీయ ప్రతిష్ఠాపనగా పరిగణించుటకు వీలులేదు.

ధారావాహికముగా వచ్చుచున్న జాతీయ జీవనమునకు అనుగుణ్యమగునట్లు అధునాతన పరిస్థితులను మార్చుటలో గ్రంథాలయమునందు దేవాలయమునందువలె పూజ్యభావము నెలకొల్పబడును. సంపూర్ణముగ పాశ్చాత్య ప్రతిష్ఠాపనయగు ఈ గ్రంథాలయమునకు అనుగుణ్యమగు బాహ్యరూపమును పొందియు ప్రత్యక్ష విరుద్ధలక్షణ

ములతో కూడియున్న భారతీయ ప్రతిష్ఠాపన సిక్కుల గురుద్వార
మును, అందు పూజింపబడు గ్రంథ సాహెబును. ప్రపంచ మంతటి
యందు ప్రసిద్ధి వహించిన సంయమీంద్రుల గీతాంజలులయొక్క
సమూహమే గ్రంథసాహెబు అగుచున్నది. అధునాతన గ్రంథాలయ
మున కొరత పడియున్న భక్తి పరిపూర్ణులగు చదువరులు ఏకలక్ష్యము
నందు మనస్సులను లగ్నముచేసిన శ్రావకులు. గురువును, శిష్యు
లును, వైద్యుడును, రోగులును వీరందరి ఏకత్ర సమావేశమే ఈ
ఉన్నతమగు భారతీయ ప్రతిష్ఠాపనమునందలి ప్రాముఖ్య లక్షణములు.

గ్రంథాలయములయందు ఎట్టి గ్రంథము లుండవలెనో విచ
క్షణ లేకపోవుట ఈ ప్రతిష్ఠాపన యందలి మూడవ విజాతీయ లక్ష
ణము. ప్రచురింపబడిన ప్రతి గ్రంథమును ప్రతి మనుజునికిని అవస
రము లేదు. కొన్ని ప్రత్యక్షములుగా హానికరములు. కొన్ని ఆ
గ్రంథకర్తలకే ఉపయోగకరములైనవి. కొన్ని తాత్కాలికముగా
ఉపయుక్తములైనవి. కొన్ని గ్రంథములే శాశ్వతముగా భద్రపరచ
తగినవి. గ్రంథాలయమును సృష్టి వైచిత్ర్యములతో నిండిన బ్రహ్మాం
డముతో పోల్చిచూచినచో చవిటిపఱ్ఱలు, ఎడారులు, ఊతిభూములు,
బురదమడుగులకు పోల్చతగిన కొన్ని గద్య కావ్యములును, సర్వ
పుష్పఫలశోభితమగు వనాంతరములు, నేత్రపర్వము నొనర్చు రమణీ
యములగు ఉద్యానవనములు, నైలు, గంగా మొదలగు మహా నదు
లతో పోల్చదగు పద్యకావ్యములును ఇందున్నవి. ఇవియన్నియు
మనుజుని దైనందిన జీవితయాత్రకు అవసరమైనవి కావు. అయితే
ఇందులో లేనివి మాత్రము గ్రంథాలయమందు గృహస్థుని యింటి
యందును, గ్రామమందును, గ్రంథాలయమందును భద్రపఱచ తగి
నవి. బొమ్మజెముడును ఉద్యానవనమందు పెంచవలెనని ఏ మను
ష్యుడును వాంఛించడు. కాని ఓషధీ వనములో వైద్యుడు దానిని
పెంచి తీరవలెను. మనుజుడు కుక్కను, ఆవును తన యింట పెంచును
గాని సింహమును, పెద్దపులిని పెంచడు. వీనిని వివిధ జంతు ప్రదర్శన

శాలయందు జంతు శాస్త్రజ్ఞుడు పెంచును. ఓషధీ వనమును, జంతు
ప్రదర్శనశాలయుకూడ సంపూర్ణముగ ప్రయోజనకరములని చెప్పు
టకు వలనుపడదు. పెద్దపులియొక్కయు, సింహముయొక్కయు సం
పూర్ణ స్వభావము స్వాభావిక స్థితిలో వనమున వేటాడునపుడు వ్యక్త
మగునుగాని బందీకృతముగా బోనులో నుంచినపుడు కాజాలదు.
నూతనముగా అభివృద్ధిని గాంచుచున్న జంతు శాస్త్రజ్ఞులకు ఈ ప్రద
ర్శనశాలల వలన కొంత ప్రయోజన ముండవచ్చును. అది ఉత్తమ
ప్రయోజనము కానేరదు. సనాతనమగు ధర్మమును బోధించు గ్రంథ
ములే గ్రంథాలయమునం దుండతగినవి. అచ్చు పడినంత మాత్ర
మున గ్రంథాలయమున గ్రంథమునకు స్థానముండరాదు. ముద్రణ
యంత్రమును ప్రజాస్వామిక తత్వముయొక్క అపభ్రంశ భావమును
ప్రతి గ్రంథమునకును గ్రంథాలయమున స్థానమిచ్చుటకు కారణ
ములు. గ్రంథ ప్రకాశకులుకూడ ప్రతి గ్రంథమును ప్రకటించరాదు.
నిజమగుగ్రంథాలయమందు వేదములు, ఖురాను, బైబిలు, తత్వ
శాస్త్రగ్రంథములు, ప్రకృతిశాస్త్ర గ్రంథములు, విజ్ఞాన సర్వస్వ
ములు మొదలగు సద్గ్రంథములు మాత్రమే యుండతగినవి. వివిధ
వస్తు ప్రదర్శనశాలలు భారతీయ జాతి జీవనమునకు ఆనుగుణ్యమైనవి
కావు. అవి మనుజుని లలితకళా సౌభాగ్యమునకు శ్మశాన వాటికలు
వంటివి. అచట భస్మము, బొమికలు మాత్రము భద్రపరచబడును.
ఇవి యన్నియు చరిత్ర కాధారమని చెప్పెదరు. పితృవర్గముయొక్క
సుగుణ పుంజమును విశదీకరించుటకు ఈ కాలపు చరిత్రలు ఎంత
వరకు ఉపకరించుచున్నవి. దేవాలయమును, మసీదును, జీర్ణోద్ధారణ
చేసినచో పితృవర్గము నెడల మనకుండు భక్తిని ఎక్కువ బాగుగా
తెలుపుడు చేయదా? స్వాతంత్ర్య భావమే ఇప్పుడు ప్రపంచము
నంతను ఊగులాడించుచున్నది. ఈ తత్వముయొక్క సరియైన వ్యాప్తి
సామాన్య జనులకు సంపూర్ణముగా వ్యక్తమగుటలేదు. అధునాతన
మనుజునకు నమ్రతలేదు. కృతజ్ఞత లేదు. చరిత్రయున అతనికి ఎక్కువ

సరదా. అదియే అతనికి తెలుసును. వైచిత్ర్యముచే మనోహరమగు జీవిత తత్వము అతనికి సామాన్యముగ బోధపడదు. కాల ప్రవాహమున అతడు పడి కొట్టుకొని పోవుచున్నాడు. ఆధునిక గ్రంథ భాండాగారికుడు గ్రంథ విభజన పట్టికలను వ్రాసినట్లుగానే ఆధునిక మనుజుడు సమాధులమీద మృత మనుజుని సంక్షిప్త చరిత్రనుమాత్రము వ్రాయగలడు. నిజమైన రసస్ఫూర్తిగల ఏ వ్యక్తియు వివిధ వస్తు ప్రదర్శన శాలనుచూచి ఆనందము పొందనేరదు. గ్రంథాలయము వివిధ వస్తు ప్రదర్శనశాల కా గూడదు. కుంఠీభావమును పొందిన మనుజుని మనోవికారమునకు ఫలితమగు నుత్పన్నమగు అధమ గ్రంథములకు గ్రంథాలయమున స్థాన ముండరాదు. సార్థకమగు గ్రంథాలయ మందలి గ్రంథములు మనుజుని మానసిక నైతిక జీవితము నుత్తేజము చేయునవిగా నుండవలెను.

ఇంక గ్రంథాలయముల వలన సంఘమునకు కల్గెడి లాభములనుగూర్చి వివరించెదను. ఈ ఉద్యమ ప్రచారకులు ప్రతి గ్రామమందును ఒక గ్రంథాలయమును స్థాపించవలయునని వాంఛించుచున్నారు. అట్లు చేసినచో మనుజుని జీవితమును సర్వతోముఖముగ వికసింపచేయ గల్గును. మనుజుని సాంఘిక, నైతిక మానసికతత్వముల యభివృద్ధికొఱకు దొరతనమువారి తటస్థ భావకారణమున మన దేశమున తగిన సాధనములు లేకయున్నవి. ఈ విధులను పూర్వపు రాజులు నిర్వర్తించుచుండిరి. ఇపుడు ఫ్రాంసు దేశమున లలితకళల యభివృద్ధికొఱకు రాజ్యాంగమున ప్రత్యేక శాఖకలదు. ఇట్లే పాశ్చాత్య దేశములం దన్నిటి యందునుకూడ కలదు. సాంఘికాభివృద్ధి కొరకు అచ్చటి ప్రభుత్వములు విశ్వ ప్రయత్నములు చేయుచున్నవి. మన దేశమునమాత్రమే ప్రభుత్వమువారు ఈ యన్ని విషయముల యందును మూకీభావమును పొందియున్నారు. ఆంధ్ర గ్రంథాలయ సంఘమువారు ప్రతి గ్రామమందును ఈ జవాబుదారీ వహించవలెనని నా యాశయము. రాజకీయ విషయములయందు కృషి చేయు

టకు ప్రతిగ్రామమందును కాంగ్రెసు సభయుండును గాన తక్కిన అన్ని విధములగు మనుజుని యభివృద్ధులగూర్చియు పాటుపడుటకు తగినట్లు గ్రంథాలయములుండవలెను. అట్లయినచో గ్రంథాలయములు, జీర్ణమై పోయిన చిత్తరువులును మనకు తిరిగి సంగ్రహామగును. ప్రాచీన పండితుల వైదుష్య లాభము దేశము పొందగలదు. జాతివర్ణ వివక్షణ లేకుండ "సర్వేజనాః సుఖినోభవంతు" అను న్యాయానుసారమున బీదజనులకు అన్నదానము అచట చేయవలెను. అనాథులకు అచ్చట శరణ్యము చేకూరవలెను. బీదలకు అన్నదానము అందరకును ఆచరణీయమే. ఈ పని వెంటనే పూనుకొనవలసినదై యున్నది. అనాథలను, జాడ్యగ్రస్తులను సంరక్షణ చేయుట అవశ్యాచరణీయము. ఈ విధినికూడ గ్రంథాలయములు నిర్వర్తించవలసియున్నది. గ్రంథాలయ నిర్వహణములో ముఖ్యముగ గమనించవలసిన విషయమొకటి యున్నది. ఈ ప్రతిష్ఠాపనలు సర్వజన సమాదరణీయములుగా నుండవలెను. తగాదాలను పెంచు విషయములో గ్రంథాలయా లెన్నడును దిగకూడదు. భారత జాతియొక్క పరమ లక్ష్యమును, జీవిత పరమావధియు, ఈశ్వర సృష్టియందలి ఐక్యభావమును అనుభవములోనికి తెచ్చుటకు గ్రంథాలయములు నిరంతరము కృషి చేయుచుండవలెను. గ్రంథాలయ భవనమందైనను అచ్చట సమావేశమగు స్వల్పకాలము వరకైనను అన్యోన్యసౌజన్యము కలిగియుండునట్లు మనము పరిస్థితుల నేర్పరుచుకోవలెను. జగన్నాథస్వామి దేవాలయమందు జాతి విచక్షణ లేక అందరకు ఎట్లు ప్రవేశమున్నదో గ్రంథాలయమందుకూడ నట్లే జాతి మత విచక్షణలేకుండ ప్రవేశముండవలయును. స్వరాజ్య సౌధ నిర్మాణమునకు ఈ గ్రంథాలయములు ప్రథమ పునాదులుగా నుండును.

మనము ఇక జాగుచేయకూడదు. మన భావిభాగ్యము త్రాసులో ఊగులాడుచున్నది. పాశ్చాత్యదేశమున నుద్భవించినదను

కారణమున గ్రంథాలయమునుగాని, మరియే యితర ప్రతిష్ఠాపనను గాని మనము త్యజించగూడదు. భ్రమర కీట న్యాయానుసారముగా ఏ ప్రతిష్ఠాపననైనను మన జాతీయజీవనమున కనుగుణ్యామగునట్లు మనము చేసుకొనవలసియున్నది.

గ్రంథాలయోద్యమముయొక్క పూర్వ వృత్తాంతమునుగూర్చి నేను ఖండించను. నిశ్చిత లక్ష్యము ననుసరించకుండ పలు త్రోవలు త్రొక్కుచు ఈ యుద్యమము ఇదివరలో కృషి చేసియున్నది. కొన్ని సత్కార్యములుకూడ ఈ యుద్యమ పక్షమున జరిగినవి. గుంటూరు మండల గ్రంథాలయ సంఘమువారు ప్రచురించిన కరపత్రములు నిరర్థకములైనవి. ఈ యుద్యమము నిర్ణీత ప్రాప్యముకలదయి దేశాభ్యుదయముకొఱకు కృషిచేయు ఇతరోద్యమములతో ఉచితమగు సంబంధములు కలదిగా నుండవలెను. విస్పష్టమగు కార్యప్రణాళికను నిర్ణయించుకొనవలసినదని మిమ్ములను కోరుచున్నాను.

—గ్రంథాలయ సర్వస్వము - ఆఱవ సంపుటము - ఎనిమిదవ సంచికనుండి.

# తొమ్మిదవ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ, బందరు

[ 1925 అక్టోబరు 23 ]

## శ్రీ గద్దే రంగయ్యనాయుడు

భాష, పూర్వస్థితి, నాటి గ్రంథ పరిచయము

ప్రపంచమున జీవజంతువులు పుట్టుటతోనే భాషింప గలిగినవి. అవి భాషించు ధ్వనులే భాష యనబడుచున్నది. అందు పశు, పక్షి, మృగాది జంతువులు భాషించుభాష అర్థము లేనిది, అవ్యక్తమైనది యును, మానవజాతి మాట్లాడునది అర్థముగలదియు వ్యక్తమైనది యును. యుక్తాయుక్త వివేచన పాపపుణ్యజ్ఞానము గల మానవజాతికి సాంఘిక నైతిక రాజకీయారోగ్య మతవిషయక పారిశ్రామిక వ్యవసాయ వాణిజ్యాది వ్యవస్థాజ్ఞానమును గూర్చిన బోధన మావశ్యకమైనది. అప్పు డన్ని విషయముల పైనను విజ్ఞాన రచన సంరక్షణములు ప్రపంచ మంతటను ఆవశ్యకములైనవి. మన భారతదేశమున అప్పటి దైవభక్తిగల మానవశ్రేష్ఠులు కొందరుమానవులు మాట్లాడుభాషలో మానవజీవితమున కావశ్యకమయిన పై సకల విషయము లిముడునట్లు తా మార్జించిన విజ్ఞానమును మంత్రసూత్ర రూపముగ బాడి సక్రమముగ కంఠస్థము చేసికొని ఇతరులకును ముఖస్థము చేయించుచు దీర్ఘ కాలము సంరక్షించుచుండిరి. పిమ్మట ఆ మంత్రసూత్రముల నన్నిటిని సంగ్రహించి నాలుగు విభాగములుగ విభజించి రాగి వెండి రేకులపైనను, తాళభూర్జ పత్రములపైనను, బట్టలపైనను, కొయ్యపలకలపైనను లిపి నిర్మాణముచే వ్రాసి కాపాడుచుండిరి. వీరీ విజ్ఞానరచనకువాడిన లిపియే బ్రాహ్మీ లిపినుండి పుట్టిన దేవనాగరలిపి. ఆ నాలుగు విభాగములే చతుర్వేదములని ఇప్పటికిని బిలువబడుచున్నవి. వేదవిదులగు విద్వాంసులు ఆవేదములనుండియే విషయ సంగ్రహణము గావించి మానవ జీవితావశ్యకములైన సర్వవిషయములపైనను ప్రత్యేకశాస్త్రములు రచించి విజ్ఞానాభివృద్ధికి బహుభంగుల దోడ్పడిరి.

కాలక్రమేణ నా విజ్ఞానము మహర్షులు, రాజులు, ధనవంతులు,

మతగురువులు, పౌరాణికులు, కవులు మున్నగు పురుషపుంగవుల ఆదరణాభిమానములకు పాత్రమై బ్రహ్మసూత్ర పురాణేతిహాస కావ్య నాటకాలంకార నవలాది బహుగ్రంథ రూపమును బొంది మానవకోటికి అమితోపకారమును జేయుచు నెచ్చట నెనలేని వాఙ్మయవాణియై విరాజిల్లుచుండెను. బౌద్ధుల కాలముననుు, తదనంతరము శంకరాది మతగురువుల కాలముననుు, విక్రమార్క శ్రీహర్ష భోజరాజాదుల కాలముననుు నా వాఙ్మయము సర్వతోముఖముల నభివృద్ధినొంది భారతీయ విజ్ఞానోత్కృష్టతను బరదేశములకుగూడ వ్యాపింప జేసినది. ఇంతటి వాఙ్మయాభివృద్ధికి మూలమైన భాషకే గీర్వాణభాషయనియు వేద కాలమునుండి క్రమక్రమముగ సంస్కరింపబడుచు వచ్చుటచే సంస్కృత భాష యనియు పేరు.

అట్టి యీ భాషావాఙ్మయ మంతయు అనేకముగ భూర్జ శ్రీ తాళపత్రములపైనను, దక్షిణభారతమున తాళపత్రములపైనను లిఖింపబడుచుండెను. దాన శాసనములు మాత్రము వెండి రాగి రేకులపై చెక్కబడుచుండెను. తాత్కాలికముగ వ్రాసి చెరుపు విషయములు కొయ్యపలకలపై వ్రాయబడుచుండెను. విద్వాంసులును, రాజులును, భాషాభిమానులగు ధనవంతులును, దేశమునందే భాగమునందు ఏ గ్రంథము రచింపబడియున్నను వ్యయప్రయాసలకోర్చి పరిశోధింపజేసి స్వయముగ వ్రాసి వ్రాయించి గ్రంథ సంచయమును చేర్చి స్వగృహములయందును, దేవాలయములయందును, రచ్చకూటముల యందును నెలకొల్పి సంరక్షింపుచు విద్యావ్యాప్తికై మిక్కిలి కృషిసల్పుచుండెడివారు. ఇందుకు నిదర్శనము నలందా విశ్వవిద్యాలయమునందలి గ్రంథభాండ చరిత్రమును పూర్వము మహమ్మదీయులు మతద్వేషముచే గాల్పగా నెన్నియో అహోరాత్రములు మండుచుండినట్లు చెప్పబడు కాశీ వ్యాస పీఠ గ్రంథభాండ విషయములే చాలును.

వేదకాలము నాడెట్టి వేదములు లేకుండవచ్చునేమో కాని క్రమక్రమముగ పురాణసూత్రకాలములనాటికి గొన్ని జాతులకు మా

త్రము వేదాది మతగ్రంథాధ్యయనము నిషేధింపబడినను తక్కిన విద్యల నన్నిటికిని సకలజాతు లెట్టి నిర్బంధములు లేకయే అభ్యసించు చుండి రనుటకు బెక్కు నిదర్శనములు కలవు.

లిపి నిర్మాణము

జ్ఞానము మానవ జీవమును వికసింపజేయును. కీర్తి గడింప జేయును. నాగరకతలు గలిగించును. నడవడిని దిద్దును. "జ్ఞానేన హీనః పశుః" జ్ఞానము లేనివాడు పశుసమానుడని పెద్దలు చెప్పు దురు. కనుక జ్ఞానసంపాదనమునకై సర్వమానవులు ప్రయత్నింప వల యును. మన పూర్వులు జ్ఞానము సంపాదించుటకును దానిని సంరక్షిం చుటకును సల్పిన ప్రయత్నములు వర్ణనాతీతములు. విశేష జ్ఞానము విజ్ఞానమనబడును. పూర్వ మహర్షులు తపోమహిమచే దాము కనిపె ట్టిన విజ్ఞానమును మానవ జీవితావశ్యకములైన సకల విషయ బోధక ములగు వేదరూపమున ఒక్క స్వరవ్యత్యయమైన గలుగకుండ ఎట్టి లిపి సాహాయ్యములేకయే ఆరువేల సంవత్సరముల కాలము నిశ్చల ముగ సంరక్షించిరి. వారి శక్తి నిరుపమానము. ఇట్టి అద్భుత శక్తి మఱి యే యన్యదేశీయుల యందైన గని విని యుంటిమా! అనన్య సాధ్యమగు నీ విజ్ఞానమును మానవులయందు సర్వతోముఖముగ వ్యాపింపజేయు లిపిసాధన నిర్మాణము కొఱకు ఆ మహనీయులు సల్పిన కృషియును విస్మయజనకము. ఆ లిపిభేదములును ఏ యే లిపినుండి ఏయే లిపి బుట్టినదియును లిపిశాస్త్రజ్ఞులు నిరూపింప దగియున్నది.

అయినను నాకు దోచినంతవఱకు గొంత చెప్పెద. బ్రాహ్మీ లిపి మాతృకగ గైకొని నాగరిలిపిని నిర్మించి తన్మూలమున నా మహ నీయులట్లు కాపాడియుంచిన విజ్ఞానమును భూర్జశ్రీతాళ తాళపత్రాదుల పై లభింపజేసి దేశమున వ్యాపింపజేసిరి. ఇప్పటికిని గీర్వాణభాష ఎన్ని సంస్కారములను, బరిణామములను బొందినను దానికి నాగరి లిపియే వర్ణమాలగ నున్నది. సంస్కృతమునుండి పుట్టి నాగరిలిపియే వర్ణమాలగ గలిగి కొంతకాలము విజ్ఞానవ్యాప్తికి గారణముగ నుండిన

ప్రాకృతభాష ఇప్పుడు వాడుకయందు లేదు. దేశమున భిన్న భిన్న దేశభాషలు ప్రబలి వానియందు విజ్ఞానము వ్యాపింపజేయవలసి వచ్చి నపుడు నాగరిలిపియే మాతృకగ అనేక దేశభాషాలిపులు నిర్మింప బడినవి. అందు హిందీ మహారాష్ట్రిభాషలకు దేవ నాగరిలిపియే నిజ స్వరూపముతో వర్ణమాలగ వాడబడుచున్నది. వంగ, పాంచాల ఘూర్జరాది ఉత్తర హిందూస్థానపు ఇతర దేశభాషలకును నాగర లిపియే వర్ణాకారములయందు గొన్ని మార్పులతో వాడబడు చున్నది.

దక్షిణ హిందూస్థానమునందలి ఆంధ్ర కర్ణాట ద్రవిడ కేరళ భాషలకై నిర్మింపబడిన లిపులు మాత్రము రూపములయందు నాగరి లిపిని పోలవు. కాని వర్ణధ్వనులయందు మాత్రము చాల భాగము నాగరిలిపి వర్ణములతో బోలుచునే యున్నవి. అరవము భాషాశబ్ద సందర్భమున సంస్కృత సంబంధమున కెట్లు దూరమగుచున్నదో అట్లే లిపి నిర్మాణ ధ్వనులయందును మిక్కిలి దవ్వుననే నిలుచు చున్నది. ఈ భాషాలిపియందు వర్ణములు చాల తక్కువ. అందుచే నొక్క యక్షరము పెక్కుధ్వనుల గల్పింపవలసి వచ్చుచున్నది. దీని విమర్శనము మన కిచ్చట అప్రస్తుతము. అందుకు బూనిన పక్షమున ప్రత్యేక వ్యాసమొండు వ్రాసిననే కాని తృప్తి గలుగదు. కర్నాట కేరళ లిపులు పోలికయందు నాగరిలిపితో భేదించుచున్నను భాషలు మాత్రము సంస్కృతపద భూయిష్ఠముగ నున్నవి. ఆంధ్రభాషయందు వలెనే ఈ భాషలయందును సంస్కృతపదములు తత్సమ తద్భవరూప ములతో వాడబడుచున్నవి.

మన యాంధ్రదేశమున అచ్చతెనుగు భాషయొకటి యున్నను అది గ్రంథస్థముగ నున్నదే కాని ఎచ్చటను ప్రజలవాడుకలో విరుద్ధ ముగ లేదు. చదువు తెలియని పామరజనులలో నైన ఏ ప్రాంతముల యందును సంస్కృతపద మిశ్రమము లేని అచ్చ తెనుగుభాష నప్పట ముగ మాట్లాడువారు అఋదు. ఆంధ్రలిపి బ్రాహ్మిలిపినుండియే

పుట్టి క్రమముగ బరిణామ వికాసముల గాంచినది. అశోక గుహా వేంగీ పూర్వచాళుక్య లిపులు ఒకదానినుండి మఱియొకటి బుట్టుచు ప్రస్తుత మన యాంధ్రలిపి స్థితికి కారణములైనవి. పూర్వ చాళుక్య లిపినుండి మన తెనుగులిపి పుట్టి వికసించినది. దీనిని నిరూపించుటకు బూర్వచాళుక్య లిపియందు జెక్కబడియున్న 622 వ సంవత్సరపు విష్ణువర్ధనుని శాసనమును, 976 వ సంవత్సరమున రాజరాజనరేంద్రుని పక్షమున నారాయణభట్టునకు నన్నయభట్టారకునిచే లిఖింపబడి సమర్పింపబడిన నందమూరి దానశాసనమును జాలియుండును. ఆంధ్రగ్రంథములలో బ్రథమమును, అత్యుత్తమము ననబడుచున్న మహాభారతము నన్నయభట్టుచే 10వ శతాబ్దిని చాళుక్యలిపియందే వ్రాయబడినట్లు తెలియవచ్చుచున్నది. పై శాసనములలోని లిపి పోలికలను బట్టి చూచిన దెనుగులిపి పరిణామ సంస్కారముల బొందిన పూర్వ చాళుక్య లిపియే యని స్పష్టమగుచున్నది. తిక్కన సోమయాజి భారత రచన కాలమగు 13వ శతాబ్దము వరకును చాళుక్యలిపియే నిజస్వరూపముతో ఆంధ్ర గ్రంథలేఖనమునకు దోడ్పడుచుండి యుండును. సోమయాజిగారు తమ భారతమును సైతము మా లిపియందే లిఖించియుందురు.

భాషాభివృద్ధికై పెక్కు విధముల గృషిసల్పి అసమాన భాషా సేవచే నాంధ్రభోజు డను కీర్తిగాంచిన శ్రీ కృష్ణదేవరాయల కాలము నాటికి ఆంధ్రలిపి చక్కని స్వరూప ప్రచారములను బొంది మన ప్రస్తుతలిపి స్థిరపడినది. 16వ శతాబ్దమున ఆంగ్లేయులు మన దేశమున బ్రవేశించిన పిమ్మట క్రైస్తవమత బోధకులు మత ప్రచారము చేయుచు అప్పుడు వాడుకయందున్న అక్షర స్వరూపములను గైకొని సీసాక్షరముల నిర్మించిరి. అపుడు హిందూస్థానము నందలి సకల దేశ భాషావర్ణములును సీసాక్షరములచే స్థిరరూపమును దాల్చినవి. సీసాక్షర నిర్మాణమువలన అక్షరరూపములు స్థిరపడుటయేగాక పునః పరిణామములకు అవకాశము కలుగలేదు. లేఖనాది వ్యయప్రయాసము

లును దగ్గి అనాయాసముగ గ్రంథ ప్రకటనమునకు దోడ్పడుచున్నది. అశోకుడు మొదలు కృష్ణదేవరాయల కాలము వఱకు గల తామ్ర శిలా శాసనములయందు అక్షర స్వరూపముల బరిశీలించిన పక్షమున దెనుగు వర్ణము లేవిధముగ గలిగినదియు దెలిసికొనవచ్చును. ప్రాచీన దేశ వాఙ్మయ చరిత్రములను దెలిసికొన గోరువారు పురాతన దేవాలయములలోని శిలలపైనను, రాగిరేకులపైనను జెక్కబడియున్న శాసన పరిశీలనము కావించినయెడల ఎన్నియో రహస్య విషయములను గనిపెట్టవచ్చును.

వ ర్ణ మా ల

అరవము, ఇంగ్లీషు, ఉరుదూ భాషలయందు వలె ఆంధ్ర భాషయందు అక్షరలోపము లేదు. ఒక్కొక్క ధ్వనికి ఒక్కొక్క యక్షరము నిర్మింపబడియున్నది. అరవభాషయందువలె వివిధ ధ్వనుల నొక్క యక్షరమే భాషింపవలసిన తొందరయును లేదు. గీర్వాణ భాషాక్షరము లెట్లు లోకములోని సకల భాషలను నొక ధ్వనిమాత్ర భేదమైన లేకుండ వ్రాయ సమర్థమగుచున్నవో ఆంధ్రాక్షరములును అట్లే సమర్థములగుచున్నవి. ఏలయన యీ వర్ణమాలా నిర్మాతలు అప్పటి భాషావైఖరి ననుసరించి సంస్కృత వర్ణధ్వనులనే యీ వర్ణములకును గల్పించిరి. వర్ణముల సంఖ్యయును సంస్కృత వర్ణసంఖ్యతో సమముగ నున్నది. అచ్చతెనుగు శబ్దముల భాషారచనయందు జేర్చుటకొఱకు మాత్రము కొన్ని వర్ణము లధికముగ నిర్మింపబడినవి. అందువలన ఆంధ్రభాషను సామాన్యముగ జదువను వ్రాయను నేర్చిన వారైనను అర్థముగాని కఠిన గ్రంథములను సైతము సులభముగ జదువగలరు.

గ్రంథముల ప్రయోజనము, వాని రచన

శ్లో॥ "కావ్యశాస్త్ర వినోదేన కాలోగచ్ఛతి ధీమతాం
వ్యసనేనచ మూర్ఖాణాం నిద్రయా కలహేనవా".

అని బండితులు చెప్పునట్లు సద్బుద్ధిగల చదువుకొన్న ప్రతి మానవునకును గ్రంథపఠనముచే గాలము దుర్వ్యసనముల చెంత

బోసీక సుఖముగ గడుచుచుండును. చదువుకొన్నవారే యననేల చదువురాని సత్ప్రవర్తనముగల మానవులెందరో గ్రంథశ్రవణమున దమ కాలమును సుఖతరముగ గడుపుటను జూచుచున్నారము. ఒక పల్లెటూరియం దొక్కడు చదివినమనుజు డున్నయెడల నాతనిచే గ్రంథములు చదివించి పలువురు చదువురానివారు విషయములను గ్రహించి యానందించుచున్నారు. నీతి మతబోధకము లగునట్టియు, మహాపురుషుల జీవితముల దెలుపునట్టియు గ్రంథ పఠన శ్రవణాదుల వలన దుష్టులుకూడ శిష్టులగుచున్నారు. గ్రంథము సంసారికి గృహ కృత్యములపట్ల సద్గృహిణివంటిది. కార్యాలోచనపట్ల మిత్రరత్నము వంటిది. ప్రయాణకాలమున సంగాతుని వంటిది. దుఃఖసమయమున నోదార్చు బంధుమిత్రుల వంటిది. మత బోధనవిషయమున సద్గురువు వంటిది. నీతి నియమముల నిరూపించుటకు శ్రేయోభిలాషులగు తలి దండ్రుల వంటిది. ఆత్మానాత్మజ్ఞానము గలిగించుపట్ల రాజయోగి వంటిది. రాజకీయ శిక్షణముపట్ల ప్రజారంజకుడగు రాజువంటిది. విద్యాభ్యాసముపట్ల ఉపాధ్యాయుని వంటిది. రసభావముల బుట్టించి తన్మయత్వము నొందించుపట్ల రసజ్ఞుడగు నటునివంటిది. పెక్కులేల! ప్రపంచమున మానవుడు తన జీవితమును సన్మార్గమున నుత్తమముగ శ్రేయస్కరముగ గడుపవలయునన్న సద్గ్రంథపఠనము తప్ప వేరొండు శరణ్యములేదు. రామకృష్ణాది త్యాగశీలుర జీవితచరిత్రముల దెలుపు గ్రంథముల జదువు వినువారలకు ఆ త్యాగగుణములు కొంతవఱకైన అంకురింపక మానవు. ఇప్పటి మన మహాత్మాగాంధివంటి మహ నీయుల త్యాగగుణముల బ్రత్యక్షముగ జూచుటకంటె గ్రంథ రూప మున నున్నవారి జీవిత చరిత్రముల జదువుటచే నెక్కువ యుద్రేకాభి మానములు కలుగుచున్నవి. వేయేల గ్రంథములే మానవ సద్మృశేము లని చెప్పుట కెట్టి సంశయమును లేదు.

అట్టి గ్రంథ నిర్మాణము సంస్కృత భాషయందు మహర్షుల కాలముననే లిపి సాధనములచే గలిగి క్రమాభివృద్ధి గాంచినదని నే

నిదివరకే భాషా ప్రకరణమున జెప్పియుంటిని. ప్రథమాంధ్ర గ్రంథ నిర్మాణాచార్యుడు నన్నయభట్టని కొందరును, అతనికి బూర్వమే ఆంధ్ర భాషయందు గ్రంథ నిర్మాణముండెనని మఱికొందరును బరిశోధకులు దీర్ఘ నిరంతర వివాదములచే దలలు బ్రద్దలు కొట్టుకొనుచున్నారేకాని యిదమిత్థమని సప్రమాణముగ నిరూపించినవా రొక్కరును గాన్పిం పరు. ఏది యెట్లున్నను నన్నపార్యుడే ప్రథమాంధ్రగ్రంథ నిర్మాత యను కింవదంతి దేశమున గలదు. అప్పటినుండియే ఆంధ్రగ్రంథ నిర్మాణము విమర్శింతము. ఈయన మహాభారతమును రచించినది పదియవ శతాబ్దము. తిక్కన సోమయాజి తక్కిన భారత పంచదశ పర్వములను రచించినది పదమూడవ శతాబ్దము. పదిమొదలు పద మూడవ శతాబ్ద మధ్యకాలమునకాని పదిమూడు మొదలు పదునై దవ శతాబ్ద మధ్యకాలమునగాని ఆంధ్రగ్రంథ నిర్మాణ మంతగ గాన్పించుటలేదు. ఆంధ్రభాషోద్ధరణ కంకణబద్ధుడగు శ్రీ కృష్ణదేవ రాయల కాలమగు పదునైదవ శతాబ్దమునుండియే ఆంధ్ర గ్రంథ రచనము మిక్కుటముగ బ్రబలి చాలవఱకు ఆంధ్ర వాఙ్మయము అభి వృద్ధి జెందినది. అందు గొన్ని సంస్కృత వాఙ్మయ గ్రంథానువాద ములును, సంస్కృత పురాణేతిహాసములనుండి గ్రహించిన కథల ననుసరించి రచించిన ప్రబంధములును కొన్ని స్వకపోల కల్పిత రచన లును అయియున్నవి

ఈ గ్రంథములన్నియు గద్యపద్య మిశ్రరూపముననున్నవే కాని వీనిలో అచ్చముగ గద్య గ్రంథమేదియు జూపట్టదు. కాగిత ములు మన దేశమున బదినాల్గవ శతాబ్దముననే వాడుకకు వచ్చి యుండినను అచ్చుకూటములు వెలయువఱకు మన పూర్వులు గ్రంథ ముల నన్నిటి తాళపత్రములమీాదనే వ్రాయుచుండిరి. ఆ కాలమున వారి లేఖనకౌశల మత్యద్భుతము; అనన్యదుర్లభమును. తాటాకులపై బారులుదీర్చి గంటముతో నణుమాత్రమైన స్ఖాలిత్యము గలుగనీక ముత్యములు బోలిన అక్షరముల లిఖించు వారి నేర్పు నేరికైన వర్ణింప

శక్యమగునా! అక్షరము లెంత జిలుగుగ వ్రాసినను లేఖనగతియందును, వర్ణముల పొంకమునందును ఈషన్మాత్రమైన లోపముండెడిది కాదు. ఇందుకు నా స్వగ్రామమున నా గృహమున నిప్పటికిని కాపాడబడుచున్న జిలుగు భారత భాగవతములే నిదర్శనములు. మన దేశమునకు ముద్రణ యంత్రములును, టైపు రైటరులును వచ్చిన పిమ్మట మన లేఖన కౌశలమును, శక్తియును క్షీణించుటయే కాక వర్ణసౌష్టవమును గమన వేగమునుగూడ కొరవడినవి.

---

గ్రంథాలయ ప్రయోజనము :

లోకమున విజ్ఞాన మెప్పుడు గ్రంథరూపమున వెలసి వాఙ్మయ మభివృద్ధిజెంద ప్రారంభించినదో అప్పుడే ప్రజలయందు విద్యాభ్యాస విద్యాపోషణాభిలాషలు జనించినవి. గ్రంథ సంపాదన, సంరక్షణాభిలాషలును బుట్టినవి. ప్రజలయందు గ్రమక్రమముగ విద్యాభివృద్ధి గలుగుటతో గ్రంథాలయ నిర్మాణోద్యమము ప్రారంభమయినది. ప్రజలెవరికి గావలసిన పుస్తకములు వారే సంపాదించి చదువుకొనగూడదా? వ్యయప్రయాస కారణములగు ప్రత్యేక గ్రంథాలయము లేల కావలయుననుప్రశ్న ముదయింపవచ్చును. ధనవంతులగు వేకొద్ది మందియో గ్రంథముల జేర్ప సమర్థులగుచున్నారేకాని ధనహీనుల కది సాధ్యపడునదికాదు. ధనవంతులకైనను సమగ్ర గ్రంథ సంచయమును సేకరింప దుస్సాధ్యము. దేశములోని భిన్నభిన్న ప్రదేశముల యందుగాని, విదేశములయందుగాని భిన్నభిన్న కవులచే రచింపబడిన పుస్తక సముదాయమును వ్యయప్రయాసలకోర్చి సంపాదించు కార్యము ధనవంతుడగు యే మానవునకును సులభ సాధ్యముకాదు. సాధ్యమయినను పుస్తక సంచయమును సురక్షితముగ గాపాడ వలనుపడదు. వలనుపడినను గ్రంథముల చెదరకుండ జూచుట అతి కష్టము. అప్పుడప్పుడు స్నేహదాక్షిణ్య భావములచే పొత్తములు పరహస్తగతమై తిరిగి రాకుండుటయు సహజమైయున్నది. ఇందుకు కారణమేమన అట్టి గ్రంథ సంచయమును రక్షించుటకు సరియగు కట్టుదిట్టములును,

విధి నిబంధనలును లేకుండుటయేమో? ఆ విషయమున నాకు స్వానుభవము గలదు.

ప్రభుత్వామోదమునగాని, పలువురు ధనవంతుల ధన సహాయ్యమునగాని నిర్మింపబడి విధి నిబంధనలకు వెంబడి కట్టుదిట్టములతో నడిపింపబడు బహిరంగ ధర్మగ్రంథాలయములకు గ్రంథ సంచయమును జేర్చుటయు సులభమే. సంరక్షించుటయును సులభమే. అట్టి గ్రంథాలయములే ప్రజలకు అనాయాస దర్శనీయములు. నిరభ్యంతర పఠనీయములు. నీతి నిలయములు. మతబోధన మఠములు. ప్రత్యేక ధర్మగ్రంథాలయములు బీదల కెంతయో యుపకారమొనర్చును. ధనవ్యయము లేకయే గ్రంథపఠనము సిద్ధించుచున్నది. గ్రంథాలయము పండితులకు బుట్టినిల్లువంటిది. పరిశోధకులకు ముంగిటి కల్పవృక్షమువంటిది. కవీశ్వరులకు గామధేనువు వంటిది. అన్ని విధములచేత పుస్తకాలయములు మానవ జీవితముల వికసింపజేసి జీవితకాలము నుత్తమోత్తమముగ బరిణమింపజేయును. గ్రంథ భాండాగారములవలన మానవుల కింకెన్నియో అసంఖ్యాకములగు ప్రయోజనములు కలుగుచున్నవి. గ్రంథ విస్తరభీతిచే వానినన్నింటి నిచట జెప్పమానితి.

పాశ్చాత్యదేశ గ్రంథాలయములు :

భారతదేశ గ్రంథ నిర్మాణమునకంటె పాశ్చాత్య దేశములయందు గ్రంథ నిర్మాణము ఆధునికమైనది. అయినను ఆ దేశములయందు మొదటినుండి సర్వ జనులకు నిర్బంధ విద్యావిధానము గలదు. అందుచే విద్యావంతుల సంఖ్య శీఘ్రముగ బెరుగుచుండెను. తదనుగుణ్యముగ గ్రంథ రచనమును అభివృద్ధిగాంచెను. ఇప్పటికి ఆ దేశములయందు జదువను వ్రాయను నేర్చి గ్రంథపఠన యోగ్యతగలవారు నూటికి తొంబదితొమ్మిది మంది కలరు. జన సామాన్యమంతయు విద్యావంతమైనపుడే గ్రంథ భాండాగార నిర్మాణావశ్యకత ప్రజలను త్వరపెట్టుచుండును. విద్యాభివృద్ధియందు పాశ్చాత్యులకుగల పట్టుదల మన పాలకులగు ఆంగ్లేయుల మూలముననే తెలిసికొనుచున్నాము.

అమెరికా, ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాంసు మున్నగు స్వతంత్ర నాగరక దేశములయందు గ్రంథాలయములేని యూరేలేదని ఆయా దేశచరిత్రల మూలమున తెలిసికొనుచున్నారము. అత్యల్ప సంఖ్యగల గ్రామము సయితము ఒక గ్రంథ భాండాగారమును, పఠన మందిరమును గలిగి యున్నదనునపుడు నగర పట్టణములగూర్చి వేఱుగ చెప్పవలయునా? నగరములయందు విశ్వ గ్రంథ సంచయముగల కేంద్ర గ్రంథాలయములే పెక్కులున్నట్లు వినుచున్నారము. ఈ దేశముల గ్రంథాలయ పఠనమందిరము లనేకములు ప్రభుత్వాదాయముతోనే పోషింపబడుచున్నవి. ధనవంతుల ధనమూలమున బోషింపబడు గ్రంథాలయములును గొన్ని యుండవచ్చును. ప్రభుత్వ సహాయ్యము లేని సంస్థ లేవియు అభివృద్ధి గాంచనేరవు. పాశ్చాత్య దేశములందు గ్రంథాలయము లింత ఉన్నత దశయందుండి ప్రపంచమునకు మార్గదర్శకములగుటకు గారణము ప్రభుత్వ సహాయ్యమే. ఈ దేశ గ్రంథాలయ పఠన మందిరముల నిర్మాణ కౌశలమును, అందలి వస్తుసంచయ సౌందర్యమును ప్రేక్షకుల మానసముల జూరగొన గలుగుననుట వింత గాదు. లండన్, ప్యారిస్, బెర్లిన్ గ్రంథాలయముల చూచినవారు క్షుత్పిపాసా బాధలుగూడ మరతురనుమాట తప్పుగాదు. అది యట్లుండనిండు. ప్రాచ్యఖండ దేశములలో మొన్న మొన్న దలయెత్తిన జపాను దేశపు వాఙ్మయాభివృద్ధియు, గ్రంథాలయ నిర్మాణ పోషణాభిలాషయును మనల సిగ్గుపడ జేయుచున్నవి. ప్రజా సామాన్యమంతయు జదువుకొనవలయునను నిర్బంధముగల ఇట్టి దేశములయందెన్ని గ్రంథాలయములున్నను నింక లోపము గాన్పించుచునే యుండును.

ప్రాచీన భారత గ్రంథాలయములు :

ప్రాచీనకాలమున భారతదేశమందు బౌద్ధులకు పూర్వము ప్రత్యేక గ్రంథ భాండాగారములు నిర్మింపబడి పోషింపబడుచుండినట్లు ప్రమాణము లేమియు జూపట్టవు. అందుచే అప్పటికి వాఙ్మయ గ్రంథములు లేవనజనదు. జనసామాన్యమున విద్య లేనందున గ్రంథాలయ

నిర్మాణావశ్యకత కలిగినదికాదు. ఆ కాలమున విద్యావంతులు మి క్కిలి తక్కువ. కాని విద్యావంతులైన వారందఱు మిక్కిలి విజ్ఞానము గలవారుగ నుండెడివారు. జనసామాన్యము విద్యాభ్యాస విషయమునను, విద్వాంసులు విద్యావ్యాప్తి విషయమునను శ్రద్ధ వహించినవారు కారు. పండితులు మాత్రము అప్పుడప్పుడు రచింపబడు గ్రంథములను సేకరించి స్వార్థమునకై కాపాడుచుండెడివారు.

బుద్ధదేవుని సిద్ధాంతముల ననుసరించి వేఱు మత మొండుబుట్టి దేశమంతట వ్యాపించుటచే వేదమతము క్షీణించెను. వేద మతావలంబులు నామ మాత్రావశిష్టు లయిరి. అంతట గ్రంథ రచన తగ్గుటయే కాక గ్రంథములును పెక్కులు నశించెను. బౌద్ధ మతానుసారము గ్రంథరచనము ప్రారంభమయి అచిరముననే అపార వాఙ్మయ మేర్పడి అది దినదిన ప్రవర్ధమానమై ఏడు ఎనిమిది శతాబ్దముల మధ్య నలందాది ప్రదేశములయందు గొప్ప కేంద్ర గ్రంథాలయములు స్థాపింపబడి పోషింపబడెను. బౌద్ధమత బౌద్ధవాఙ్మయములు మన దేశమున చాలకాలము ఉన్నత దశయందుండి హిందూమత హిందూ వాఙ్మయాభివృద్ధుల నణచిపెట్టెను.

శంకరాది మతగురువులు పుట్టి హిందూమత పునరుద్ధరణము గావించిన పిమ్మట నానాటికి బౌద్ధ వాఙ్మయ గ్రంథములు మనవారి మతద్వేషముచేత చాలవఱకు నశించుటయు సంభవించెను. కొన్ని గ్రంథములు పరదేశీయుల ఆదరణమున చీనా, టిబెత్తు మొదలగు దేశములకు బోయెను. శ్రీహర్షుని కాలమందు చీనా యాత్రికుడగు హియాన్‌త్సాంగ్ అనువా డొక్కడే 657 గ్రంథముల చీనా దేశమునకు గొంపోయెనని తెలియుచున్నది. హిందూ మతము పునరుద్ధరింపబడిన పిమ్మట సంస్కృత వాఙ్మయము శుక్లపక్ష చంద్రునివలె అపార సంపూర్ణాభివృద్ధి గాంచి కాశీ వ్యాసపీఠ గ్రంథలయాది పెక్కు గ్రంథాలయములు నెలకొల్పబడి విరాజిల్లెను. విద్వాంసుల యిండ్లన్నియు

గ్రంథమయమాయెను. మఠములయందును, దేవాలయములయందును గ్రంథసముదాయ మెంతయో సమకూర్చబడి పాలింపబడుచుండెను.

కాని మహమ్మదీయులు మనదేశము నాక్రమించిన పిమ్మట మతద్వేషముచే ననేక దేవాలయ మఠ నిర్మూలనముతోపాటు మత గ్రంథములనేకాక దృగ్గోచరమైన ప్రతి వాఙ్మయ గ్రంథమును నశింపజేసిరి. ఎన్నియో గ్రంథ మందిరముల గాల్చిరి. అనంతర మెందఱో పాశ్చాత్య యాత్రికులు వేలకొలది గ్రంథముల నపహరించి తమ దేశముల జేర్చిరి. లండను, ప్యారిసు, బెర్లిన్ మున్నగు నగరము లందలి గ్రంథాలయముల నలంకరించియున్న సంస్కృత గ్రంథ సంచయ మంతయు యిట్లపహరింపబడినదియే. అన్యదేశముల యందున్నంత గీర్వాణ గ్రంథజాల మిప్పుడు మనదేశమున లేదు. మన గీర్వాణి నానా విధముల మనల విడిచి పరుల జేరినది. ఇందుకు జింతింపక నా దేవి నారాధించి పూర్వోన్నతి గాంతము.

ఆంధ్ర గ్రంథాలయోద్యమము :

ఆంగ్లేయులు భారతదేశమున ప్రవేశించుటతో మనకు గ్రంథ నిర్మూలన భయము తీరినది. వారు అముద్రిత సంస్కృత దేశ భాషా గ్రంథముల సమకూర్పించి, దేశమందచ్చటచ్చట పెద్ద పెద్ద నగరములయందు పుస్తక నిలయముల నిర్మించి కాపాడుచు వాఙ్మయాభివృద్ధికి సకల విధముల తోడ్పడ దొడంగిరి. కాని మతద్వేష భాషాద్వేషములచే గ్రంథసముదాయమున కెట్టి హానియు కలిగించియుండలేదు. చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార మట్టిదియే. ఆంగ్లేయులు ప్రపంచములోని మనుజులందరు తమ క్రైస్తవ మతావలంబులు కావలయునను వెఱ్ఱి కోరిక కలవారయినప్పటికిని పర మతద్వేషమును ప్రత్యక్షముగ జూపరు. వారు విద్యాప్రియులు. చాలా ప్రవీణులు. మన మేలుకొలుకు గాకున్నను స్వప్రయోజనముకైన వారు మన దేశీయ విద్యల గాపాడవలసి వచ్చినది. ఆంధ్ర భాషోద్ధరణమునకై బ్రౌన్ దొరగారు సల్పిన కృషి మనవారిలో నెవరును సల్పియుండలేదు.

అనేక లిఖిత తాళపత్ర గ్రంథముల సంపాదించి సంరక్షింపజేసెను. ఆంధ్రదేశమున మన ఈ గ్రంథాలయోద్యమము ప్రారంభము కాక పూర్వమే గ్రంథాలయ నిర్మాణోత్సాహము ప్రజలయందు గలిగినది. అదియును ఇప్పటికి సుమారు యిరువదియైదు సంవత్సరముల కిటీవల నుండియే నా విద్యార్థికాలమగు 1890 సం॥ ప్రాంతమున ఆంధ్రదేశమున పెద్దపెద్ద పట్టణముల యందైన నొక గ్రంథాలయము కనుపింపలేదు. అయినను పండితులును, విద్యాభిమానులును ముద్రితాముద్రిత గ్రంథములు పెక్కులు సంపాదించి స్వగృహముల భద్రముగ గాపాడుచుండెడివారు. నా చిన్నతనమున మా యింటనే నేనొక బండిమోత తాళపత్ర గ్రంథములను చూచియున్నాడ.

గ్రంథాలయ నిర్మాణోత్సాహము ప్రజలయందుత్పన్నమై గ్రంథాలయోద్యమము బయలువెడలులోపల ఆంధ్రదేశమున ఏ కొన్ని మండలములలోనో కొన్ని ముఖ్యస్థలములయందు సామాన్య గ్రంథనిలయములు నెలకొల్పబడినవే కాని నిజమైన యభిమానము ప్రజల నావరింపలేదు.

అందుకును కృష్ణా, గోదావరి, గుంటూరు, మండలములు మాత్రమే ముందంజ వైచినవి. ఆంధ్రదేశమున నిప్పుడు పుట్టి దేశపురోభివృద్ధికి నానాముఖముల పాటుపడుచున్న ఉద్యమముల కన్నిటికి ఆంధ్ర మహాసభయే తల్లి. ఆ మహాసభా మూలమున స్థాపింపబడిన ఆంధ్రోద్యమము తమ దేశ పరాధీన దుస్థితిని మఱచి నిద్రించుచున్న ఆంధ్ర మాతృపుత్రుల మేల్కొల్పి ఈ ఆంధ్ర గ్రంథాలయోద్యమాది వివిధ నిర్మాణముల బురికొల్పుటచేగదా ఆంధ్రుల కీర్తిలత దేశదేశముల బ్రాకగలిగినది.

ఈ గ్రంథాలయోద్యమము 1914 వ సంవత్సరమున విజయవాడ యందు జనించి తన ప్రథమ జన్మదినోత్సవమును తన జన్మస్థానముననే ద్వితీయాంధ్ర మహాసభతోపాటు దివ్యముగ జరుగగాంచినది. ఈ గ్రంథాలయోద్యమము ప్రారంభమై 12 సంవత్సరములు

అయినను ఇప్పటికి తొమ్మిది మహాసభలు మాత్రమే జరిగినవి. తక్కిన మూడుసభలేల జరుగలేదో నేజెప్పజాలను. అందుకుగల కారణము సభాకార్యనిర్వాహకులకే తెలియును. ఉద్యమ మారంభమైన పిదప దేశమున నదివరకు ప్రజాసహాయ సంపత్తిలేక కొనయూపిరితో గుటగుట లాడుచుండిన గ్రంథాలయాలెన్నియో సంపూర్ణ జీవము కల్పింపబడి నవనవలాడ దొడంగినవి. మఱి యెన్నియో నూతన గ్రంథాలయములు కల్పింపబడినవి. ఉద్యమ నిర్వాహకుల పరిశ్రమ వలన దేశీయులలో గొంత యుద్బోధము కలిగి గ్రంథాలయ నిర్మాణేచ్ఛ అక్షరాస్యుడైన ప్రతిమానవునకును గలిగినది. రాజమహేంద్రవరము, గుంటూరు, విజయవాడ మున్నగు పెద్ద పట్టణములయందు పురాతనాధునిక ఆంధ్ర గ్రంథరాజములతో విరాజిల్లు గొప్ప గ్రంథనిలయములు నెలకొల్పబడినవి. అచ్చటచ్చట విద్యాభిమానులుగల యనేక గ్రామములందు పుస్తక భాండాగార నిర్మాణములు గావింపబడినవి. జనులకు నియ్యభివృద్ధి విషయమున గొంత యుత్సాహమును జనించినది. ఇట్టి ప్రోత్సాహమునకు గ్రంథాలయోద్యమము చాలవరకు తోడ్పడినది. ఈయుద్యమ ప్రేరణ సంస్థాపనలకు కారకులై కార్యనిర్వహణముగూడ వహించి, పట్టుదలతో సాగించుచు అఖిలభారత గ్రంథాలయోద్యమము సయితము ప్రోత్సహించి జయప్రదముగ నడిపించుచున్న మన అయ్యంకి వెంకటరమణయ్య, సూరి నరసింహశాస్త్రిగారలు మున్నగు దేశభక్తులకు మన కృతజ్ఞత తెలుపవలసి యున్నది.

ఇప్పటికాంధ్రదేశమున దాదాపు వన్నూఱు గ్రంథభాండాగారములు నిర్మింపబడియున్నవి. అందు కృష్ణా, గోదావరి, గుంటూరు మండలములయందును నూఱు, ఇన్నూఱు గ్రంథాలయములున్నట్లు దెలియుచున్నది. తక్కిన ఇన్నూఱు గ్రంథాలయములును గంజాం, విశాఖపట్టణం, దత్తమండలముల యందును, నిజాంరాష్ట్రమునందును నుండవలయును. అరకోటి ఆంధ్ర జనసంఖ్యగల నైజాం

రాష్ట్రమున గ్రంథాలయోద్యమ వ్యాప్తియును, గ్రంథాలయ సంఖ్య
యును మిక్కిలి తక్కువయని తెలియుచున్నది. దత్తమండలముల
యందీ వాసన పాటియు గాలికెగిరిపోయినది. రెండుకోట్ల జనసంఖ్య
గల యాంధ్రదేశమునకు నన్నూఱు గ్రంథాలయముల సంఖ్య సము
ద్రములోని తేనెబొట్టువంటిది. ఆంధ్ర పరిషత్సభవారు తమ సభా
పక్షమున నొక గ్రంథాలయమును స్థాపించియు, ముద్రితగ్రంథము
లెన్నియో సమకూర్చి పోషించుటయేగాక దేశమంతట వెదకించి
చిక్కినంతవఱకు అముద్రిత తాళపత్ర గ్రంథములు పెక్కులు సేక
రించి ముద్రించి ప్రకటించుటచే నాంధ్ర వాఙ్మయమున కెంతయో
యుపకృతి చేయుచున్నారు. అందుకు పీఠికాపురాధీశ్వరులు మున్నగు
జమీందారుల ధనసహాయమును, జయంతి రామయ్య పంతులుగారి
వంటి విద్వాంసుల నిరంతరకృషియునే కారణములు. ఆంధ్రదేశ
మునకొక సర్వాంగ సంపూర్ణమగు కేంద్ర గ్రంథాలయ నిర్మాణము
అత్యవసరము. అది ప్రభుత్వాదరణమున జరుగవలసిన కార్యము.
ప్రజలకు గ్రంథాలయోద్యమముపట్ల ప్రారంభమునందుండిన అభిమా
నాదరములు రానురాను తగ్గి ఆర్థికముగ మిక్కిలి కష్టపడుచు నుద్యమ
నిర్వహణమే యతి భారముగ నున్నట్లు వినుచున్నాడ. ఇట్టి యుద్య
మములభివృద్ధి గాంచవలయునన్న రాజాదరణ ముండవలయును.
లేదా ప్రజలందఱి యభిమానమైన నుండవలయును. ఏకొద్దిమందియో
ధనవంతుల తోడ్పాటుండిన జాలదు.

జనసామాన్యమందంతట విద్య వ్యాపించునపుడే వారికి విద్యా
పోషణాభిమానము గలుగును. ఇట్టి విద్యాసంస్థలను పోషించు భార
మును వహింతురు. అప్పుడవి నిర్విఘ్నముగ, దిగ్విజయముగ జరు
గును. రెండుకోట్ల జనసంఖ్యగల యాంధ్రదేశమున రమారమి
తొమ్మిది లక్షల జనులు మాత్రమే అక్షరజ్ఞులుగ నున్నారు. నూటికి
పదిమందికి తక్కువగనే యున్నారు. నూటికి తొంబదిమందికి పైబడి
విద్యాహీనులున్న దేశములలో గ్రంథాలయ నిర్మాణ పోషణాభి

లాపలు ప్రజలకెట్లు గలుగును? ప్రభుత్వపు తోడ్పాటున గాని, ధన వంతుల సాహాయ్యమునగాని నూరూర గ్రంథమందిరముల నెలకొల్ప గలిగినను వానినుపయోగించుకొనవా రెందరుండగలరు?

పెండ్లైన పిచ్చికుదురునా? పిచ్చికుదిరిన పెండ్లియగునా? యను నట్లు ముందు గ్రంథాలయోద్యమ మవసరమా? విద్యావ్యాప్తికి దోడ్పడజాలు సంస్థాపనల నిర్మాణోద్యమ మవసరమా? యను ప్రశ్న ముదయించుచున్నది. ఈ ప్రశ్నకు ప్రత్యుత్తర మాలోచింతము. గ్రంథములను జదువ భాషాజ్ఞానములేని మానవులకు గ్రంథ భాండా గారములు అంధునకు దర్పణమువంటివి. నూటికి పదిమంది యైన జదివినవారు లేని దేశములలో బండితుల శక్తినంతయు గ్రంథాలయ స్థాపనోద్యమములపట్ల వినియోగించు టంత యుక్తముకాదని నా మతము. ఇట్లనుటచే గ్రంథాలయోద్యమముగాని, గ్రంథాలయ నిర్మాణములుగాని కూడదని కాదు. మానుమనియునుగాదు. ప్రభుత్వాదరణముకాని, ప్రజాభిమానముగాని లేక క్షీణించుచున్న మత, నైతిక పారిశ్రామికాది జాతీయ విద్యల బోషింప నుద్యమింప బండితులకు నా విజ్ఞప్తి. దేశమంతట దేశీయ విద్యాసంస్థలు స్థాపింపవలయును. ప్రజలయందు నూటికి నూరుమంది చదువునట్లు చేయవలయును. ఆ కార్యము ప్రభుత్వసహాయ్యమున సులభముగ సాధింపబడగలదు. అది లేనపుడు ప్రజానాయకుల పూనిక చాలవఱకు సాధింపగలదు. ధనవంతులయొక్కయు, పండితులయొక్కయు త్యాగ మత్యవసరము. మతవిద్యను బోధించు సంస్కృత వాఙ్మయ మెంత దుర్దశయం దున్నదో చూడుడు. సంస్కృత పండితులెందఱు నిత్యనైవేద్యము లకే కష్టపడుచున్నారో చూడుడు. జాతీయ విద్యలు పునరుద్ధరింపబడి అట్టివార లందఱు సుఖించినపుడుగదా మన గ్రంథాలయముల ప్రయోజనము. దేశీయులందఱు జాతి మత భేదములులేక సకల విద్యల నేర్చినపుడుగదా మన గ్రంథాలయోపయోగము. నిర్బంధ విద్యా విధానమమలులోనున్న దేశములలోని ప్రజల విజ్ఞానముజూడుడు. అట్టి

విద్యావిధానము మన దేశమునను ప్రవేశపెట్టుటకుఁ గోరి గోపాలకృష్ణ గోకేలు మున్నగు నాయకులెందఱో యీ బ్రిటిషు రాజ్యాంగముతో అహోరాత్రములు పోరు సల్పిరి. అది యింతవఱకును నెఱవేఱ దయ్యెను. అది లేకున్న తక్కిన మన యుద్యమములన్నియు నడవిని గాచిన వెన్నెలయే. దానిని సాధింప బ్రయత్నింతము. నేను సాహసించి గ్రంథాలయోద్యమమును దెగడితినని తలంపవలదు. తదుద్యమమును బోషింప గోరువారలలో నేను మొదటివాడనే యగుదును. కాని విద్యా వ్యాప్తి విషయము మొదటిదనిమాత్రము చెప్పక తప్పదు. నేనును 1919వ సంవత్సరమునుండి యొక గ్రంథాలయమును పోషించు చున్నవాడనే. అందుననే విద్యయందు వెనుకబడియున్న మన దేశము నకు సర్వజనుల విద్యావంతుల జేయదగిన నిర్బంధ విద్యాసంస్థలత్యావ సరమని స్వానుభవముచే గనిపెట్టినాడ. ఇట్లనుటచే గ్రంథాలయోద్యమ మును విరమింపుమని కాదు.

ధర్మ గ్రంథాలయ పత్రిక - సంపుటము 2 - సంచిక 1 నుండి.

# పదియవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## పెదచెఱుకూరు

1928 జూన్ 28

## శ్రీ వేమవరపు రామదాసుపంతులు

ఈ కాలమునందలి గ్రంథాలయోద్యమముల ఆదర్శములకును, పూర్వకాలపు గ్రంథాలయముల ఆదర్శములకును ఎంతయో వ్యత్యాసమున్నది. విజ్ఞానము నపేక్షించువారికి ఉపయోగకరమగు పుస్తకములుండు స్థలము పూర్వము గ్రంథాలయముగ పరిగణింపబడుచుండెను. ఇప్పుడుకూడ యీ ఉద్దేశము కొంతవరకు ఉన్నది. కాని జనసామాన్యమునందు విద్యను వ్యాపింపజేయుటకై గ్రంథాలయములు నేడు ప్రాముఖ్యము వహించుచున్నవి. ప్రాథమిక పాఠశాలలయందు నేర్పబడు విద్య అల్పముగనుండుట సహజము. రాష్ట్రములందలి బాలురు యువకులు కేవలము ప్రారంభ విద్యతో తృప్తిచెంది యుండజాలరు. ఇట్టివారు తమ విజ్ఞానమును వృద్ధి చేసికొనుటకు గ్రంథాలయములు సాధనములుగ నున్నవి. ప్రతి పౌరునకు విద్య గరపుట ప్రభుత్వము వారి ధర్మమైయున్నది. రాష్ట్రవాసులందరకు విద్య గరపుటకై, గ్రంథాలయములు సాధనముగ నుపయోగింపబడుచున్నవి. గ్రంథాలయములు విద్యానిలయములుగావు, విద్యావ్యాపక సాధనములని కుడోల్కరుగారు చెప్పియున్నారు.

### భారత గ్రంథాలయోద్యమము :

మనదేశమున గ్రంథాలయోద్యమము కొలది సంవత్సరములకు పూర్వమే ప్రారంభమయ్యెను. అమెరికా విధానమునే ఈ దేశము వారు అనుసరించుచున్నారు. గ్రంథాలయోద్యమము అమెరికాలో 1876 వ సంవత్సరమున ప్రారంభమయ్యెను. ఉద్యమము చక్కగ

వ్యాపించినది. నేటి దినము అమెరికా గ్రంథాలయోద్యమ నిర్మాణ ము ప్రపంచ విఖ్యాతి వడసియున్నది. భారత దేశమున గ్రంథాలయో ద్యమమునకు నూతన ఆదర్శముల నేర్పరచి ప్రజాసామాన్యమునందు విజ్ఞానమును వ్యాపింపజేయుటకు సాధనముగ నుపయోగించుటకు బరోడా గైక్వారు ప్రథములు. 1910 సంవత్సరమున గైక్వారు, డబ్ల్యు. ఎ. బార్డెనుగారిని, ప్రధాన గ్రంథాలయాధికారిగ నియ మించిరి. వీరు అమెరికా వాస్తవ్యులగుటచే అమెరికాయందు వ్యా పించియున్న విధానమునే బరోడాలో ప్రవేశపెట్టిరి. కీ. శే. జె. యస్. కుడాల్కరుగారు ప్రథమమున వీరికి సహాయులుగ నుండిరి. అమెరికా ఐరోపా జపానులయందు వీరు పర్యటన మొనర్చి అచ్చట గ్రంథాల యోద్యమములెట్లు నిర్వహింపబడుచున్నవో పరిశీలింప నియమింప బడిరి. 1915 వ సంవత్సరమున వీరు ప్రధాన గ్రంథాలయాధికారిగ నియమింపబడిరి. బార్డనుగారు ప్రారంభించిన విధానమునే వీరు కొన సాగించిరి. భారత దేశమునకు బరోడా ఆదర్శమయ్యెను. ఇప్పుడు మహారాష్ట్ర, ఆంధ్ర, మైసూరు, పుదుకోటి రాష్ట్రములందు వృద్ధి చెందియున్న గ్రంథాలయోద్యమములు బరోడాయందలి అమెరికా విధానమునే యనుసరించుచున్నవి.

ఉద్యమ ప్రధాన లక్షణములను బరిశీలించెదము. గ్రంథాలయ ములు రెండు ఉద్దేశ్యములతో స్థాపింపబడుచున్నవి. సంఘమునందలి అన్ని తరగతులకు చేరినవారికి లాభకరమగు ప్రతిష్ఠాపనగ ఉచిత గ్రంథాలయ ముండవలయును. అన్ని తరగతులవారికిని, అన్ని వృత్తు లయందుండువారికిని, పురుషులకును, స్త్రీలకును వారివారి యోగ్యత, అర్హత, అభిమానము ననుసరించి చదువుకొనుటకు వీలగు పుస్తక ములు గ్రంథాలయమునం దుండవలయును. గ్రంథాలయము నం దుండు ప్రతి పుస్తకము ఎవరికో యొకరికి ఉపయోగకరమైనదిగ నుండ వలయును. గ్రంథాలయ ప్రచారము విరివిగ జరుగుట రెండవ విష యము. గ్రంథాలయములవల్ల కలుగు లాభములు అధిక సంఖ్యాకు

లకు తెలుపబడవలయును. కుగ్రామములందుండు వారుకూడ ఈ యుద్యమమువల్ల లాభము పొందునట్లు తగు ఏర్పాటులు చేయవలయును. ఈ రెండు ఉద్దేశములు నెరవేరుటకు ఒక కేంద్ర గ్రంథాలయము, దానికి అనుబంధములుగ ప్రధాన స్థానములందు చిన్న చిన్న గ్రంథాలయములు, ఇదిగాక గ్రామాంతరములందుండువారి ఉపయోగార్థమై ప్రత్యేక గ్రంథాలయములు స్థాపింపబడుచున్నవి. గ్రంథాలయములందుండు పుస్తకముల సూచిని తయారుచేయుట మిగుల ముఖ్యమగు కార్యము. గ్రంథాలయము వేరువేరు శాఖలుగ విభజింపబడుచున్నది. బాలురశాఖ, స్త్రీలశాఖ, కార్మికులశాఖ అను ప్రత్యేక శాఖల నిర్మించి ఒక్కొక్క తరగతివారికి ఉపయోగకరమగు పుస్తకములుంచబడుచున్నవి. పాఠకుల అర్హతలను గుర్తెరిగి వేరొక విధమున గ్రంథాలయములందలి పుస్తకములు విభజింపబడుచున్నవి. ఈ విధమున సాంకేతిక శాస్త్రగ్రంథములు, చిత్రకళలకు సంబంధించిన గ్రంథములు, శాస్త్ర పరిశోధన మొనర్చువారికి ఉపయోగకరమగు గ్రంథములు ప్రత్యేకముగ నుంచబడును. గ్రంథాలయమునకుపోయి చదువువారికి లాభకరమగు గ్రంథములు వేరుగను, గ్రంథాలయమునుండి గ్రంథములను బదులుగ తెచ్చుకొని చదువుకొనువారి కుపయోగకరమగు గ్రంథములు వేరుగను ప్రత్యేకింపబడుచున్నవి.

ఈ విధమున గ్రంథాలయములందలి పుస్తకములను వేరు వేరుగ ప్రత్యేకించుటయేగాక ప్రజలకు ఆరోగ్యసూత్రములు, శిశు సంరక్షణము మున్నగు విషయములను వివరించుటకై మ్యాజికు లాంతరు సహాయముతో ఉపన్యాసముల నేర్పరచుటకూడ గ్రంథాలయములవారే చేయుచున్నారు. ఇంతేకాక వైద్యశాలలయందలి రోగులకు కంటికి నింపగు వస్తువులనుచూపి సంతోషము కలుగజేయుట, కారాగృహములందలి ఖైదీలకు నైతిక శిక్ష గఱపుట, విద్యార్థులకు ప్రత్యేకోపన్యాసముల నిచ్చుట, సంతలయందు రాజకీయ సాంఘిక ప్రచారము సలుపుట గ్రంథాలయోద్యమమునకే చేరినవి. ఈ విధ

మున గ్రంథాలయాధికారి కేవలము పుస్తకములను బదులుగ నిచ్చు వాడేకాక రోగి జాడ్యమును గుర్తెరిగి ఔషధము నిచ్చు వైద్యునివలె కూడ నున్నాడు.

గ్రంథాలయోద్యమము జాతీయోద్యమము కాదా?

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము ప్రారంభమైనపుడు ఇది విదేశ సంప్రదాయమనియు, భారతదేశ పరిస్థితులకు అనుగుణముగ లేదనియు, జాతీయోద్యమమని చెప్పుటకు వీలులేదనియు పలువురు ఆక్షేపించిరి. 1919 సం॥రమున చెన్నపురియందు జరిగిన యావద్భారత గ్రంథాలయ సభలో యీ ఉద్యమము జాతీయోద్యమము కాదను తీర్మానముపై దీర్ఘమగు చర్చ జరిగెను. అధ్యక్షుడగు కుడల్కారుగారు కాస్టింగువోటు ఇచ్చి ఉద్యమము జాతీయోద్యమమని నిర్ణయించిరి. ప్రాచీన భారత వర్షమున పాటలీపురము, తక్షశిల, వారణాసి, అజంత, ఉజ్జయిని, నలందా విద్యాస్థానములందు గ్రంథాలయములుండెననియు, దేవాలయములు, మఠములు, గ్రామ పౌరాణికులు, భాగవతులు, ఉత్సవములందు భారతబోధుల పాటలు పాడువారు ఆధునిక గ్రంథాలయోద్యమముతో పోల్చదగిన ప్రాచీన ప్రతిష్ఠాపనలనియు కొందరు వాదించుచున్నారు. ఈ కాలమున ఇట్టి ప్రాచీన ప్రతిష్ఠాపనవలన సంపూర్ణలాభ ముండునాయని సందేహింపవలసియున్నది. కేవలము ప్రాచీన ప్రతిష్ఠాపనులపట్ల మూఢవిశ్వాసము ప్రకటింపవలయుననిగాని, పాశ్చాత్య సంప్రదాయములను సంపూర్ణముగ ననుసరింపవలయుననిగాని ఎవ్వరు కోరుటలేదు. అధిక సంఖ్యాకులగు ప్రజలయందు విజ్ఞానమును వ్యాపింపజేయుటకు ఆధునిక గ్రంథాలయోద్యమమే ఉత్కృష్ట సాధనమని అంగీకరింపవలయును. పూర్వకాలపు పౌరాణికులు, కథకులు విద్యావంతులై ప్రజా గౌరవ విశ్వాసములకు పాత్రులయి యుండెడివారు. విద్య కఱపబడు స్థానములగు దేవాలయములు పవిత్ర స్థానములయి ప్రజలకొక విధమగు నైతిక బలమును కలుగజేయుచుండెను. ఇట్టి సాంప్రదాయములు లేని ప్రస్తు

తపు గ్రంథాలయములు ప్రజా గౌరవమును పొందజాలకున్నవని కొం దఱు ఆక్షేపించుచున్నారు. కాని పాశ్చాత్య సాంప్రదాయములం దును, ప్రతిష్ఠాపనలందును ఇట్టి లోపములున్నవి. పాశ్చాత్య విధా నముల ననుసరింపక మన సమస్యలను మనము పరిష్కరించుకొనజాల నంతకాలము ఇట్టి లోపములతో కూడిన విధానములను అంగీకరింప వలయును.

బెల్గాముసందు జరిగిన యావద్భారత గ్రంథాలయ మహాసభకు అధ్యక్షత వహించిన దేశబంధు దాసు తన అధ్యక్షోపన్యాసమున ఇట్లు చెప్పిరి:- "విజ్ఞానము వెదజల్లుటకై పాశ్చాత్యుల విధానము నవ లంబింపవలసిన అవసరమేర్పడినది. మన విద్యా ప్రతిష్ఠాపనల నిర్మా ణమును అసంపూర్ణముగ-నున్నది. జనసంఖ్య అధికమగుటచేతను, ముద్రాక్షరశాలలు వ్యాపించుటచేతను, ఒక దేశమునుండి మరియొక దేశమునకు ప్రయాణముచేయుటకు సౌకర్యములేర్పడుటచేతను విద్యా సమస్య నూతనరూపము దాల్చినది. ప్రాచీన విధానము ననుసరించి ఈ సమస్యను నేడు పరిష్కరించుటకు వీలులేదు. విద్యార్థికిని ఉపా ధ్యాయునకు సంబంధముండవలయునను సిద్ధాంతము ఇప్పుడు అప్ర ధాన మగుచున్నది." దేశబంధు సూచించిన విధమున పరిస్థితులు మారినవి. కావున గ్రంథాలయోద్యమ ఫలితమును సందేహించుట ఉచితముకాదు. ఆధునిక గ్రంథాలయోద్యమమును ఆధారముగ గై కొని ప్రాచీన సాంప్రదాయములను సాధ్యమైనంతవరకు దానితో చేర్చి దానినొక గొప్ప జాతీయోద్యమముగ మార్చుట కర్తవ్యము.

ఆంధ్ర గ్రంథాలయోద్యమము :

ఈ యుద్యమము వ్యాపించుటకు ఆంధ్రదేశమున అనుకూల మగు పరిస్థితులుండెను. ఆంధ్రభాషపై అభిమానము అధికమగుకొలది ఉచిత గ్రంథాలయములు, తెలుగు గ్రంథాలయములు, తెలుగు వార్తాపత్రికలు, తెలుగు గ్రంథాలయములుగల సంఘములు, సభలు

రాష్ట్రమునం దంతయు వ్యాపించెను. 1914వ సంవత్సరమున ఆంధ్ర దేశ కేంద్ర గ్రంథాలయసంఘము స్థాపింపబడెను. 1918వ సంవత్స రమున బెజవాడయందలి రామమోహన ఉచిత గ్రంథాలయము ఆంధ్ర దేశ కేంద్ర గ్రంథాలయముగ అంగీకరింపబడెను. అది మొదలు ఈ ఉద్యమము సక్రమ పద్ధతులపై రాష్ట్రమంతయు వ్యాపించెను. కేంద్ర సంఘములకు అనుబంధములుగ గ్రామములందును, నగరము లందును గ్రంథాలయములు స్థాపింపబడెను. నిర్మాణము, ప్రచారము వీటియందు లోపములేక చక్కగ కొనసాగుచుండుటచే ఉద్యమము ప్రజాభిమానమును బడయగలిగెను. 1920వ సంవత్సరమున కలకత్తా యందు జరిగిన అవసర దేశీయ మహాజనసభయందు అసహాయోద్య మము ప్రారంభింపబడు నప్పటికి ఆంధ్ర దేశమున 600 గ్రంథాలయ ములు కేంద్ర సంఘమునకు చేరియుండెను. కేంద్రసంఘమునకు చేరని గ్రంథాలయములు కొన్ని యుండెను. విజ్ఞాన, సాంఘిక, రాజకీయ ప్రచారము సలుపుటకు ఈ గ్రంథాలయములు సాధనములుగ నుప యోగింపబడుచుండెను. స్వదేశి, ఖద్దరు వ్యాపింపజేయుట, నాటక రచనా లేఖనమును ప్రోత్సహించుట, సంగీతము, ఇతర లలితకళల నాదరించుట, జాతీయ ముద్రాక్షరశాలల స్థాపించుట, బాలభటులకు స్వచ్ఛంద సేవకులకు తగు శిక్ష గరపుట, జాతీయవ్యాయామ పరిశ్ర మలను పునరుద్ధరించుట, జాతీయోత్సవములను సలుపుట, సహకార సంఘములను స్థాపించుట మున్నగు పనులన్నియు గ్రంథాలయోద్య మమునకు అనుబంధములుగ నుండెను. ఇట్టి చక్కని నిర్మాణము నేర్పరచి ఉత్సాహముతోను, పట్టుదలతోను పనిచేసి ఉద్యమ విజ యమునకు కారకులైనవారు సూరి వెంకట నరసింహశాస్త్రి, అయ్యంకి వెంకట రమణయ్యగార్లని చెప్పవలసియున్నది. వీరిని, ఆంధ్ర దేశ మున వీరికి తోడ్పడినవారిని అభినందించుచున్నాను.

క్షీణ దశ :

కొంతకాలమునకు ఉద్యమ పటుత్వము క్షీణించెను. ఇందులకు అధికారులతోపాటు అనధికారులుకూడ కారకులని చెప్పవలసియున్నది. 1921వ సంవత్సరము మొదలు 1923వ సంవత్సరమువరకు అసహాయోద్యమము ప్రబలియున్నపుడు కాంగ్రెసు కార్యక్రమమును కొనసాగించుటకై దేశీయుల దృష్టియంతయు నిమగ్నమైయుండెను. ప్రతి గ్రామమునందును కాంగ్రెసు సంఘము స్థాపింపబడెను. గ్రంథాలయోద్యమమును నడుపుచున్న యువకులు రాజకీయ ప్రచారమునకు తమ యావచ్ఛక్తిని ధారవోసిరి. గొప్ప త్యాగము ప్రకటించి కారాగృహముల కేగిన రాజకీయ ప్రచారకులలో గ్రంథాలయోద్యమ నిర్వాహకులలో పలువురుండిరను విషయము ఎల్లరకు తెలియును. ఈ విధమున గ్రంథాలయోద్యమమునకు క్షీణదశ సంప్రాప్తమయ్యెను. పూర్వమువలె జీవకళలతో విరాజిల్లక నేటి దినము ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము నామమాత్రావశిష్టమై యున్నది. అసహాయోద్యమ తీవ్రత తగ్గగనే గ్రామకాంగ్రెసు సంఘములు నశించినవి. అప్పుడు దుర్బలమైయున్న గ్రామ గ్రంథాలయములు నిరుత్సాహపరులగు కాంగ్రెసు ప్రచారకులకు మరల శరణాలయములై ఆంధ్ర జాతీయత్వమును నిలువబెట్టి ఆంధ్రులయందు మరల ఉత్సాహమును పురిగొల్పుటకు సాధనములైనవి.

గ్రంథాలయోద్యమము అడుగంటుటకు మన అధికారులు కూడ కొంతవరకు పాటుపడిరి. గ్రంథాలయోద్యమము జాతీయతాభావము పురికొల్పుచుండుటను చూచి నిరంకుశాధికారులు ఓర్వక పోయిరి. జాతీయ వికాసమునకు సాధనములగు ఉద్యమము లన్నిటికిని వెరచు జస్టిసు మంత్రివర్గమువారు అధికారులతో ఈ ఉద్యమమును అణచివేయ ప్రయత్నించిరి. ఈదౌర్భాగ్యపు రాష్ట్రమున ప్రజా విజ్ఞానమును వికసింపజేయు ఈ గ్రంథాలయోద్యమమును నిరోధించు విషయమై మంత్రివర్గమువారు గావించిన కృషిని వివరింప

వలసియున్నది. దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు శాసన సభ్యులుగ నున్నపుడు ఆంధ్ర దేశ గ్రంథాలయములకు సంవత్సరమునకు 20 వేల రూప్యముల గ్రాంటును ప్రభుత్వమువా రిచ్చుచుండవలయునని కోరిరి. అందులకు ప్రభుత్వమువారు అంగీకరించిరి. ఈ మొత్తము పంచిపెట్టు అధికారము తన కుండవలయునని ప్రచురణశాకాధికారి యగు గ్విన్‌గారు కోరిరి. ఈ సూచన ఆమోదింపబడిన ప్రభుత్వము వారి ప్రచురణశాఖకు ఆంధ్ర గ్రంథాలయములు అనుబంధములుగ నుండెడివి. కాని ఒక గొప్పహోదా యందున్న భారతీయోద్యోగుడు ఈ యేర్పాటునందలి లోపమును గుర్తెరిగి ప్రచురణశాఖకును, గ్రంథాలయములకును సంబంధముండగూడదని పరిష్కరించిరి. స్థానిక సంఘములద్వారా గ్రంథాలయములు గ్రాంటునకు దరఖాస్తులు పంపుకొనవలయునని ప్రభుత్వమువారు ప్రకటించిరి. కొన్ని సంవత్సరములు ప్రభుత్వమువారీ విధమున గ్రాంటును పంచిపెట్టిరి. పిమ్మట 10 వేల రూప్యముల గ్రాంటుమాత్రమే ఇచ్చిరి. గ్రాంటు మొత్తము పంచిపెట్టుటయందుకూడ కొంతమార్పు జరిగెను. పోలీసు అధికారులు, జిల్లా విద్యాధికారి, సబ్ డివిజనలు మాజిస్ట్రేటువారి సలహాల ననుసరించి గ్రాంటులు పంచిపెట్టబడుచుండును. ఖద్దరు ధరించిన యువకులతో నిండియున్న గ్రంథాలయములు, జాతీయ పత్రికలను యంగు యిండియా మున్నగువాటిని తెప్పించు గ్రంథాలయములకు గ్రాంటు యివ్వకుండిరి. జస్టిసు పక్షమువారిచే స్థాపింపబడిన గ్రంథాలయములకు గ్రాంటు మొత్తము పంచిపెట్టబడుచుండెను. బెజవాడ యందలి రామమోహన గ్రంథాలయమునకును, అంగలూరు, కుముదవల్లి గ్రంథాలయములకును ప్రభుత్వమువారు గ్రాంటు నిచ్చుట మానివైచిరి. గ్రంథాలయోద్యమ విజయమునకు మంత్రులు యేవిధమున తోడ్పడిరో ఇందువల్ల స్పష్టముగ తెలిసికొనవచ్చును. జాతీయ వికాసమునకు కేంద్రస్థానములై ఆదర్శప్రాయమగు ప్రతిష్ఠాపనలుగ సంరక్షింపదగిన గ్రంథాలయములు విద్యాశాఖ మంత్రిగారి ఆగ్రహము

నకు గురియైయున్నవి. ఒక నిదర్శనమును తెలిపెదను. ఏలూరునందలి యువజన సంఘమున కొక చక్కని గ్రంథాలయము చేరియున్నది. ఈ సంఘమునకును, గ్రంథాలయమునకును ప్రత్యేక భవనము కట్టుటకు ప్రభుత్వమువారు కొంత స్థలము నొసగిరి. ఏలూరు వాస్తవ్యులొకరు పదివేల రూప్యములు వ్యయమొనర్చి ఆ స్థలముపై భవనము కట్టుట ప్రారంభించిరి. కాని ఈ సంఘమున మంచి గ్రంథములే కాక దేశభక్తిగల యువకులుకూడ అనేకులుండిరి. కావున సంఘమున కివ్వబడిన భూమిపై 500 రూప్యముల గ్రాండు రెంటు విధింపబడెను. ఏలూరు మ్యునిసిపాలిటి అధ్యక్షుడు జస్టిసు పక్షమునకు చెందినవాడు. ఈ స్థలమును స్వాధీనపరచుకొన వీరి కధికారమివ్వబడినది. మద్రాసు మంత్రివర్గమువారు విద్యా విషయములందు ఎట్టి ఔదాసీన్యమును ప్రకటించుచున్నారో దీనివల్ల తెలియుచున్నది. గ్రంథాలయములకు గ్రాంటు ఇచ్చు వివరములను ప్రభుత్వవారు యిటీవలనే ప్రకటించియున్నారు. సర్వాధికారములు జిల్లా విద్యాధికారి కివ్వబడినవి. గ్రంథాలయములు దేశభక్తికిని, జాతీయతకును ఆలయములుగ నుండ గూడదను ఉద్దేశముతో వీరు పనిచేయుదురని నిస్సందేహముగ చెప్పవచ్చును.

భావి కార్యక్రమము :

భావికార్యక్రమమును నిర్ణయించునప్పుడు రెండు విషయములను దృష్టియందుంచుకొనవలయును. ఇంతవరకు ఈ ఉద్యమమునకై పాటుపడినవారి అనుభవమును తృణీకరించరాదు. వారుచూపిన మార్గమునందే నడచుట లాభకరము. రెండవ విషయమేమనిన ఒక ఆదర్శమును నిర్ణయించుకొని తత్సాధనమునకై ప్రయత్నించవలయును. గ్రంథాలయముల నిర్మాణము ఈ విధమున నుండవలయునని నిర్ణయించుకొనవలయును. ఇంతవరకు బరోడా నిర్మాణమును ఆదర్శముగా గైకొని పనిచేయుచుంటిమి. ప్రతి గ్రామమునకును, ప్రతి నగరమునకును గ్రంథాలయ ముండునట్లుగను వీటన్నిటికిని ఒక కేంద్ర

గ్రంథాలయ ముంచునట్లుగను పనిచేయవలయును. 5000 జనసంఖ్య గల గ్రామములు తమంతట తామే స్థానికసంఘముల సాయముతో గ్రంథాలయముల నేర్పరచుకొనవలయును. 2000 మొదలు 5000 జన సంఖ్యగల ప్రతి గ్రామమునకును ఒక గ్రామ గ్రంథాలయముండ వలయును. ఆంధ్రదేశమున నిట్టి గ్రామములు 1500 ఉన్నవి. ఒక్కొక్క గ్రామ గ్రంథాలయమునకు కనీసము 300 రూప్యములు కావలెను. ఈ విధమున 1500 గ్రామములకు 45000 రూప్యములు కావలయును. వెయ్యి మొదలు 2000 జనసంఖ్యగల గ్రామములకు సంచార గ్రంథా లయము లుండవలయును. అనగా ఒక పెట్టెనిండుకు పుస్తకములనుంచి వరుసగ గ్రామములకు పంపుచుండుట. ఇట్టి గ్రామములు ఆంధ్రదేశ మున 4500 ఉన్నవి. ఒక్కొక్క పెట్టె పుస్తకముల వెల 50 రూపాయ లుండును. మొత్తముమీద ఇట్టి గ్రంథాలయములకు 175000 రూపా యలు కావలయును. ఈ సంచార గ్రంథాలయములవల్ల అన్ని గ్రామ ములకు లాభముండును. స్వాతంత్ర్యము ననుభవించు దేశములలో నిట్టి యుద్యమములను ప్రభుత్వమువారు ఆదరించి ధనసహాయ మొస గెదరు. కాని ఈ దేశమున ప్రభుత్వమువారి సహాయము మనము పొందుట దుర్లభము. బరోడాయందు అమలులోనున్న యేర్పాటు శ్రేష్ఠమైనదిగ కనుబడుచున్నది. గ్రంథాలయమునకు కావలసిన మొత్తమున మూడింట ఒక భాగము గ్రామస్థులే సేకరించుకొనవల యును. ఒక భాగము స్థానిక సంఘములు, మరియొక భాగము ప్రభు త్వమువారు గ్రాంటుగ నిచ్చుచున్నారు. ఆంధ్రదేశమున స్థానిక సంఘములు గ్రంథాలయోద్యమమునకు అనుబంధముగ సహకార సంఘములను స్థాపించు విషయమై ప్రచారము సలిపి యీ విధమున స్థాపింపబడిన సహకార సంఘములు ఉద్యమమునకు కొంత ధన సహాయ మొసగవలయునని నిర్ణయింపవచ్చును.

ఇప్పుడు ఆంధ్రదేశమునందున్న ప్రతిష్ఠాపనలను పునరుద్ధరిం చుట ప్రథమ కర్తవ్యము. ఈ ఉద్దేశ్యము నెరవేరవలయుననిన ఎం

తరయో కృషి సలుపవలయును. ఉద్యమ విధాన మెట్లుండవలయునో మిత్రులగు శ్రీయుత నరసింహశాస్త్రిగారు వివరించియున్నారు. పౌర ధర్మములు, లలితకళలు, శాస్త్రములు మున్నగువాటిపై నుపన్యాస ముల నేర్పరచుట గ్రంథాలయోద్యమమునకు చేరిన పనియని వీరి యభిప్రాయము. కొన్ని సంవత్సరములకు పూర్వము రామమోహన గ్రంథాలయమున నిట్టి యుపన్యాసము లేర్పరుపబడెను. నేనుకూడ ఒక ఉపన్యాస మిచ్చితిని. ఈ ఏర్పాటు ప్రశంసనీయమయినది. ప్రజల యందు ప్రచారము సలుపుటయే కాక సహరోద్యమమును ప్రజల యందు వ్యాపింపజేసి గొప్ప లాభము పొందవచ్చును.

ఆంధ్ర విశ్వ విద్యాలయము :

ఆంధ్ర విశ్వ విద్యాలయ మేర్పడుట గొప్ప సంఘటనమని గుర్తెరుగవలయును. స్వాతంత్ర్య మనుభవించుచున్న దేశములందలి విశ్వవిద్యాలముల ఆదర్శములనే ఆంధ్ర విశ్వ విద్యాలయము వారు కూడ అనుసరింప పూనుకొనిన ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమ మునకు మంచి దశ వచ్చినదని నమ్మవచ్చును. ఆంధ్రులయందు విజ్ఞానమును వ్యాపింపజేయుటకు గ్రంథాలయములు విశ్వవిద్యాలయ ములకు అనుబంధములుగ నుండగలవు. ఆంధ్రాభిమానముగలవారే సెనెటు సభ్యులుగనున్న గ్రంథాలయోద్యమ పంట పండినదని నమ్మ వచ్చును. నూతన విశ్వ విద్యాలయ స్థాపనము మన గ్రంథాలయో ద్యమ చరిత్రయందు నూతన శకమును సూచించుచున్నదని నమ్మె దను.

జాతీయతా భావమును వికసింపచేయుటకు యీ ఉద్యమము గొప్ప సహకారిగానున్నదను విషయమును గుర్తెరుగవలయును. ఉద్య మ పటుత్వమును స్వాతంత్ర్య సంరంభమున ఆ ఉద్యమము మనకు గావింపగల సహాయమును మనము గుర్తెరుగజాలక మూఢులమై ఎన్నియో యుద్యమములను చంపివైచితిమి. గంథాలయోద్యమము

జాతీయ పునర్నిర్మాణమునకు చక్కని సాధనమని గుర్తెరుగుటవసరము. మన జాతీయతను వికసింపజేయుట కిది యొక సాధనము. జాతీయవికాసమే స్వరాజ్య ఆదర్శము.

—ధర్మగ్రంథాలయ పత్రిక - సంపుటము 2 - సంచిక 4 నుండి.

# ప్రభుత్వము

## ఆర్థిక సహాయము :

గ్రంథ భాండాగారములకు మునిసిపాలిటీలయొక్కయు, జిల్లా తాలూకా బోర్డులయొక్కయు ద్రవ్యమునుండి విరాళముల నొసంగుటకుగాను తగు ఉత్తరువుల నిచ్చుటకు రాజధాని ప్రభుత్వమువారికి ఈ సభవారు విజ్ఞప్తి పంపవలెనని తీర్మానించుచున్నారు.

1914 I 2

విద్యాభివృద్ధి చేయుటయందు గ్రంథాలయములు ముఖ్యస్థానములు గనుక ప్రస్తుతము ఆంధ్రదేశమున స్థాపింపబడియున్న గ్రంథాలయములకును, పఠనమందిరములకును మునిసిపాలిటీ జిల్లా తాలూకా బోర్డులయొక్క ద్రవ్యములనుండియు, రాష్ట్రి రెవెన్యూలనుండియు ద్రవ్య సహాయమును జేయుటకు సదుపాయములను గలుగజేయవలసినదని ప్రభుత్వమువారిని ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

1915 II 2 (అ)
1916 III 2 (క)
1917 IV 3 (క)
1919 VI 3 (క)

ఆంధ్రదేశ కేంద్ర గ్రంథాలయమునకును, మండల గ్రంథాలయములకును సంవత్సరమునకు కొంత ద్రవ్యమును విరాళముగ విద్యాశాఖ నియమిత ద్రవ్యమునుండి ఇప్పించవలసినదని ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

1919 VI 3 (చ)

స్వంత భవనములు నిర్మించుకొను గ్రంథాలయములకు ప్రస్తుతమున విద్యాశాలా భవన నిర్మాణమునకు ప్రభుత్వ ద్రవ్యము నిచ్చు విధముననే ద్రవ్యమును విరాళముగ నివ్వవలయును.

1925 IX 3 (ఈ)

(అ) ప్రతి సంవత్సరము రాష్ట్రీయ బొక్కసమునుండి గ్రంథాలయముల పోషణకొఱకు ఇవ్వబడుచున్న ద్రవ్యసహాయము అత్యల్పము గనుక తగిన కట్టుదిట్టములతో పనిచేయు ప్రతి గ్రంథాలయమునకు సంవత్సరమునకు రు. 5000/- లకు

తక్కువకాని మొత్తమును ఆయా సంస్థల యోగ్యత ననుసరించి విరాళముల నిచ్చుట కును, తగిన మొత్తమును ప్రతి సంవత్సరము రాష్ట్రీయ బొక్కసమునుండి విరాళము నొసంగుటకును స్థానిక ప్రభుత్వమువారిని ఈ సభవారు కోరుచున్నారు.

(ఆ) మరియు రాష్ట్రీయ బొక్కసమునుండి యివ్వబడుచున్న విరాళములు పంచిపెట్టుటకు నియమింపబడిన నిబంధనలు బహు హ్రస్వదృష్టితో ఏర్పరుపబడినవని ఈ సభవారు ఆ నియమములను తీవ్రముగ ఖండించుచు వాటిని వెంటనే రద్దుపరచు టకు రాష్ట్రీయ ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు.

(ఇ) రాష్ట్రీయ ప్రభుత్వమువారు గ్రంథాలయములకిచ్చు విరాళములకు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకై కృషిచేయుచున్న ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారును, ఆయా స్థానిక స్వపరిపాలన సంఘములును ఇచ్చెడి సంజాయిషీ ననుసరించి మాత్రమే ఆయా గ్రంథాలయములకు ప్రతి సంవత్సరము పంచిపెట్టు చుండవలెనని ఈ సభవారు రాష్ట్రీయ ప్రభుత్వమువారికి సూచించుచున్నారు.

1926 x 3

## ఎలిమెంటరీబోర్డు పాఠశాలల గ్రంథాలయములు :

ఎలిమెంటరీబోర్డు పాఠశాలలయందు ఉండునట్టి పుస్తక భాండాగారము లను అట్టి పాఠశాలలుండునట్టి గ్రామములందుండు జనులనెల్ల ఉచితముగా చదువు కొనునటుల ఏర్పాటు చేయుటకు ప్రభుత్వమువారి నీ సభవారు ప్రార్థించుచున్నారు.

1916 III 2 (ట)

## కేంద్ర గ్రంథాలయము :

ఆంధ్రదేశ మధ్యమున అనుకూలమైన స్థలమునందు ఆంధ్రభాషయందు ప్రచు రింపబడు గ్రంథముల నన్నిటిని, ప్రతికలనన్నిటిని, చెన్నపట్టణ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందలి ఇతర అముద్రిత గ్రంథప్రతులనన్నిటిని చేర్చి, ఆంధ్రదేశ మందలి ఇతర గ్రంథాలయములకు సహాయభూతముగ నుండునటుల గ్రంథాలయము నొకదానిని ప్రభుత్వమువారు నెలకొల్పుట అత్యావశ్యకము గనుక అట్టి గ్రంథాలయ మును త్వరలో స్థాపించుటకు ప్రభుత్వమువారిని ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

1915 II 2 (అ)

1916 III 2 (ప)

1917 IV 5

## గ్రంథ నిషేధము :

గుంటూరు పట్టణమున శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారిచే రచియించి ప్రచురింపబడిన 'మాలపల్లి' అను గ్రంథమును ప్రభుత్వమువారు నిషేధించుట మిక్కిలి అన్యాయము, అనవసరము, ప్రమాణవిహీనము అని యీ సభవారు తీర్మానించుచున్నారు.

125 X 7

## గ్రంథాలయముల రిజిస్ట్రేషను :

పుస్తక భాండాగారములను, పఠన మందిరములను 1860వ సం॥ 21 నంబరు ఆక్టు ననుసరించి రిజిస్టరు చేయుటకు చెల్లింపవలసిన రుసుమును లేకుండగనే రిజిస్టరు చేయించుటకు ప్రభుత్వమువారి నీ సభవారు ప్రార్థించుచున్నారు.

1916 III 2 (చ)
1917 IV 3 (చ)
1919 VI 2

## పండితులకు సహాయం :

చెన్నపురి విశ్వవిద్యాలయమువారు తమ గ్రంథాలయమునుండి కొంత సొమ్మును ధరావతు పుచ్చుకొని పండితులకు మూడేసి గ్రంథముల నిచ్చుచున్న పద్ధతిని ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమందు ప్రవేశపెట్టి పండితుల కష్టములను తొలగించుటకు దొరతనమువారిని ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

1919 VI 18

## ప్రభుత్వ ప్రచురణలు :

దొరతనమువారిచే ప్రచురింపబడు వ్యావసాయిక, పారిశ్రామిక, ఆరోగ్య విషయక ప్రచురముల నన్నిటిని, జిల్లా గజెట్లను, ఆంధ్రభాషయందు ముద్రింపబడిన గ్రంథముల పట్టికలను ఆంధ్రదేశమునందలి గ్రంథాలయముల కన్నిటికిని ఉచితముగా దయచేయింపించవలెనని ఈ సభవారు ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు.

1915 II 3
1916 III 2 (త)
1917 IV 3 (ట)

ప్రభుత్వమువారిచే ప్రకటింపబడు రిపోర్టులాదిగాగలవాటిని, జిల్లా గజెట్లను జిల్లా గ్రంథాలయములకును, కేంద్ర గ్రంథాలయములకును, దేశభాషలలో ప్రచురింపబడువాటిని పల్లెటూళ్ల గ్రంథాలయములకును ఉచితముగ పంపునటు లేర్పాటును జేయుటకు పబ్లిసిటీబోర్డువారిని ఈ సభవారు కోరుచున్నారు.

1919 VI 4

## విజ్ఞాన ప్రచారము :

విద్యాశాఖకు సంబంధించిన ఉద్యోగస్థుల దగ్గర ఉండునట్టి మ్యాజిక్ లాంతరు మొదలగు పరికరములను, జనసామాన్యమునందు విద్యాభివృద్ధిని చేయుటకై గ్రంథాలయములకు ఎరువిచ్చు ఏర్పాటులను చేయుటకై ప్రభుత్వమువారిని ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

1916 III 2 (గ)
1917 IV 3 (త)

## వివిధములు :

1860వ సం॥పు 21వ ఆక్టు ప్రకారము రిజిస్టరుకాగోరు గ్రంథాలయముల వద్దనుండి రుసుమును వసూలు పరచకయే అట్టి రిజిస్టరీ నంగీకరింపవలెననియు, ఆంధ్ర దేశ గ్రంథాలయములన్నిటికీ ఆంధ్ర భాషయందు దొరతనమువారు ముద్రించు ప్రకటనము లన్నింటిని ఉచితముగా ఇచ్చుచుండవలెననియు, గ్రంథాలయములకు స్థానిక స్వపరిపాలనా సంఘములనుండియు, దొరతనమువారి బొక్కసమునుండియు ధన సహాయము చేయుచుండవలెననియు ఈ సభవారు దొరతనమువారిని ప్రార్థించు చున్నారు.

1918 V 2

# స్థానిక సంస్థలు వగైరా

## విరాళములు :

బందరు ఎడ్వర్డు పురమందిర భాండాగారమునకు అచటి మునిసిపాలిటీవారొసంగిన విరాళమును రాజధాని ప్రభుత్వమువారు అంగీకరింపక త్రోసివేసినందుకు ఈ సభవారు తమ యసమ్మతిని తెలియబరచుచున్నారు.

1914 I 1

అంగలూరు బాలసరస్వతీ పుస్తక భాండాగార భవన నిర్మాణమునకు రు. 1500-0-0 ల విరాళమునిచ్చి మార్గదర్శకులైన కృష్ణాజిల్లాబోర్డువారి నీ సభవారు అభినందించుచు ఇదేవిధముగ ఆంధ్రదేశమునంగుగల ఆయా భాండాగారములకు భూరి విరాళములిచ్చి భాండాగారాభివృద్ధికి తోడ్పడుటకు ఈ సభవారు కోరుచున్నారు.

1925 IX 6

స్థానిక స్వపరిపాలనాసంస్థలు గ్రంథాలయముల పోషణార్థమై గ్రంథాలయముల కొసంగుచున్న విరాళములను అకారణముగ రాష్ట్ర ప్రభుత్వమువారు రద్దుజేయుచు గ్రంథాలయముల అభివృద్ధికి అడ్డు తగులుట అనుచితమనియు, గర్హ్యమనియు ఈ సభవారు తలంచుచు ప్రభుత్వవారి చర్యను ఖండించుచున్నారు.

1925 IX 8

## గ్రంథకర్తలకు ప్రోత్సాహము :

భాషాభివృద్ధి దేశాభివృద్ధికి ముఖ్యస్థానము గనుకను, ఇందునుగూర్చి మన దేశమున ప్రభుత్వమువా రేవిధమైన ప్రయత్నము చేయకపోవుటచే గ్రంథకర్తలకు ప్రోత్సాహము లేక సద్గ్రంథ ప్రచురణకు అంతరాయము గలుగుచున్నదిగాన

(అ) స్థానిక స్వపరిపాలక సంఘములను (ఆ) దేవాదాయ ధర్మాదాయ ప్రతిష్ఠాపనలను (ఇ) సహకార సంఘములను తమతమ నిధులనుండి ప్రతి సంవత్సరము వారివారి ధన సంపత్తి ననుసరించి విరివిగా ద్రవ్యమును వెచ్చించి, ఆంధ్ర గ్రంథములను కొనుచుండవలయుననియు. అట్టి గ్రంథములతో సంచార గ్రంథాలయ పేటికల నమర్చి తన్మూలమున విద్యాభివృద్ధి చేయుచుండవలయుననియు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1925 IX 4

ప్రస్తుతము ఆంధ్రభాషాభివృద్ధికి కావలసిన గ్రంథములను రచించు గ్రంథకర్తలకు తగు సహాయము లేనందున భాషాభివృద్ధి తృప్తికరముగ జరుగుటలేదు. ఈకొరతను తీర్చుటకై ఆంధ్రదేశమందలి స్థానిక స్వపరిపాలక సంఘములన్నియు ప్రతిసంవత్సరము రు 6000 లకు తక్కువగాని సొమ్మును వెచ్చించి అప్పటప్పటికి ఆంధ్రభాషయందు ప్రచురింపబడు ఉత్తమగ్రంథములనుకొని వాటితో సంచార గ్రంథాలయములను అమర్చవలయుననియు, ఆమూలమున పల్లెటూళ్లలో విద్యాభివృద్ధిని ప్రోత్సహించవలయుననియు ఆంధ్రదేశమందలి స్థానిక సంఘములవారిని ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

1921 X 2

## దేవాదాయ, ధర్మాదాయ సంస్థలు :

ఆంధ్రదేశమునందున్న దేవాలయ ధర్మకర్తలను తమ దేవళములందును, తదితర ధర్మాదాయ కార్యనిర్వాహకులను తమతమ కార్యస్థానములయందును మంచి గ్రంథాలయములను, పఠనమందిరములను స్థాపించవలసినదిగ ఈ సభవారు కోరుచున్నారు.

1919 VI 6

## వివిధములు :

తరుణవయస్కులుమాత్రమే గాక సర్వజనులు విద్యాభివృద్ధి నొందించుకొనవలసిన వారలై యుండుటచేతనున్నూ, కేవల విద్యాలయములు మాత్రమే ఈ విద్యాభివృద్ధికి తగిన సాధనములుగాలేవు గనుక నున్నూ, విద్యాలయములతోబాటు పౌర గ్రంథాలయముల స్థాపించి పోషణజేయుట ప్రజలయొక్కయు ప్రభుత్వముయొక్కయు ముఖ్యవిధియై యున్నదిగావున

(అ) ప్రతి పురపాలక సంఘమువారును ఆయాపట్టణములందు పౌర గ్రంథాలయమును స్థాపించి పోషించవలెను.

(ఆ) 5000 ప్రజలకు మించిన జనసంఖ్యగల ప్రతిగ్రామమునందును గ్రంథాలయములుండి తీరవలయును. ఈ గ్రంథాలయములను ఆయాప్రాంతపు ప్రజలు స్థాపింపవలయును. స్థానికప్రజలు ఎంతసొమ్ము సంపాదించెదరో అంత మొత్తము స్థానిక స్వపరిపాలనా సంఘములును, మరియంత మొత్తము ప్రభుత్వము రాష్ట్రీయ ప్రభుత్వ ద్రవ్యమునుండి విరాళము లీయవలెను.

(ఇ) ఇతర గ్రామముల ప్రజల ఉపయోగముకొరకు స్థానిక స్వపరిపాలనా సంఘములు సంచార గ్రంథాలయ పేటికల విధానములు వెంటనే యవలంబించి జనసామాన్యమునందు విద్యాభివృద్ధికి కృషిసల్పవలెను.

1925 IX 3

# గ్రంథాలయములు

## ఆంధ్రవ్యక్తిత్వము, అభ్యుదయము :

ఆంధ్ర వాఙ్మయములోని ముద్రితాముద్రిత గ్రంథములను, సారస్వత సాధనములను సేకరించుటకుతోడు ఆంధ్రదేశ గ్రంథాలయములన్నియు ఆంధ్రుల ప్రత్యేక వ్యక్తిత్వమును, కళలను, ఆచారములను, పండుగలను, వర్ధంత్యుత్సవములను

ప్రోత్సాహపఱచు సాధనములను అవలంబించుటకును, తమకు సంబంధించిన రాత్రి పాఠశాలలు మున్నగువానియందు ఆంధ్రుల ప్రత్యేక వ్యక్తిత్వమును, కళారూపమును తెలుపు విద్యావిధానముల నవలంబించుటకును ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1917 IV 4
1918 V 3
1919 VI 10 (క)(చ)

శ్రీమదాంధ్ర గ్రంథాలయ మహోద్యమముయొక్క ప్రధాన ధర్మము సర్వమత సహనశీలమును, సకలోదార భావప్రపూర్ణములును, నిష్పాక్షికములు నగు సాధన మార్గము ననవరత మనుష్ఠించి నిఖిలాంధ్రాభ్యుదయము, నిజవ్యక్త్యుత్తేజకముగా పెంపొందింపజేయుటయని సిద్ధాంతీకరించుచు, ఇందు ముఖ్యముగా

౧. రసజ్ఞతను పెంపొందించుట అనగా సంగీత సాహిత్యాది సర్వకళా పోషకమున్నూ

౨. దీన జన పోషణమున్నూ

౩. నిరంతర ధర్మ వ్యాఖ్యానమున్నూ

౪. పరమార్థము ప్రసాదించు విశిష్ట గ్రంథదేవతారాధనమున్నూ ప్రధానలక్ష్యములని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

౫. ఏతల్లక్ష్యాత్మకమగు కార్య విధానమును ఈ దిగువ వివరింపబడిన రీతిని ప్రతి గ్రంథాలయము అనుష్ఠింపవలయునని ఈ సభవారు హెచ్చరించు చున్నారు.

క (౧) పురాతన గ్రంథములను సేకరించుట.

(౨) ఆయా గ్రామములలోని కళాభిజ్ఞుల వివరములను తెలుసుకొని వారిని సర్వవిధముల ప్రోత్సహించుట.

(౩) స్థానిక విశేషములను తగు పరిశోధనముచేసి శిథిలమైన పురాతన కళల చిహ్నములను పునరుద్ధరించుట.

(౪) యథార్థమైన స్థలపురాణముల నిర్ణయించుట

ఖ గ్రామమందు నిరాధారులగూర్చి వివరములను తెలుసుకొనియుంచి వారికి చేతిపనులు మొదలగునవి నేర్పియు, ఇతర విధములను వారికి జీవనోపాధుల కల్పించుట.

గ ప్రతి గ్రంథాలయమందును పరమార్థమును, సర్వప్రాణి సమత్వమును, ప్రజలయందు ప్రేమానుబంధమును ఉద్బోధింపగల గ్రంథములను అనగా వేద వేదాంగ పురాణేతిహాస ధర్మశాస్త్రాది

గ్రంథములను, కొరాను, బైబిలు, బౌద్ధ పిటకాది వేదములను ప్రధానముగా సంగ్రహించి, ఒక కథకుని నియమించి ఆయన మూల మున నిరంతర ధర్మవ్యాఖ్యానము గావించుట.

ఘ ప్రజాభ్యుదయమునకు, సమిష్టిన జరుగదగిన సర్వతోముఖమైన సేవా విధానమును, స్థానిక విశేషముల గ్రహించి నిరంతరము నిర్వహించుట. ఇందు వనభోజనములు జరుపుట, ప్రసిద్ధపురుషులకు స్వాగతాదుల నర్పించుట, ప్రసిద్ధ కళాభిజ్ఞుల సంభావించుట మున్నగు సమిష్టి కార్యములు నిర్వహింపదగును.

చ నిష్పాక్షికములును, సర్వప్రాణి సమత్వాది లక్ష్య సమన్వితములును నగు సేవా సంఘములను గ్రామములందు నెలకొల్పి సమిష్టి ప్రజా సేవ గావించుట.

ఛ ప్రతి గ్రంథాలయ వార్షిక నివేదికయందు పై విషయములనుగూర్చి చేసినపనిని విధ్యుక్తముగా తెలుపుచుండుట.

1923 VIII 3

## గ్రంథాలయ పత్రిక :

ఆంధ్రదేశమునందున్న గ్రంథాలయములన్నియు గ్రంథాలయముల అభివృద్ధి కొరకై ప్రకటింపబడుచున్న "గ్రంథాలయ సర్వస్వము"ను తెప్పించుకొన వలెనని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1916 III (త)

1917 IV (చ)

## గ్రంథాలయ భిక్షలు :

ప్రతి సంవత్సరము వినాయక చవితి నాడు భాండాగార సభ్యులెల్లరు ఆయా గ్రామములయందు భిక్షాటన మొనర్చి సమకూడిన సాహిత్య పరికరములను అచ్చటచ్చట ఉంచుకొనుటకును, ధనమునందు రెవ వంతును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు పంపవలయునని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1923 VIII 7

## గ్రామ లేక ప్రదేశ చరిత్రలు :

ప్రతి గ్రంథాలయమును ఆయా గ్రామము లేక ప్రదేశమునందలి జాతీయ జీవనమునకు లక్ష్యముగ నుండవలయును. అనగా దిగువ సూచించిన విధము ననుసరించి

ఆయాగ్రామము లేక ప్రదేశమునందలి ప్రతి విషయమును పరిశీలించి, ఆ విషయముల గ్రంథముగ వ్రాసి దానిని గ్రంథాలయమందుంచవలయును. పరిశీలనయందు లభించిన వస్తువులను గూడ గ్రంథాలయమునందుంచవలెను.

1. వివిధజాతులు, ఆయాజాతులయందు శాఖలు, వాని చరిత్రలను వ్రాయవలయును. ఈచరిత్రలయందు వారి వేషభాషలు, సాధన భజనలు, పాటలు, పద్దెములు, సామెతలు, హాస్యములు మొదలగునవియును, గృహోపకరణములు, వాని నామములు, శిల్పసంబంధమైన వస్తువులు మొదలగు విషయములును. పిల్లలాడే ఆటలు, పాటలు, పద్దెములు, కథలు మొదలగు విషయములు పరిశీలనాదృష్టితో నుండవలయును.
2. అచ్చట దొరకు పురాతన వస్తువులు అనగా శాసనములు, విగ్రహములు, శిల్పములుగల గృహోపకరణములు, నగలు, బొమ్మలు, భాస్కర్యములు, (రాతిబొమ్మలు) పంటధాన్యములు, వ్యవసాయ సంబంధమైన పనిముట్లు మొదలగు వానిని సేకరించి గ్రంథాలయమందుంచవలయును.
3. వ్యవసాయ సంబంధమైన చరిత్రను వ్రాయవలెను.

1919 VI 21

## తెలుగు పుస్తకాలు

ప్రస్తుతము పట్టణములందు వినోదార్థముగ నిర్మింపబడిన సంఘముల యందును, కళాశాలలయందును, పాఠశాలలయందును ఉన్నటువంటి గ్రంథాలయముల యందుండు గ్రంథములలో తుదకు వీసమువంతేని ఆంధ్రగ్రంథములు లేకుండుట కడుంగడు శోచనీయమనియు, వెంటనే ఆంధ్ర గ్రంథ సముదాయమును పెంపొందింతురని ఏతదధికారులను ఈ సభవారు కోరుచున్నారు.

1919 VI 5

## నిమ్నజాతుల అభివృద్ధి :

నిమ్నజాతుల విద్యాభిలాష గలవారలుగ జేయుటకు ఉపన్యాసములిచ్చుట, బొమ్మలజూపుట మొదలగు సాంఘికసేవ జేయుటకు వలయు సాధనముల సేకరించుటకును,

రాత్రి పాఠశాలలయందు పఠించు ఆదిమాంధ్ర విద్యార్థులకై గ్రంథాలయ స్వంత భవనమునగాని, సామీప్యమునగాని వారి కనువగు ప్రార్థనాలయములను గట్టించవలయుననియు, ఆంధ్ర దేశమునందుండు వివిధ గ్రంథాలయముల కార్యనిర్వాహకులను ఈ సభవారు కోరుచున్నారు.

1919 VI 10 (ట) (త)

## పండిత పోషణ :

కీర్తిశేషులైన పండిత కుటుంబములను బోషించుటకుగాను వారి జీవిత కాలములో ప్రచురింపబడిన గ్రంథములను గ్రంథాలయములవారు కొని వారిని పోషింపవలయుననియు, ప్రస్తుతము మిక్కిలి కష్టదశలోనుండు మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారియొక్కయు, పూండ్ల రామకృష్ణయ్యగారి యొక్కయు గ్రంథములను తెప్పించి యీ రెండు కుటుంబములను పోషింపవలయుననియు ఆంధ్ర గ్రంథాలయములవారిని ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

1919 VI 13

## లిఖిత గ్రంథములు, పత్రికలు :

ఆంధ్ర పరిశోధక మహామండలి పక్షమున పిఠాపురమునందు లిఖిత మాత్ర గ్రంథాలయమును స్థాపించి ఆంధ్రదేశ భాషావాఙ్మయ చరిత్రాభివృద్ధికి పాటుపడుచున్న ఎర్నగూడెం జమీందారులగు శ్రీ చెలికాని లచ్చారావుగారి నీసభవారు హృదయపూర్వకముగ నభినందించుచు, ఆంధ్రదేశమునందలి గ్రంథాలయములవారు తమ శక్తికొలది తమ చుట్టుప్రక్కల లిఖిత గ్రంథాదికముల సంపాదించి ఆ మండలి వారికి బంపి సాయపడుట అత్యవసరమని ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు.

1918 V 5

భాషాసాహిత్యాభివృద్ధికిని, అన్యోన్యాభిప్రాయముల వెలిబుచ్చి నూతన సమాచారముల గ్రహించుటకును, గ్రామచరిత్రలను వ్రాయుటకును వ్రాత గ్రంథములను ప్రతి గ్రంథాలయము వారును వెంటనే స్థాపించుట ఆవశ్యకముగాన, వానిని స్థాపింపవలసినదని గ్రంథాలయ సభ్యులను ఈ సభవారు కోరుచున్నారు.

1918: V 6

ఆంధ్ర సారస్వతాభివృద్ధికిని, ఆంధ్రుల భావి భాగ్యోదయమునకును పత్రికా నిర్వాహణము ముఖ్యమని యెంచి లిఖిత మాసపత్రిక స్థాపించి నడిపించుచున్న వాసంత గ్రంథాలయము, స్వసంఘము, బాల సరస్వతీ గ్రంథాలయము, రత్నకవి గ్రంథాలయముల వారి యాశయముల గొనియాడుచు ఆంధ్రదేశమునగల గ్రంథాలయములన్నియు అట్టి పత్రికల స్థాపించి నిర్వహింతురని కార్యనిర్వాహకులను ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

1919 VI 9

## వసంతోత్సవాలు :

ప్రతి గ్రంథాలయమువారును వసంతోత్సవమును జరుపవలయుననియు, అప్పుడు సర్వ కల్యాణము జరిగించి స్వగ్రామమందలి సాహిత్య కోవిదులను, శిల్ప నిపుణులను బహూకరించవలయుననియు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1923 VIII 8

## వార్షికోత్సవాలు, నివేదికలు :

ప్రతి గ్రంథాలయము తాము గత సంవత్సరమునందు చేసిన పనిని నివేదించుటకును, ముందు చేయబూనుకున్న పనినిగూర్చి ప్రస్తావన చేయుటకును, జనసామాన్యమునకు సంఘోద్దేశ్యములను తెలియజేయుటకునుగాను సంవత్సరోత్సవములను జరుపుటకును, ఆసమయమున జదువబడిన కార్యనివేదనమును ఆంధ్రదేశ సంఘ పక్షమున బ్రకటించు పత్రికలో ప్రకటించుటకుగాను కార్యదర్శులకు బంపుటకును గ్రంథాలయములవారి నీ సభవారు కోరుచున్నారు.

1915 II 6

1916 III 3 (ట)

ప్రతి గ్రంథాలయమునుండియు సంవత్సరమున కొకసారి అభివృద్ధి సూచన పట్టీని ఆంధ్రరాష్ట్రీయ గ్రంథాలయస్థాయి సంఘమువారికి పంపుచుండవలయునని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1923 VIII 14

## స్త్రీ, బాలశాఖలు :

బరోడా గ్రంథాలయములయందు నిర్వహింపబడు బాల శాఖలు ప్రశంసాపాత్రములనియు, అట్టి బాలశాఖలను ప్రతి గ్రంథాలయమువారు స్థాపించి బాలురకు గ్రంథాలయములు, క్రీడాస్థానములుగ నుండునటుల జేయవలయుననియు,

స్త్రీల కుపయుక్తములగు గ్రంథముల సమకూర్చి వారి గృహములకు పుస్తకముల నంపి స్త్రీ విద్యకు తోడ్పడునటుల జేయువలయుననియు ఆంధ్రదేశమునందలి వివిధ గ్రంథాలయముల నిర్వాహకులను ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

1919 VI 8

# వయోజన విద్య

మనదేశమున ప్రస్తుతమమలులో నున్న విద్యావిధానమందు ఈడుముదిరిన వారికి విద్యాభివృద్ధి చేయదగిన సాధనము లేకపోవుటవల్ల దేశమున కనేక విధముల నష్టదాయకముగ నున్నది. కావున ఈలోపమును నివారణచేయుట క్రిందివిధానమును వెంటనే అమలులోకి తెచ్చుటకు ఆంధ్రదేశీయుల నీసభవారు హెచ్చరించుచున్నారు.

(అ) జనసామాన్యమునకు గావలసిన అన్ని విషయములందును సులభముగ బోధపడగల కరపత్రములను, చిరుపొత్తములను ప్రచురించుట.

(ఆ) తాత్కాలిక పాఠశాలలను పెట్టి తన్మూలమున ఈడుముదిరిన వారికి విద్యాభివృద్ధి చేసికొనదగిన సాధనముల నేర్పరచుట.

(ఇ) సంచారోపన్యాసకుల నేర్పరచి వారి మూలమున ప్రజాసామాన్యమునకు జ్ఞానాభివృద్ధి జేయుట.

(ఈ) మ్యాజికులాంతరు మొదలగు యంత్ర సహాయము మూలమున ప్రజాసామాన్యమునకు విద్యాభివృద్ధి జేయుట.

1925 IX 5

ప్రస్తుతము మనదేశమందు సామాన్యముగా పాఠశాలలుమాత్రమే విద్యాభివృద్ధికి సాధనములుగ నున్నవి. ఇందువలన కోమల వయస్సుమీరిన వారికి విద్యాభివృద్ధి కానేరదు కనుకను, అట్టి వారికి విద్యాభివృద్ధి సాధనములు విరివిగా కల్పించిననేగాని దేశకళ్యాణము చేకూరదుగనుకనున్నూ, ఈ క్రింది సాధనములను, తదనుగుణ్యమైన ఇతర సాధనములను వెంటనే అవలంబించి తత్ఫలసిద్ధినొందుటకు ఆంధ్రులను ఈ సభవారు హెచ్చరించు చున్నారు.

(అ) ప్రస్తుతము స్థాపింపబడియున్న గ్రంథాలయములు సర్వతోముఖముగా నభివృద్ధి నొందునట్లు చేయుట,

(ఆ) గ్రంథాలయములు లేనిచోట్ల గ్రంథాలయములు స్థాపించుట.

(ఇ) సంచార గ్రంథాలయ పేటికల మూలమున చిన్న పల్లెలయందు విద్యాభివృద్ధికి తోడ్పడుట.

(ఈ) ఇప్పటి అవసరములకు తగినట్లు సంస్కరించి పురాణపఠనము, హరికథలు, ఉపన్యాసములు ప్రతి గ్రామమునందును జరుపుట.

(ఉ) తాత్కాలిక పాఠశాలలను స్థాపించుట.

1926 X 1

# గ్రంథాలయ సంఘము

## ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము :

ఆంధ్రదేశమునందంతటను భాండాగారములను నెలకొల్పుటకును, నెల కొల్పినవానిని పెంపొందించుటకును తగిన ఉత్సాహమునిచ్చుటకు "ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘ" మను పేరున శాశ్వత సంఘము నేర్పాటుచేయుటకీసభ వారు తీర్మానించుచున్నారు.

ఈ సంఘమునకు ఆనరబుల్ రావుబహద్దరు మోచర్ల రామచంద్రరావు గారు అగ్రాసనాధిపతిగను, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, సూరి వెంకటనరసింహంగారు ఉపాగ్రసనాధిపతులుగను, నాళము కృష్ణారావుగారు, అయ్యంకి వెంకట రమణయ్యగారు కార్యదర్శులుగను ఏర్పరుపబడిరి.

1914 I 4

పైనచెప్పిన సంఘ పక్షమున పనిచేయుటకై వేతనమునిచ్చి సంచార కార్యదర్శి నేర్పాటు చేయుటకును, పత్రికను ప్రకటించుటకును ఈ సంఘమువారు తీర్మానించుచున్నారు.

1914 I 5

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు బెజవాడ రామమోహన ధర్మగ్రంథాలయమును కేంద్రగ్రంథాలయముగా జేయుచు, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారిచే నిర్ణయించంపబడిన నిబంధనలననుసరించి దీనిని నిర్వహించుట కీసభవారు తీర్మానించుచున్నారు.

1918 V 4

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమును, బాలభటోద్యమమును ఆంధ్రదేశమందు వ్యాప్తము జేయుటకై సేవకసంఘము నొకదానిని నిర్మాణముచేసి అందు తగినవారి సేవకులనుగా జేర్చుకొనుటకును, అవసరమైనచో ఆసేవకులకు వేతనములిచ్చుటకును, ఇందుకు కావలసిన ద్రవ్యమును సంపాదించుటకును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యనిర్వాహక సంఘమునకు ఈ సభవారధికారము నిచ్చుచున్నారు.

1920 VII 6

ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించిన పూర్వ రచితమైన మూలగ్రంథములను, శాసనములను, ఆంధ్రభాషయందు ప్రకాశింపజేయుటకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ పక్షమున పరిశోధక పత్రిక నొకటి ప్రకటించుట అవసరమని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1923 VIII 5

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ పక్షమున గ్రంథమాల నొకదానిని స్థాపించి ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికి అవసరమగు గ్రంథముల నన్నిటిని సులభమగు వెలలకు ప్రకటించవలెనని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1923 VIII 6

## గ్రంథ విభజన, పుస్తకముల జాబితాలు :

ఆంధ్ర వాఙ్మయమునందుండు గ్రంథముల నన్నిటిని బహు సులభముగ వివిధ భాగములుగ భాగించి పుస్తకముల పట్టీల తయారుచేయుటకును, గ్రంథాలయముల గ్రంథములకు అంకెలువేసి బీరువాలయందుంచుటకును సులభమగు పద్ధతిని వెదకుటకును ఆంధ్ర గ్రంథాలయ స్థాయి సంఘమువారి నీ సభవారు కోరుచున్నారు.

ప్రస్తుతము ఆంధ్ర వాఙ్మయ సూచిక నొకదానిని తయారుచేయుచున్నట్టి శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారికి, ఏతదుద్యమమునకు తగు సహాయ్యము చేయవలయునని ఈ సభవారు కోరుచున్నారు.

1919 VI 11

ఆంధ్ర వాఙ్మయమునందు ముద్రితిమైనట్టియు, అముద్రితమైనట్టియు గ్రంథములను, శాసనములను శాస్త్రసమ్మతమగు విధానము ననుసరించి వర్గీకరణముచేసి పట్టీలు తయారుచేయుటకును, చదువరికి కావలసిన గ్రంథమును వెంటనే సులభముగ లభింపజేసుకొనుటకు తగినట్లు చిహ్నములను గ్రంథముల కిచ్చుటకును గ్రంథ విభజన విధానము నొకదానిని నిరూపణచేసి ప్రచురించుటకు ఆంధ్ర గ్రంథాలయ సంఘము వారిని ఈ సభవారు కోరుచున్నారు.

1923 VIII 12

## పతకములు :

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునందు కృషిచేయు సభ్యులకును, సేవకులకును చిహ్నముగా నుండుటకు సరస్వతీ విగ్రహముతోగూడిన పతకములను తయారుచేయించి సభ్యులకును, సేవకులకును పంచిపెట్టుటకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యనిర్వాహక సంఘమువారి కీ సభవారు అధికారమిచ్చుచున్నారు.

1920 VII 7

## పైసా ఫండు :

గ్రంథాలయములను స్థాపించుటకుగాను పైసాఫండు నేర్పాటు చేయవలసినదనియు, ఆ ఫండు సంవత్సరాదినాడు వసూలు చేయవలసినదనియు, వసూలు మొత్తం నిర్ణీతమైన బ్యాంకులోనుంచి తగినంత మొత్తము చేరిన వెనుక వినియోగించవలసినదనియు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1919 VI 29

## మహాసభలు :

ఆంధ్రదేశ గ్రంథాలయసభ ప్రతి సంవత్సరము ఆంధ్ర మహాజన సభ, రాష్ట్రీయసభలతోకాక ప్రత్యేకస్థానమున జరుగుచుండవలయునని ఈసభవారు తీర్మానించుచున్నారు.

1920 VII 1

ఈ సంవత్సరపు డిసెంబరు నెలలో కాకినాడ పట్టణమున అఖిలభారత గ్రంథాలయ ప్రతినిధుల మహాసభను, ఆంధ్రసభ్యతను వ్యక్తీకరించు సర్వతోముఖ ప్రదర్శన సహితముగ సమావేశపరచుటకు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1923 VIII 4

## ముద్రణాలయము :

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమాభివృద్ధికై నిరుపమానమగు దీక్షతోడను త్యాగముతోడను పనిచేయుచున్న శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారిపేరిట నొక ముద్రణాలయమును స్థాపించి వారికిచ్చునటుల తీర్మానించుచున్నారు.

(టంగుటూరి ప్రకాశం, బెల్లంకొండ రాఘవరావుగార్లు చెరి రు. 500 లును, అయ్యదేవర కాళేశ్వరరావుగారు, గోనుగుంట్ల వేంకట సుబ్రహ్మణ్యంగారు, బిక్కిని వెంకటరత్నంగార్లు చెరి రు. 250 లును, అద్దేపల్లి కుమారస్వామి శ్రేష్ఠిగారు రు 100 లును అప్పటికప్పుడే వాగ్దానము చేసిరి.)

1919 VI 14

## శిక్షాలయము :

భరతఖండమున గ్రంథములను జ్ఞానవ్యాపనమున కెట్లు వినియోగించిరో ప్రామాణికముగ కనుగొని ప్రకృత గ్రంథాలయముల సంస్కరించు తగు పండితుల నిర్ణయించి తగు పద్ధతులమీద నొక శిక్షాలయము నెలకొల్పుటకు ప్రయత్నములు జరుపవలయునని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1919 VI 5

# దాతలు

బెజవాడ రామమోహన ధర్మ పుస్తక భాండాగారాలయ నిర్మాణమునకగు వ్యయమును స్వయముగా భరించుచున్న శ్రీ నడిమి తిరువూరు జమీందారుగారగు శ్రీ రాజా వెల్లంకి చినవెంకట్రామారావు బహద్దరు జమీందారు వారియొక్క యౌదార్యమునకీసభవారు శ్రీవారిని కొనియాడుచు ఆంధ్రదేశమునందలి ఇతర జమీందారులును, తదితర ధనవంతులును భాండాగారోద్యమమునకు తగు సహాయమొనర్చుటకు ప్రార్థించుచున్నారు.

1914 I 3

తెనాలితాలూకా దుగ్గిరాల భాషాభిలాషిణీ సంఘమునకు భవనమును నిర్మించుచున్న పునాదిపాటి గ్రామ వాస్తవ్యులును, ఉదారస్వభావులును నగు యార్లగడ్డ పేర్నీడు చౌదరిగారి కీసభవారు వందనములర్పించుచున్నారు.

1915 II 9

రాజమహేంద్రవరములోని గౌతమీ గ్రంథాలయ భవన నిర్మాణముకొఱకు రు 6000 లు విరాళము నొసంగిన మ. రా. శ్రీ కంచుమర్తి వెంకటరామచంద్రరావు గారికిని, బెజవాడ శ్రీ రామమోహన ధర్మగ్రంథాలయమునకు రెండవ అంతస్థును కట్టించుచున్న కాశా సూర్యనారాయణరావుగారికిని ఈ సభవారు కృతజ్ఞత తెలుపుచున్నారు.

1923 VIII 10

గ్రంథాలయములకై విశేషముగ సహాయము చేయుచున్న కాశా సూర్యనారాయణరావు, బొడ్డపాటి వెంకటప్పయ్య, ఎల్లె పెద్ది జానకిరామయ్య, రాటంరెడ్డి ఆదినారాయణరెడ్డి, కుప్పా శ్రీ రామశర్మ, కొత్తా వెంకయ్యగారికుమారుడు సంగయ్య, అనుచూరి సుబ్బారాయుడు, పాణకా సుబ్బరామిరెడ్డి, శ్రీ జగన్నాథపాడిఖుడం, సోంభొట్ల వెంకయ్య, పొన్నలూరి రాఘవయ్య గార్లకు ఈ సభవారు వందనములాచరించుచున్నారు. ఈ విధముగనే ద్రవ్యాధికులందరును గ్రంథాలయములకు విరివిగా సహాయము చేయుదురని ప్రార్థించుచున్నారు.

1916 III 4

**జిల్లాకలెక్టరు :**

చిత్తూరు జిల్లా కలెక్టరుగారయిన గెల్లెటు దొరగారు నారాయణవరం శ్రీ హనుమద్గ్రంథాలయమునకు రెండు వందల రూప్యములను డిస్క్రీషనరీ గ్రాంటులో నుండి ఇచ్చినందులకీ సభవారు వందనముల నర్పించుచున్నారు.

1919 VI 16

## గ్రంథ ప్రకాశకులు :

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారు, వడ్డాది సుబ్బారాయుడు గారు, కాశీనాధుని నాగేశ్వరరావుగారు, మద్దుల వేంకట చిన్నంరాజాశ్రేష్ఠిగారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకును, పంద్రెండు మండలములయం దేర్పడు పంద్రెండు మండల గ్రంథాలయ సంఘములకును తమ గ్రంథముల నన్నిటిని ఇచ్చుటకు వాగ్దానముచేసి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమున కిదివఱకే తమ గ్రంథములనిచ్చి నందులకు ఈ సభవారు తమ కృతజ్ఞతను దెలుపుచున్నారు.

# వి వి ధ ము లు

## పుస్తకాల అట్టలపై పేర్లు :

ఆంధ్ర గ్రంథముల అట్టలపై ఆంగ్లమున గ్రంథనామముల ముద్రించుట వలన నెవ్వరికి మేలు గలుగకున్నను కని వినరాని యాభాసపు ఉచ్చారణల కెడమిచ్చుటయేగాక ఆంగ్ల విద్యానిపుణునకేని శీఘ్రముగ నర్థము గాకుండుటయు, ఆంగ్ల భాషాజ్ఞానము లేని జనసామాన్యమునకు బొత్తిగ నర్థముగాకుండుటయు జూడ అట్టి ముద్రణములు విపరీతములును, మన భాషకును, మనకును న్యూనత దెచ్చుచున్నవియు గనుక ఇకముందు ప్రచురింపబడు గ్రంథములపై తెనుంగుననే గ్రంథనామముల ముద్రించుడని ప్రకాశకులను ఈ సభవారు కోరుచున్నారు.

1919 VI 12

## రాజభక్తి, దేశభక్తి :

ప్రపంచ కల్యాణముకొరకును, ధర్మసంస్థాపనకొరకును మన ఏలికలిప్పుడు జరుపుచున్న మహాసంగ్రామమున, వారి కచిరకాలమున జయము పరమేశ్వరుడు చేకూర్చుగాతయని ఈ సభవారు భగవంతుని ప్రార్థించుచున్నారు.

1918 V 1

(1917 లో జరిగిన 4 వ ఆం. దే. గ్రం. మహాసభలోను ఈరకమైన తీర్మానమొకటి చేయబడినది)

యావద్విశ్వమునకు ధర్మోపదేశముగావించ నవతరించిన శ్రీగాంధిమహాత్ములవారు భారతభూమికొనర్చిన మహదుపకృతుల ప్రశంసించుచు, అచిరకాలములో వారికి చెఱతప్పించి తిరిగి ధర్మపీఠమునధిష్ఠింప పరమేశ్వరుడు అనుగ్రహించుగాతయని ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

1923 VIII 2

అఖిలభారత దేశీయ సామాన్యభాషగా వ్యవహరింపబడుచున్నట్టిన్నీ, రాజకీయ వ్యవహారములయం దవసరమైనట్టిన్నీ హిందీభాషను త్వరలో ప్రచారమునకు తెచ్చుటకు ఆంధ్రదేశ గ్రంథాలయ సోదరులను ఈ సభవారు ప్రోత్సహించుచున్నారు.

1923 VIII 13

సర్వజన సమాదరణీయమైన ఖద్దరుచేత గ్రంథాలయములయం దుంచబడు గ్రంథములను బైండు కట్టింపవలయునని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

1923 VIII 15

## వైవాహిక దక్షిణలు:

ఆంధ్రదేశమునం దిప్పుడు ఆచారముగ వివాహాది శుభకార్యములు మొదలగువానియందు వసూలుచేయుచుండు త్రిమతస్థుల దక్షిణలుగాక, ఆంధ్రముపేర మఱియొక దక్షిణను ఇవ్వవలసినదని ఆంధ్రుల నందరిని ఈ సభవారు కోరుచున్నారు. దానిని వసూలు చేయుటకు తగిన సహాయము చేయవలయునని పురోహితులను ప్రార్థించుచున్నారు.

1919 VI 19

# సప్తమ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## ప్రత్యేక తీర్మానములు

### ప్రభుత్వ విరాళము:

౧. గ్రంథాలయోద్యమ ప్రచారమునకై రాష్ట్రీయ ద్రవ్యమునుండి ఖర్చు పెట్టుటకుగాను ప్రారంభించి ఈ సంవత్సరమునకు 20 వేల రూపాయలు గ్రాంటును ఇచ్చినందులకు స్థానిక ప్రభుత్వమువారికి ఈ సభవారు వందనము లర్పించుచు దొరతనము వారొసంగెడి ధనము ప్రతి సంవత్సరము హెచ్చించునదిగా ఉండవలెననియు, ఇచ్చు ద్రవ్యము ప్రతి సంవత్సరము ఈ ఉద్యమ ప్రచారమునకై చాలినంతగా నుండవలెననియు, ఈ ద్రవ్యమును ఈ ఉద్యమ ప్రచారమునందు పనిచేయుచున్న అధికారుల సంఘముగా నేర్పరచి వారి అంగీకారముతో పంచిపెట్టించ వలెననియు, ఈసభవారు దొరతనమువారిని ప్రార్థించుచున్నారు.

౨. మొదటి తీర్మానములో చెప్పబడిన అనధికార సంఘ మేర్పడుటకు కాలవ్యవధి అగునెడల దొరతనము వారీ సంవత్సరము దయచేసిన సొమ్మును హెచ్చించుటకుగాను సభ వారీ విధానమును సూచించుచున్నారు.

(అ) ఈ సంవత్సరపు గ్రాంటునంతను సంచార గ్రంథాలయముల నేర్పరచి వానిని నడపుటయందు వెచ్చించుటకు ఈ సభవారు ప్రార్థించుచు, అట్టి యుద్యమము మాదిరికి ప్రతిజిల్లాయందును కొన్ని తాలూకాలలో ఈ ద్రవ్యముతో ప్రారంభించవలయుననియు ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

(ఆ) అట్లు చేయక స్థాయి గ్రంథాలయముల కొరకై ఈ సొమ్మును వెచ్చించుటయె యుచితమని దొరతనము వా రంగీకరించుచో ఈ ద్రవ్యమునంతను పుస్తకములు కొనుటకై గ్రంథాలయముల కిచ్చుట యుచితమని దొరతనము వారికి ఈ సభవారు నివేదించు చున్నారు.

(ఇ) ఈ సొమ్మును పంచిపెట్టుటయందు కేవలము స్థానికముగనే పనిచేయునవి గాక ఆయా ప్రాంతము లందుండు గ్రంథాలయములకు సహకారముగా ఇదివరలో నుండునట్టిగాని, అట్టిపనులు చేయుటకు పూనుకొనునట్టిగాని కేంద్ర గ్రంథాలయముల కెక్కువ సహాయమును, తదితర గ్రంథాలయములకు తక్కువ సహాయమును చేయుటకును ఈ సభవారు దొరతనము వారిని ప్రార్థించుచున్నారు.

(ఈ) ఇదివరలో ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమ ప్రచారమును గురించి దొరతనము వారి సహాయము లేకయే తృప్తికరమగు అభివృద్ధి జరిగియుండుటచే దొరతనము వారి గ్రాంటునుండి అధమపక్షము 2/3 వంతును ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు ఇచ్చుటకు ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

గ్రంథాలయ సహకారము :

3. ఏక ప్రాంతమందున్న గ్రంథాలయములు అన్యోన్య సహాయ కరములుగా నుండుట ఉద్యమముయొక్క ప్రాశస్త్యమునకును, సౌష్టవమునకును, ఆర్థిక స్థితికిని మిక్కిలి సహాయభూతముగా నుండును గనుక ప్రతిజిల్లాకును కేంద్ర గ్రంథాలయము లేర్పడి ఆయా ప్రాంతములయందు గ్రంథాలయోద్యమ ప్రచారపు పనిని నిర్వహింపవలయునని ఈ సభవారు ఆంధ్రలోకమున కుద్బోధించుచున్నారు.

[ వీనిని ఆయా శీర్షికలక్రింద మొదట చేర్చుట మరచినందున ఇక్కడ ప్రత్యేకముగ నిచ్చుట తటస్థించినది. — సంపాదకుడు.]

అనుబంధము : ౧

# మహాసభల సంగ్రహ వృత్తాంతము

## [ ౧ ]

ప్రథమ ఆంధ్ర దేశ గ్రంథ భాండాగార ప్రతినిధుల మహాసభ 1914 వ సం॥ ఏప్రిల్ 10 వ తేదీన బెజవాడలోని రామమోహన ధర్మ పుస్తక భాండాగారమువారి యాదరణక్రింద బెజవాడయందలి ఎడ్వర్డు పుర భవనమందు జరుపబడినది. ఆంధ్ర దేశమునందలి పలు ప్రాంతములనుండి 60 గ్రంథాలయముల పక్షమున 200 మంది ప్రతినిధులు హాజరైరి. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగా రధ్యక్షత వహించిరి. ఆహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీ సూరి వెంకట నరసింహశాస్త్రిగారు స్వాగతోపన్యాసమును చదివిరి. అధ్యక్షోపన్యాసానంతరం దిగువ రచయితలు తమతమ రచనలను సభలో చదివిరి.

| రచయిత | రచన |
|---|---|
| 1. శ్రీ ముట్నూరి వేంకట సుబ్బారాయుడు | గ్రంథాలయములు (పద్యములు) సార్వజనిక పుస్తకాలయములు వానిని నిర్మించు విధానము. |
| 2. శ్రీ ఇ. సుబ్బుకృష్ణయ్య | పుస్తక భాండాగారములు, వానిని వృద్ధిచేయవలసిన మార్గము |
| 3. శ్రీ దంటు సుబ్బావధాని | పుస్తకములు – పుస్తకాలయములు |
| 4. ,, వెలిదండ శ్రీనివాసరావు | గ్రంథ విభజనము |
| 5. ,, శంకర వేంకట్రామయ్య | గ్రంథ భాండాగారములు – నిమ్నజాతుల విద్యావిషయమై అవి చేయవలసిన పని. |
| 6. శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి | గ్రంథ భాండాగారములు |
| 7. ,, న్యాయపతి నారాయణమూర్తి | భాండాగారాభివృద్ధికి సాధనములు |
| 8. ,, కొడాలి శివరామకృష్ణారావు | ఆంధ్రగ్రంథములు విరివిగ వ్యాపించుటెట్లు ? |

మహాసభ తేదీ మొదలు ఒక సంవత్సరములోపల ఆంధ్ర దేశమున నేర్పడు ప్రతి గ్రంథాలయానికి మద్రాసులోని విజ్ఞాన చంద్రికా గ్రంథమండలివారు అయిదేసి రూపాయలు విలువగల తమ ప్రచురణ లను ఉచితముగ నొసంగుదుమని తంతి మూలమున సభవారికి తెలియ పరచినారు. సభలో మొత్తం 6 తీర్మానాలు చేయబడినవి. శ్రీ మోచర్ల రామచంద్రరావు పంతులుగారు గ్రంథాలయోద్యమమును గురించి ఆంగ్ల భాషయందు ప్రసంగించిరి. తిరువూరు జమీందారు గారుకూడ ఉపన్యసించిరి.

## [ ౨ ]

రెండవ ఆంధ్ర దేశ గ్రంథ భాండాగార ప్రతినిధుల మహాసభ రాజమహేంద్రవరము నందలి శ్రీ వీరేశలింగ, వసురాయ పుస్తక భాండాగారముల ఆహ్వానము ననుసరించి 1915వ సం॥ మే 9, 10 తేదీలలో శ్రీ వీరేశలింగముగారి హైస్కూలు భవనమున సమావేశ మైనది. 120 మంది ప్రతినిధులతో చేరి మొత్తం 300 మంది సభ నలంకరించిరి. శ్రీ పానుగంటి రామారాయనింగా రధ్యక్షతవహించిరి. సన్మాన సంఘాధ్యక్షులగు శ్రీ బారు నరసింహారావుగారు స్వాగతో పన్యాసమును చదివిరి. ఆనాడు శాంతినికేతన విద్యార్థిగనుండిన శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు సభకు వ్రాసిపంపిన పద్య సందే శము సభ్యులకెంతో ఆనందమును ప్రసాదించినది. శ్రీ నాళం కృష్ణా రావుగారు ఆం. దే. గ్రంథ భాండాగార సంఘపు 1914-15వ సం॥పు వృత్తాంతమును చదివిరి.

10 వ తేదీ సమావేశములో దిగువ వక్తలు ఆయా విషయ ములనుగురించి ప్రసంగించిరి.

| వక్త | ఉపన్యాస విషయము |
|---|---|
| 1. శ్రీ నూరి వెంకటనరసింహశాస్త్రి | ఆంధ్రదేశ గ్రంథ భాండాగారోద్యమము |
| 2. శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యము | సంచార పుస్తక భాండాగారములు |

3. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య — గ్రంథాలయమన నేమి? అవి చేయదగిన పని యేమి ?
4. శ్రీ వల్లూరు సూర్యనారాయణరావు — దేశభాషాప్రాముఖ్యత
5. శ్రీ సత్తెనపల్లి హనుమంతరావు — ప్రారంభవిద్యకు గ్రంథ భాండాగారము లెట్లు తోడ్పడును ?
6. శ్రీ తేకుమళ్ళ వెంకాజీరావు — గ్రంథపాలకుని ధర్మములు
7. శ్రీ చింతపంటి వేంకటరమణయ్య }
8. శ్రీ తిత్తి బలరామయ్య } — గ్రంథ భాండాగారము లెట్లుండవలెను?
9. శ్రీ కే. జోగారావు — " నా యనుభవములు "

గ్రంథ విభజనమునుగూర్చి శ్రీ వెలిదండ శ్రీనివాసరావుగారు పంపిన వ్యాసము సభలో చదువబడినది. మొత్తం 10 తీర్మానములు సభవారి ఆమోదమును పొందినవి.

[ ౩ ]

మూడవ ఆంధ్ర దేశ గ్రంథాలయప్రతినిధుల మహాసభ నెల్లూరులోని శ్రీ లక్ష్మీనర్సారెడ్డి పురమందిరమున 1916 వ సం॥ మే 12, 13 తేదీలలో సమావేశమైనది. 120 మంది ప్రతినిధులును, 100 మంది ప్రేక్షకులును సభనలంకరించిరి. శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగా రధ్యక్షత వహించిరి. ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీ మైదవోలు చెంగయ్య పంతులుగారు ప్రతినిధులకు స్వాగతము చెప్పిరి. 5 ముఖ్య తీర్మానములు చేయబడినవి. పలువురు వక్తలుపన్యసించిరి. కట్టకడపట చిత్తూరు నివాసులు శ్రీ బి. నరసింహారావుగారు, కృష్ణాజిల్లా రొయ్యూరు నివాసులు శ్రీ చిగురుపాటి సుబ్బారావుగారు గ్రంథాలయ నిర్వహణావశ్యకతనుగురించి ప్రసంగించిరి. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు సంఘపు గత సం॥ నివేదికను చదివిరి.

[ ౪ ]

నాల్గవ ఆంధ్ర దేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ 1917 వ సం॥ మేనెల 6, 7 తేదీలలో గంజాం జిల్లాలోని బారువ గ్రామమున సమావేశమైనది. శ్రీ భూపతిరాజు వేంకటపతిరాజుగారు అధ్య

క్షులు. శ్రీ అన్నెప పరశురామదాసు పాత్రోగారు ఆహ్వాన సంఘా ధ్యక్షులు. సభకు 300 మంది ప్రతినిధులు, 200 మంది ప్రేక్షకులు వచ్చిరి. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు ఆం. దే. గ్రం. సంఘపు 1916-17 సం॥ నివేదికను చదివిరి. తొలిసారిగ గ్రంథాలయ ప్రదర్శనము మహాసభతోపాటు ఏర్పాటుచేయబడినది.

రెండవరోజు కార్యక్రమంలో వివిధ జిల్లా, తాలూకా సంఘముల వృత్తాంతములు ఆయా కార్యకర్తలు చదివిరి. తర్వాత దిగువ వక్తలు ఆయా విషయములనుగురించి ప్రసంగించిరి.

| వక్త | ఉపన్యాస విషయములు |
|---|---|
| 1. శ్రీ చింతపెంట వెంకటరమణయ్య | గ్రంథాలయములవలన గలుగు దేశాభివృద్ధి |
| 2. శ్రీ న్యాయపతి నారాయణమూర్తి | గ్రంథాలయముల సాంఘికసేవ |
| 3. శ్రీ పురాణం సూరిశాస్త్రి | గ్రంథ విభజన |
| 4. శ్రీ కుప్పా శ్రీరామశర్మ | గ్రంథాలయముల అభివృద్ధి |
| 5. శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రి | గ్రంథాలయోద్యమము |
| 6. శ్రీ మహంతు రాఘవానందదాసు | విద్యాభివృద్ధి (ఓఢ్రభాషలో) |

కట్టకడపట 9 తీర్మానములు చర్చకువచ్చి సభవారి ఆమోదమును పొందినవి.

[ ౫ ]

ఐదవ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ విశాఖ పట్టణములోని పురమందిరమున 1918జూన్ 22,23,24 తేదీలలోజరిగినది. శ్రీరాజా కొచ్చర్లకోట వేంకట కృష్ణారావు బహద్దరు జమీందారు గారధ్యక్షత వహించిరి. శ్రీ సెట్టి లక్ష్మీనరసింహంగారు స్వాగత పద్యములను, శ్రీ కోన వేంకటరాయశర్మగారు ప్రబోధ పద్యములను చదివిన పిమ్మట ఆహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీ విక్రమదేవ వర్మగారు ప్రతినిధులకు స్వాగత మొసంగుచు విపులముగ నుపన్యసించిరి. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు 1917-18 సం॥పు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ నివేదికను చదివిరి. మొత్తం 10 తీర్మానములు

చేయబడినవి. దిగువ ఉపన్యాసములు, వ్యాసములు ఆయా పెద్దల చేతను, కార్యకర్తలచేతను సభవారికి వినిపింపబడినవి.

1. గ్రంథాలయోద్యమము - ఆంధ్రుల సిద్ధాంతము
—శ్రీ సూరి వేంకటనరసింహ శాస్త్రి
2. గ్రంథాలయ మహాసభలు - అవి చేయవలసిన పనులు
—శ్రీ వెలిదండ శ్రీనివాసరావు
3. గోదావరీమండల గ్రంథాలయోద్యమము
—శ్రీ చింతపెంట వెంకటరమణయ్య
4. నారాయణవరం గ్రంథాలయ వృత్తాంతము
—శ్రీ సి. వి. రంగం శెట్టి
5. గోదావరీ మండల గ్రంథాలయసభ వృత్తాంతము
—శ్రీ అవసరాల వెంకటరెడ్డి పంతులు
6. గుంటూరుమండల గ్రంథాలయోద్యమము
—శ్రీ బెల్లంకొండ రాఘవరావు
7. కృష్ణాజిల్లా భీమవరం తాలూకా గ్రంథాలయోద్యమము
—శ్రీ నిడమర్తి లక్ష్మీనారాయణ
8. గంజాం మండల గ్రంథాలయోద్యమము
—శ్రీ తిత్తి బలరామయ్య
9. శారదానంద నిలయము, విశాఖపట్నము వృత్తాంతము
10. ఏలూరు హిందూ యువజన సంఘ చరిత్ర
—శ్రీ గ్రంధి రామమూర్తి
11. బాపట్ల తాలూకా గ్రంథాలయసంఘ చరిత్ర
—శ్రీ. కోన వేంకటరాయశర్మ
12. గ్రంథాలయోద్యమము
—శ్రీ దేవులపల్లి స్వామిశాస్త్రి
13. పురాణ పఠనము
—శ్రీ. కే. రంగనాయకులు

సభాంతమున శ్రీ దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు దేశీయులను భారతసేవసేయుమని హెచ్చరించుచును, భారతీదేవిని మన పల్లె సీమలలో నివసించవలసినదిగ ప్రార్థించుచును ప్రబోధకరములగు పద్యములను చదివిరి.

[ ౬ ]

ఆరవ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ 1919 వ సం॥ నవంబరు 16వ తేదీ మధ్యాహ్నం చెన్నపట్టణములోని గోఖలే మహలున శ్రీ సూరి వేంకటనరసింహశాస్త్రిగారి అధ్యక్షతక్రింద సమావేశమైనది. వివిధ జిల్లాలనుండి 300 మంది ప్రతినిధులు సభకు వచ్చియుండిరి. బరోడా, మైసూరు, కలకత్తా మున్నగు స్థలములనుండి అఖిల భారత గ్రంథాలయ మహాసభకు వచ్చిన పెద్దలుకూడ ఈ సభలో పాల్గొనిరి. అష్టావధాని శ్రీ మైనంపాటి హనుమంతరావుగారు స్వాగతమాలికను చదివిన పిమ్మట ఆహ్వాన సంఘాధ్యక్షులగు సామి వెంకటాచలం శ్రేష్ఠిగారు ప్రతినిధుల నాహ్వానించుచు ఉపన్యసించిరి. శ్రీ గోనుగుంట్ల సుబ్రహ్మణ్యముగారు పెద్దల సందేశపత్రములను, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు 1918-19 సం॥పు అం. దే. గ్రం. సంఘ వృత్తాంతమును చదివిరి. సభలో 23 తీర్మానములు చేయబడినవి.

[ ౭ ]

ఏడవ ఆంధ్ర గ్రంథాలయసభ కర్నూలు జిల్లాలోని మహానంది పుణ్యక్షేత్రమున 1920 వ సం॥ మేనెల 18 వ తేదీ ఉదయం సమావేశమైనది. ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ శరభారెడ్డిగారు అనివార్యములవలన సభకు రానందున శ్రీ తురగా పూర్ణచంద్రరావుగారు శ్రీ రెడ్డిగారి స్వాగతోపన్యాసమును చదివిరి. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు అధ్యక్షత వహించిరి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారి గత సం॥ నివేదికను శ్రీ సూరి వేంకటనరసింహశాస్త్రిగారు సభవారికి చదివి వినిపించిరి. ఈ సభలో మొత్తం 10 తీర్మానములు చేయబడినవి.

[ ౮ ]

ఎనిమిదవ ఆధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ గుంటూరుజిల్లా పమిడిపాడు గ్రామమున 1923 మే 1, 2, 3 తేదీలలో మహావైభవముగ జరిగినది. శ్రీ బెల్లంకొండ రాఘవరావుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగ నుండుటయేగాక సభకు వచ్చిన ప్రతినిధులకు స్వయముగ ఆతిథ్యమునిచ్చిరి. 35 గ్రంథాలయములనుండి వచ్చిన 75 మంది ప్రతినిధులలో 10 మంది స్త్రీలుండిరి. మహాసభాధ్యక్షులు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు. వీరు తమ ఉపన్యాసమును ఆశువుగ చెప్పినారు. నిర్మాణయుతమగు 19 తీర్మానములు సభలో చర్చింపబడి ఆమోదమును పొందినవి. దీనితోపాటు శ్రీ కుప్పా శ్రీరామశర్మగారి అధ్యక్షతను గుంటూరుమండల గ్రంథాలయ మహాసభకూడ జరిగినది.

[ ౯ ]

తొమ్మిదవ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ కృష్ణాజిల్లాకు ముఖ్యపట్టణమగు బందరు ఫురమున 1928 వ సం॥ అక్టోబరు 23 వ తేదీన సమావేశమైనది. శ్రీ పురాణం సూరిశాస్త్రి గారు ప్రతినిధుల నాహ్వానించిరి. శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారు అధ్యక్షత వహించిరి. ఈసభవారు 9 తీర్మానములను చేసిరి.

[ ౧౦ ]

పదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ 1926 వ సం॥ జూన్ నెల 27 వ తేదీన గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలోని పెదచెఱుకూరు గ్రామములో జరిగినది. శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారధ్యక్షత వహించిరి. శ్రీ చంద్రమౌళి చిదంబరరావు పంతులుగారు స్వాగతోపన్యాసమును చేసిరి. ముచ్చటగ మూడు తీర్మానములు ప్రధానముగ చేయబడినవి. శ్రీ కోన వేంకటరాయ శర్మగారు దీని విజయమున కన్నివిధముల తోడుపడినారు.

అనుబంధము : ౨

# ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

## నిబంధనలు

[ ఈ సంఘముయొక్క సభ 1918 వ సం॥ జూలై నెల 14 వ తేదీ మధ్యాహ్నం 4 గంటలకు బెజవాడ రామమోహన ధర్మ గ్రంథాలయమునందు జరిగినది. ఈ సభలో దిగువ నిబంధనలు చేయబడినవి. ఇవి సంఘమునకు మొదటిసారిగ ఏర్పడిన నిబంధనలు.]

### నిబంధనలు

"ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము, బెజవాడ" అని దీని నామము. దీనియొక్క కేంద్ర గ్రంథాలయముపేరు "బెజవాడ రామమోహన ధర్మ గ్రంథాలయము".

### ఉద్దేశములు

౧. ఆంధ్రదేశమున ధర్మగ్రంథాలయోద్యమము నభివృద్ధిచేయుట. ఈ క్రింద వివరింపబడిన సాధనములవలనను, అందుకు విరుద్ధముకాని ఇతర సాధనముల వలనను ఈ యుద్యమాభివృద్ధి గావింపబడును.

(క) బెజవాడ పట్టణమున ఆంధ్రదేశమునకంతకును, కేంద్ర గ్రంథాలయమును నిర్వహించుట.

(చ) ఆంధ్రదేశమున స్థాపింపబడునట్టియు, తదితర దేశములయందు ఆంధ్రులచే స్థాపింపబడునట్టియు ధర్మగ్రంథాలయ సంఘములను ఈ సంఘమునకు చేర్చుకొనుట, అట్టి ధర్మగ్రంథాలయములను స్థాపించుట.

(ట) "మాజిక్కులాంతరులు", "సినిమెటోగ్రాపులు", "బయసోకుపులు" మున్నగు యంత్రసామగ్రిని సేకరించి తన్మూలమున జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధిని కలుగజేయుట.

(త) సంచార గ్రంథాలయములను నెలకొల్పి వానిని ఆంధ్రదేశమునందంతటను పంపి తన్మూలమున జ్ఞానాభివృద్ధిని జేయుట.

౨. ఆంధ్రదేశమునందును, తదితర దేశములయందును శక్తికొలదిని ధర్మగ్రంథాల యోద్యమమును గూర్చిన జ్ఞానమును వ్యాపింపజేయుట.

3. ఆంధ్ర సారస్వతమునందలి గ్రంథములన్నిటికిని ప్రత్యేక ప్రాముఖ్యతతో, ప్రపంచమందలి గ్రంథరాజములన్నింటికిని పనికివచ్చెడి గ్రంథ విభజన పట్టికను తయారుజేసి ప్రచురించుట.

౪. జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధి నొందించుటకుగాను జ్ఞానాభివృద్ధి కరములగు గ్రంథములు, కరపత్రములు మొదలగు వానిని ప్రచురించుట.

౫. జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధికి సాధనములుగానుండు జాతీయసంస్థాపనలను, కాలానుసరణములగునట్లు ఉద్ధరించుట.

౬. ఆంధ్ర జాతీయ వికాసమునకును, ఆంధ్ర వ్యక్తి వికాసమునకును సాధనభూతములగు సారస్వతము, విద్య, చిత్రకళలు, చరిత్రపరిశోధన, మానవసేవమున్నగు పరమార్థ కార్యములను చేయుట.

౭. ఈ సంఘముయొక్క ఉద్దేశములను కలిగిన ఇతర ప్రతిష్ఠాపనలతో కలిసి పని చేయుట, అట్టివానితో సంబంధమును కలుగజేసికొనుట.

## కార్యనిర్వహణము

౮. దీనియొక్క కార్యనిర్వహణము ఈ క్రింది సంఘములవలన జరుపబడును.

(క) సామాన్యసంఘము
(చ) కార్యనిర్వాహక సంఘము
(ట) సేవక సంఘము

## సామాన్యసంఘము

౯. ఈ క్రిందివారు ఈ సంఘమున సభ్యులుగ నుందురు.

(క) రాజ పోషకులు
(చ) ప్రధాన పోషకులు
(ట) పోషకులు
(త) శాశ్వత సభ్యులు
(ప) సామాన్య సభ్యులు (ఒకటి, రెండు, మూడు తరగతులవారు)
(గ) సేవకులు
(జ) జిల్లా గ్రంథాలయ సంఘములయొక్క కార్యదర్శులలో ఒకరును, అగ్రాసనాధిపతియును తమ పదవులనుబట్టియే ఇతర చందాలను చెల్లింపవలసిన యవసరములేకనే ఈసంఘమునందు సభ్యులుగనుందురు.

(డ) ఈ సంఘమునకు చేరు ఉపసంఘములనుండి ప్రతి జిల్లాకును ఆ జిల్లా యందలి సంఘములచే ఎన్నుకొనబడు ఒక ప్రతినిధి.

(ఢ) ఈ సంఘమునందు ఏర్పడునట్టి ఉపశాఖలయొక్క అధ్యక్షులు, ఉపాధ్యక్షులు, కార్యదర్శులు.

౧౦. రాజపోషకులు: ఈ సంఘమునకుగాని, దీనికి చేరిన మరియే యితర ప్రతిష్ఠాపనకుగాని, రు. 2500 లు గాని, అంతకు ఎక్కువసొమ్ము నుగాని విరాళముగనొసంగువారు.

౧౧. ప్రధాన పోషకులు: ఈ సంఘమునకుగాని, దీనికిచేరిన మరియే యితర ప్రతిష్ఠాపనకుగాని రు 1000 లు మొదలు రు 2500 ల వరకు విరాళమునిచ్చెడివారు.

౧౨. పోషకులు: ఈ సంఘమునకు ప్రతి వత్సరమును రు. 100 ల విరాళమిచ్చెడివారు.

౧౩. శాశ్వతసభ్యులు: ఈ సంఘముయొక్క మూల ధనమునకు రు 200 ల విరాళమిచ్చెడివారు.

౧౪. సామాన్యసభ్యులు: సంవత్సరమునకు రు 12 లకు తక్కువగాని చందానిచ్చెడివారు మొదటితరగతి సామాన్యసభ్యులు. సంవత్సరమునకు రు ౬ లకు తక్కువగాని చందానిచ్చెడివారు రెండవతరగతి సామాన్య సభ్యులు. సంవత్సరమునకు రు 3 లకు తక్కువగాని చందా నిచ్చెడివారు మూడవ తరగతి సభ్యులు.

పదునెనిమిది వత్సరములు వయస్సుగల పురుషుడుగాని, స్త్రీగాని ఏ జాతివారైనను ఈ సంఘముయొక్క ఉద్దేశములయందు అభిమానమును దెలుపుచు, ఇద్దరు సభ్యుల సిఫారసుతో దరఖాస్తునంపిన మీదట, కార్యనిర్వాహక సంఘమువారి యనుమతికి లోబడి సభ్యుడుగ జేరవచ్చును. కార్యనిర్వాహక సంఘమువారి అనుమతి ఇచ్చుటకు పూర్వము కార్యదర్శి ఆ సంఘమువారి అనుమతికి లోబడి అట్టి దరఖాస్తును తాత్కాలికముగ అంగీకరింపవచ్చును. కార్యనిర్వాహక సంఘమువారు ఏ దరఖాస్తునైన కారణమును దెలుపకయే నిరాకరింప వచ్చును.

౧౫. సేవకులు: సేవకసంఘ సభ్యులలో నిద్దరిచే పేర్కొనబడి, ఆసంఘ సభ్యులలో ముప్పాతికమందిచే అంగీకరింపబడి, కార్యనిర్వాహక సంఘముచే అంగీకరింపబడినవారు సేవకులు. అట్టివారు తాము కనీసము పది సంవత్సరముల కాలము ఈ సంఘ నిబంధనలకు లోబడి ఈ సంఘముయొక్క కార్యములను నెరవేర్చెదమని ప్రమాణపత్రిక నియ్యవలెను.

సామాన్య సభ్యులుతప్ప మిగిలిన తరగతుల సభ్యులు చందాల నియ్యవలసిన యవసరము లేదు.

ఉద్యోగులు: ఈ సంఘమునకు ఒక అధ్యక్షుడు, ముగ్గురకు తక్కువ కాని ఉపాధ్యక్షులును ఉందురు. ఉపాధ్యక్షులలో ఇద్దరు బెజవాడ వాస్తవ్యులయి యుండవలెను.

మరియు ఒక కార్యదర్శి, ముగ్గురు సహాయ కార్యదర్శులును నుందురు. కార్యదర్శిని సేవకసంఘ సభ్యులలోనుండి ఎన్నుకొనవలెను. సహాయ కార్యదర్శులలో ఇద్దరు బెజవాడ వాస్తవ్యులై యుండవలెను. మండల గ్రంథాలయములయొక్క అధ్యక్షులందరును తమ పదవినిబట్టియే ఈ సంఘమునకు ఉపాధ్యక్షులగుదురు.

౧౬. సభలు: ఈ సంఘముయొక్క సభలకు మొత్తము సభ్యులలో మూడవవంతును, ఆసంఖ్య 20 కి మించినప్పుడు 20 మంది సభ్యులును "కోరం" అయియున్నారు. ఈ సంఘసభ నియమిత కాలమునకు ఒక గంట లోపుగా "కోరం" రానియెడల, అప్పుడు హాజరు ఉన్న సభ్యులు సభాసమావేశమునకు మరియొక దినమును నిర్ణయింపవలెను. అట్లు రెండవపారి నిర్ణయింపబడిన సభకు "కోరం" వచ్చినను, రాకపోయినను సభాకార్యములను నిర్వహింపవచ్చును.

ఈ సంఘమువారు సంవత్సరమునకు అధమపక్షమున ఒకసారి యైన సమావేశమగుచుండవలెను. అట్టి సమావేశమునందు హోదాదార్లను ఎన్నుకొనుట, కార్యనిర్వాహక సంఘమును ఎన్నుకొనుట, ఆ సంఘమువారు తయారుచేసిన ఆదాయ వ్యయముల మదింపును అంగీకరించుట మొదలగునవి జరుగవలెను. క్రొత్త ఎన్నికలు జరుగువరకును వెనుకటి హోదాదార్లే ఉద్యోగములను నిర్వహింపవలెను.

ఈ సంఘ సమావేశములయందు గమనింపవలసిన నిబంధనలను, హోదాదార్లలో సంవత్సరముమధ్య గలిగిన ఖాలీలను పూర్తిచేయుట, ఏయే హోదాదార్లు ఏయే విధులను నిర్వర్తింపవలెననుట, ఈ సంఘమునకు దీనికి చేరు సంఘములకు గల సంబంధములు, ఇంకను అవసరములగు ఇతర సంగతులను గూర్చిన నిబంధనలను సామాన్య సంఘమువారు అవసరమునుబట్టి చేయుచుండవలెను.

## కార్యనిర్వాహక సంఘము

౧౭. ఈ సంఘమునకు ౧౫ మందికి తక్కువకానట్టి సభ్యులుండ వలెను. ఈ క్రింది రీతిని ఈ సంఘమందలి సభ్యులు నిర్ణయింపబడుదురు.

(క) సేవక సంఘమునందు అయిదుగురు సభ్యులుగాని, అంతకు తక్కువగాని ఉన్నప్పుడు వారందరును, అంతకు ఎక్కువమంది ఉన్నప్పుడు ఆ సంఘముచే ఎన్నుకొనబడిన అయిదుగురు సభ్యులును.

(చ) తమ పదవులనుబట్టి సామాన్య సంఘములో సభ్యులుగానుండు మండల గ్రంథాలయముల కార్యదర్శులలో ఒకరు, అధ్యక్షుడును.

(ట) తమ పదవులనుబట్టి అంతశ్శాఖాసంఘముల కార్యదర్శులు, అధ్యక్షులు, ఉపాధ్యక్షులు.

(త) జిల్లాకు ఒక్కరు చొ॥ ఉపసంఘములచే ఎన్నుకొనబడిన ప్రతినిధులు.

(ప) సామాన్య సంఘముయొక్క కార్యదర్శి, సహాయ కార్యదర్శులు ఈ సంఘమునకు కార్యదర్శి, సహాయ కార్యదర్శులుగ నుందురు.

(గ) సేవకసంఘమునుండి ఈ సంఘమునకు ఒక అగ్రాసనాధిపతి, గ్రంథ భాండాగారి సామాన్యసంఘముచే ఎన్నుకొనబడవలెను.

(జ) సామాన్య సంఘముయొక్క అగ్రాసనాధిపతి, ఉపాగ్రాసనాధిపతులు, కార్యదర్శి, సహాయ కార్యదర్శులు, గ్రంథ భాండాగారి.

(డ) మిగిలిన సభ్యులను సామాన్య సంఘమువారు ఎన్నుకొనవలెను. తమ పదవులనుబట్టి కార్యనిర్వాహక సంఘమునందు సభ్యులుగ ఏర్పడునట్టివారి సంఖ్యకు రెట్టింపు ఇతరసభ్యులు ఈ సంఘమునందుండవలెను. సేవక సంఘమునుండి పైన చెప్పబడిన ప్రకారము ఎన్నుకొనబడి కార్యనిర్వాహక సంఘమునకువచ్చు ఐదుగురు సభ్యులవరకు మాత్రము వారు తమ పదవినిబట్టి వచ్చిన సభ్యులుగ నెన్నబడుదురు. బెజవాడ వాస్తవ్యులగు సేవక సంఘ సభ్యులతోగూడ ఈ సంఘమునందు తొమ్మండుగురకు తక్కువకాని సభ్యులు బెజవాడ వాస్తవ్యులుండవలెను.

శాఖాసంఘములను స్థాపించుట, చేర్చుకొనుట, చేర్చుకొనిన వానిని తీసివేయుట, సామాన్యసంఘ సభలను పిలుచుట, ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ నేర్పాటుజేయుట, అంతశ్శాఖాసంఘములను ఏర్పరచుట, సంవత్సరపు ఆదాయవ్యయముల మదింపును తయారుచేయుట, ఆస్తిని సంపాదించుట, ఆదాయవ్యయములను పరిపాలించుట, అప్పులను చేయుట, తీర్చుట, ఈ సంఘముయొక్క ఉద్దేశముల నాచరణయందు

బెట్టుటకు ఆవశ్యకములై యున్న ఇతర కార్యములను జేయుటయును ఈ సంఘముయొక్క విధులై యున్నవి.

ఈ సంఘముయొక్క సభలకు "కోరం" నలుగురు సభ్యులు. ఈ సంఘంయొక్క సభ 3 మాసములకొకసారి జరుగవలెను. ఈ సంఘ సభ్యులెవరైన ముగ్గురు ఈ సంఘముయొక్క సభను జరుపవలసినదని అవసరమును దెలుపుచు, కార్యదర్శిని వ్రాతమూలముగ కోరిన మీదట, కార్యదర్శి సభను పిలువవలెను. సామాన్య సభలకును, కార్యనిర్వాహక సభలకును కనీసము వారం దినములు ముందుగా ఆహ్వానపత్రికలను సభ్యులకు పంపవలెను.

సామాన్యసభలను సమావేశము చేయవలసినదని పదిమందికి తక్కువగాని సభ్యులు కార్యదర్శికి తెలిపినమీదట అట్లు సభను కార్యదర్శి సమావేశము చేయవలెను.

## సేవక సంఘము

౧౮. సేవకులందరును గలసి ఈ సంఘమునందు సభ్యులుగనుందురు. సామాన్య సంఘముయొక్క కార్యదర్శియే ఈ సంఘమునకు గూడ కార్యదర్శిగ నుండును.

ఈ సంఘమునకు ఈ క్రింది హక్కు బాధ్యతలుండును.

(క) అయిదుగురకు మించకుండా కార్యనిర్వాహక సభకు సభ్యులనెన్నుకొనుట.
(చ) ఆదాయ వ్యయముల లెక్కలను అమలులోనికి దెచ్చుట.
(ట) సంఘమునకు చేరిన శాఖా సంఘములను పరిశీలించుట, క్రొత్తవానిని స్థాపించుట, గ్రంథాలయోద్యమమును వ్యాప్తముగావించుట, ఈ సంఘముయొక్క ఉద్దేశములను ఆచరణయందు బెట్టుటకు కావలసిన సకలమైన కార్యములను నిర్వర్తించుట.
(త) సంవత్సర కార్యవివరణమును తయారుచేసి కార్యనిర్వాహక సంఘమువారి యంగీకారముతో సామాన్య సంఘమునకు విదితపరచుట.
(ప) కేంద్ర గ్రంథాలయమునకు గ్రంథముల చేర్చుట
(గ) ఈ కార్యములను ఆచరణలోనికి దెచ్చుటకు కావలసిన నిబంధనలను జేసికొనుట.

౧౯. సామాన్య సంఘముయొక్క అగ్రాసనాధిపతి: ఈయన సామాన్యసంఘ సభలయందు అధ్యక్షత వహించుట, కార్యదర్శి ద్వారాగాగాని, అతనికి తెలియ

జేసిన నెలదినములలోగా సభను పిలువనియెడల స్వయముగాగాని సామాన్య సభను కూర్చుట, సంఘముయొక్క ఆస్తిని, ఇతర హోదాదారులు చేయు పనులను, దీనికి సంబంధించిన సంఘములను తనిఖీ చేయుట.

౨౦. సామాన్య సంఘముయొక్క ఉపాగ్రాసనాధిపతులు: అగ్రాసనాధిపతి హాజరు లేనప్పుడు సామాన్య సంఘ సభలయందు అధ్యక్షత వహించుట, సంఘము యొక్క ఆస్తిని, ఇతర హోదాదారులు చేయు పనులను, దీనికి సంబంధించిన సంఘములను తనిఖీ చేయుట.

౨౧. కార్యదర్శి: సంఘముతో సంబంధించిన యావత్తు దస్తావేజులను, లెక్కలను, స్వాధీనము నందుంచుకొనుట, సంఘముయొక్క లెక్కలనుంచుట, కార్య నిర్వాహక సంఘముయొక్క తీర్మానములకు లోబడి సంఘ ద్రవ్యమును వినియోగించుట, సేవక సంఘము యొక్కయు, కార్యనిర్వాహక సంఘము యొక్కయు, సామాన్య సంఘము యొక్కయు సభలను సమావేశము జేయుట, సేవక సంఘము వారి తీర్మానములకు లోబడి నౌకరుల నేర్పరచుట, తీసివేయుట, సంఘముతో కోర్టునకు సంబంధించినట్టియు, దస్తావేజులకు సంబంధించినట్టియు అన్ని వ్యవహారములను సంఘ పక్షమున నిర్వహించుట. ఈసంఘము వారేర్పరచునట్టి అంతశ్శాఖా సంఘములయందును, ఈ సంఘమునకు చేరునట్టి యావత్తు సంఘములయందును ఈ సంఘముయొక్క కార్యదర్శి తన పదవిని బట్టియే సభ్యుడుగ నుండును.

౨౨. సహాయ కార్యదర్శులు: అన్ని వ్యవహారములయందును కార్యదర్శికి సహాయము చేయుట, కార్యదర్శి గ్రామమునందు లేనప్పుడు ఆయన హక్కులను గలిగియుండుట.

౨౩. గ్రంథ భాండాగారి: కేంద్రగ్రంథాలయమునందలి గ్రంథములను స్వాధీనము నందుంచుకొని సరియైన స్థితియందుంచుట, బాలశాఖను నిర్వహించుట.

౨౪. కార్యనిర్వాహక సంఘముయొక్క అగ్రాసనాధిపతి: కార్యనిర్వాహక సంఘ సభలకెల్ల వీరగ్రాసనాధిపత్యమును వహించెదరు. కార్యనిర్వాహక సంఘముతో గూర్చిన అన్ని పనులు సక్రమముగా జరుగునట్లు తనిఖీ చేయవలయును.

౨౫. కార్యనిర్వాహక సంఘముయొక్క ఉపాగ్రాసనాధిపతులు: అధ్యక్షులు లేని సమయమునందు కార్యనిర్వాహక సభలయందు అధ్యక్షత వహించుట, మిగిలిన పనులయందు అగ్రాసనాధిపతికి సహాయముచేయుట, అధ్యక్షుడు గ్రామమునందు లేనప్పుడు ఆయనయొక్క హక్కులను గలిగియుండుట.

౨౬. లెక్కలు: తెలుగు సంవత్సరాదితో ఈ సంఘముయొక్క లెక్కలు ప్రారంభమగును. ఈ సంఘముయొక్క లెక్కలను ప్రతి సంవత్సరమును కార్యనిర్వాహక సంఘముచే నిర్ణయింపబడు తనిఖీదారునిచే తనిఖీ చేయించవలెను.

౨౭. అంతశ్శాఖా సంఘములు: కార్యనిర్వాహక సంఘమువారిచే అంతశ్శాఖా సంఘములు ఏర్పాటు చేయబడవలెను. అట్టి శాఖలకు ఒక అధ్యక్షుడు, ఇద్దరు ఉపాధ్యక్షులు, ఒక కార్యదర్శి ఉండవలయును. స్థాపించునపుడు మొదటి సంవత్సరమునకు హోదాదార్లను కార్యనిర్వాహక సంఘము వారే ఎన్నుకొనవలయును. పిమ్మట ప్రతి సంవత్సరమును సామాన్య సంఘ సభయందు సంఘముయొక్క మిగిలిన హోదాదార్లతోగూడ ఈ అంతశ్శాఖా సంఘముల హోదాదార్లను ఎన్నుకొనవలయును. అంతశ్శాఖా సంఘముల యొక్క హోదాదార్లు అందరును తమపదవులను బట్టి కార్యనిర్వాహక సభయందును, సామాన్య సభయందును సభ్యులగుదురు. అంతశ్శాఖలు ప్రత్యేకముగ కార్యనిర్వాహకసభచే చేయబడు నిబంధనల ననుసరించి పనిచేయవలయును.

౨౮. ఈ క్రింది అంతశ్శాఖలను వెంటనే స్థాపించడమయినది.

౧. సేవాశాఖ

౨. సారస్వత శాఖ

౨౯. ఇతర సంఘములు ఈ సంఘమునకు ఉపసంఘములుగ జేరవచ్చును. అట్టి ఉపసంఘములు సంవత్సరమునకు ఒకరూపాయి చందా నియ్యవలెను. ఈ ఉపసంఘములు ఒక జిల్లాలో నుండునవి యన్నియు కలసి ఒక ప్రతినిధి నెన్నుకొని కార్యనిర్వాహక సంఘమునకు సభ్యునిగ పంపవచ్చును.

30. గ్రామ గ్రంథాలయములు, పఠన మందిరములు: గ్రామగ్రంథాలయములుగాని, పఠన మందిరములుగాని ఈ సంఘమునకు ఉపసంఘములుగిగాక సభ్యులుగ గూడ చేరవచ్చును. సామాన్య సభ్యులు ఇచ్చు చందాలనే ఇయ్యవలయును. వారి నిబంధనలే వీరికిని చెల్లును. ఈ సంఘము వారిచే పంపబడు ఒక ప్రతినిధి సామాన్య సంఘమునందు సభ్యుడుగ నుండును. అయితే అట్టి ప్రతినిధి సంవత్సరము పొడుగునను ఒక్కడేయై యుండవలెను.

3౧. తాలూకా గ్రంథాలయ సంఘములు: ప్రతి తాలూకాకును గ్రామ గ్రంథాలయములపైన తాలూకా సంఘము లుండును. ఈ తాలూకా సంఘములుకూడ గ్రామ గ్రంథాలయములవలెనే ఈ సంఘమునకు శాఖలుగ చేరవచ్చును.

3౨. మండల గ్రంథాలయ సంఘములు: సామాన్య సభ్యులకున్న నిబంధనలే ఈ సంఘములకుకూడ చెల్లును. అయితే మండల సంఘముయొక్క కార్యదర్శి ఈ సంఘముయొక్క సామాన్య కార్యనిర్వాహక సభలయందు సభ్యుడుగాను, మండల సంఘముయొక్క అధ్యక్షుడు ఈ సంఘమునకు ఉపాధ్యక్షుడుగను ఉండును.

## ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ

౩౩. ప్రతి వత్సరమును సామాన్యముగా మే నెలయందు ఆంధ్రదేశము నందున్న మండలము లన్నింటియందును సంవత్సరమున కొక్కొక్క మండలము నందు ఈ సభను జరుపుచుండవలయును. ఈ సభ జరుగు స్థలమునందే దీనిని జరుపుటకు ఆహ్వాన సంఘ మేర్పాటుగావలయును. సభయొక్క అగ్రాసనాధిపతిని ఆహ్వాన సంఘమువారే ఏర్పరుపవలెను. కాని అట్టి అగ్రాసనాధిపతిని నిర్ణయించునపుడు ఈ సంఘమువారితో ఆలోచించవలెను. ప్రతినిధులవలన వసూలగు రుసుమును ఈ సంఘముయొక్క ఖర్చులకుగాను ఇయ్యవలయును. అట్టి రుసుము రు ౧ కి మించియుండగూడదు.

## సేవకులు

౩౪. ఈ క్రిందివారిని సేవకులుగా అంగీకరించడ మయినది.

౧. అయ్యంకి వెంకటరమణయ్యగారు
౨. సూరి వేంకట నరసింహశాస్త్రిగారు
౩. చట్టి నరసింహారావుగారు
౪. నిడమర్తి లక్ష్మీనారాయణగారు
౫. గాడేపల్లి సూర్యనారాయణ శర్మగారు
౬. కొడాలి శివరామకృష్ణారావుగారు
౭. పులిపాక వెంకటరామారావుగారు
౮. గోపరాజు బ్రహ్మనందంగారు

అనుబంధము: ౩

# ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

## ప్రధాన నిర్వాహకులు

1914 వ సం. ఏప్రిల్ 10 వ తేదీన బెజవాడలో శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి అధ్యక్షతను ప్రథమ ఆంధ్రదేశ గ్రంథ భాండాగార ప్రతినిధుల మహాసభ జరిగినది. ఈ మహాసభవారి 4 వ తీర్మానము ననుసరించి "ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘము" ఏర్పాటైనది. ఈసంఘమునకు శ్రీ మోచర్ల రామచంద్రరావుగా రగ్రాసనాధిపతిగ మొత్తం 26 మంది సభ్యులతో కార్యనిర్వాహక సంఘ మేర్పాటు చేయబడినది. నాటినుండి 11 వ ఆం. దే. గ్రం. మహాసభ జరిగిన 1926 నవంబరు 30 వ తేదీ లోపల ఆయా సంవత్సరములలో సంఘముయొక్క వివిధోద్యోగముల కెన్నుకొన బడినవారి వివరములను మా యెరుకకు వచ్చినవరకు దిగువ ఇచ్చుచున్నాము.

ఆనంద (1914-15) సం. — ఎన్నికతేది 1914 ఏప్రిల్ 10
రాక్షస (1915-16) సం. — ,, 1915 మే 10

అగ్రాసనాధిపతి: శ్రీ మోచర్ల రామచంద్రరావుగారు
ఉపాగ్రాసనాధిపతులు: శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు
,, నూరి వేంకట నరసింహముగారు
కార్యదర్శులు: శ్రీ నాళము కృష్ణారావుగారు
,, అయ్యంకి వెంకటరమణయ్యగారు

నళ (1916-17) సం. — ఎన్నికతేది 1916 మే 18
పింగళ (1917-18) సం. — ,, 1917 మే 7

అగ్రాసనాధిపతి: శ్రీ మోచర్ల రామచంద్రరావుగారు
ఉపాగ్రాసనాధిపతులు: ,, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు
,, నూరి వేంకట నరసింహంగారు
,, వెమలి సుబ్బారావుగారు

| | |
|---|---|
| కార్యదర్శి: | శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు |
| సహాయకార్యదర్శులు: | ,, పురాణం సూరిశాస్త్రిలుగారు |
| | ,, అవసరాల వేంకటరెడ్డిపంతులుగారు |
| | *,, అద్దంకి సత్యనారాయణశర్మగారు |

## కాళయుక్తి (1918-19)సం. ఎన్నికతేది 1918 జులై 14

1918 వ సం॥ జూన్ 22, 23 తేదీలలో విశాఖపట్నంలోకూడిన అయిదవ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభవారు సంఘముపేరు నికపైన "ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము"గ వ్యవహరించుటకు నిర్ణయించి దీనికి క్రిందటి సం.లోనున్న ఉద్యోగులు, ఇతర సభ్యులు, జిల్లా తాలూకా సంఘముల ఉద్యోగులు, దివాకర్ల తిరుపతి శాస్త్రిలుగారు, ప్రభల లక్ష్మీనరసింహంగారు సభ్యులుగ ఏర్పడి దీనికి నిబంధనల నేర్పరచి వీని నమలు జరుపునట్లు తీర్మానించినారు.

ఈ తీర్మానము ననుసరించి 1918 జులై 14 వ తేదీ బెజవాడలోని రామమోహన ధర్మగ్రంథాలయ భవనమున జరిగిన సంఘ సమావేశంలో నిబంధన లేర్పాటు చేయబడి** దిగువ ఉద్యోగులెన్నుకో బడినారు.

| | |
|---|---|
| అధ్యక్షులు: | శ్రీ మోచర్ల రామచంద్రరావుగారు |
| ఉపాధ్యాసనాధిపతులు: | ,, చెలికాని లచ్చారావుగారు |
| | ,, బొడ్డపాటి వెంకటప్పయ్యగారు |
| | ,, సి. రాజగోపాలాచారిగారు |
| కార్యనిర్వాహక సంఘ అగ్రాసనాధిపతి: | శ్రీ నూరి వేంకట నరసింహశాస్త్రిగారు |
| కార్యదర్శి: | ,, అయ్యంకి వెంకటరమణయ్యగారు |
| సహాయ కార్యదర్శులు: | శ్రీ శిష్టా వేంకటకృష్ణయ్యగారు |
| | ,, దంటు సుబ్బావధానులుగారు |
| | ,, చట్టి నరసింహారావుగారు |
| గ్రంథ భాండాగారి: | శ్రీ గోపరాజు బ్రహ్మానందంగారు |

---

* వీరు 1917 - 18 వ సం.నకు ఎన్నికైనారు.

** వీటిని అనుబంధము: ౨ లో చూడవచ్చును.

సిద్ధార్థి (1919-20) సం. ఎన్నికతేది 1919 నవంబరు 16

రౌద్ర (1920-21) సం. ,, 1920 మే 18

అధ్యక్షులు: శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు
ఉపాధ్యక్షులు: ,, టంగుటూరి ప్రకాశంగారు
,, సామి వెంకటాచలం శ్రేష్ఠిగారు
,, కొండా వెంకటప్పయ్యాగారు
,, ఆర్. వి. రామకృష్ణంరాజుగారు
,, చల్లా గురుస్వామిశ్రేష్ఠిగారు
,, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
కార్యనిర్వాహక సంఘాధ్యక్షులు:
శ్రీ నూరి వేంకట నరసింహశాస్త్రిగారు
కార్యదర్శి: శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యాగారు
సహాయకార్యదర్శి: ,, చట్టి నరసింహారావుగారు

దుర్మతి (1921-22) సం.

దుందుభి (1922-23) సం.

వివరాలు లభించలేదు.

రుధిరోద్గారి (1923-24) సం. ఎన్నికతేది 1923 మే 3

అధ్యక్షులు: శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యాగారు
కా. ని. వర్గ అధ్యక్షులు: ,, నూరి వెంకటనరసింహశాస్త్రిగారు
ఉపాధ్యక్షులు: ,, చెలికాని లచ్చారావుగారు
కార్యదర్శులు: ,, అయ్యంకి వెంకటరమణయ్యాగారు
,, బెల్లంకొండ రాఘవరావుగారు
,, పాణంగిపల్లి వరహాలుగారు

రక్తాక్షి (1924-25) సం.

వివరాలు లభించలేదు.

క్రోధన (1925-26) సం. ఎన్నికతేది 1925 అక్టోబరు 28

వివరాలు లభించలేదు.

అనుబంధము: ౪

# ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ ప్రచురణలు

సంఘ స్థాపన నాటి నుండి 1926 వ సంవత్సరాంతము లోపల సంఘపక్షమున వెలువడిన ప్రచురణల వివరములు:—

## 1. సార్వజనిక పుస్తకాలయములు

1914 ⅛ రాయల్ 12 పుటలు వెల రు. 0-2-0

విద్యయొక్క గౌరవము, కళాశాలల విద్యయొక్క అసమగ్రత, సార్వజనిక పుస్తకాలయ స్వభావము - నిర్మాణము - వ్యాప్తి, గ్రంథాలయాధ్యక్షుల అర్హతలు-విధులు, దాతృత్వము మున్నగు విషయము లిందు చర్చించ బడినవి. మొదట, చివర స. ర. శ. కవి, దంటు సుబ్బావధానులగార్ల ప్రబోధ పద్యములుగలవు.

## 2. ఆంధ్రదేశ గ్రంథాలయ చరిత్ర. ౧౯౧౪ వ సం.ర వృత్తాంతము

1915 ¼ క్రౌను 4+102+4 పుటలు

దీనిలో ప్రథమ ఆంధ్రదేశ గ్రంథభాండాగార ప్రతినిధుల మహాసభ ఉపన్యాసములు, నివేదిక, దేశవ్యాప్తంగానున్న 163 ఆంధ్రగ్రంథాలయాల సంగ్రహ వృత్తాంతము, అనుబంధములో ఆం.దే. గ్రం. భాండాగార సంఘపు మొదటి 5 కార్య నిర్వాహక సభల తీర్మానములు ఉన్నవి.

## 3. ఆంధ్ర దేశ గ్రంథాలయ చరిత్ర. ౧౯౧౫ సం.ర వృత్తాంతము

1916 ⅛ క్రౌను (11)+117 పుటలు

దీనిలో 1914-15 సం.లలో ఆంధ్రదేశ గ్రంథాలయముల స్థితిని దెలుపు పట్టిక, ఆం. దే. గ్రం. ప్రతినిధుల తృతీయ మహాసభ ఉపన్యాసములు, నివేదిక, దేశ వ్యాప్తంగానున్న 210 ఆంధ్రగ్రంథాలయాల సంగ్రహ వృత్తాంతము, వివరాలు తెలియని ఇంకా 79 గ్రంథాలయాల చిరునామాలు ఉన్నవి.

## 4. గ్రంథాలయోద్యమము

కర్త: యాతగిరి లక్ష్మీవేంకటరమణ

1923 ⅛ క్రౌను (6)+78 పుటలు వెల: రు. 0-8-0

దీనిలో గ్రంథాలయోద్యమముయొక్క ప్రాశస్త్యము, వ్యాప్తి, కార్యవిధానము, చరిత్రలు క్లుప్తముగ వివరింపబడినవి. ఇతర దేశములందలి ఉద్యమములు దిఙ్మాత్ర

ముగ వర్ణింపబడినవి. గ్రంథాలయ దాతలగు బరోడామహారాజా శ్రీ శాయాజీరావు గైక్వారు. అమెరికా కోటీశ్వరుడు ఆండ్రూకార్నెజీల చిత్రములుగలవు.

## 5. మృగశీర్ష లేక వేద కాల నిర్ణయము

### కర్త: లోకమాన్య బాలగంగాధర తిలక్

### సంక్షిప్తానువాదకులు: మానికొండ సత్యనారాయణశాస్త్రి

1923 ⅛ క్రౌను 8+143+2 పుటలు+1 చిత్రము+1 పట్టిక వెల రు. 1-0-0

వేదకాలము క్రీ. పూ. 4000 సం.లకు ముందేగాని తరువాత గాదని ఈగ్రంథములో లోకమాన్యులు చక్కని ప్రమాణములద్వారా సిద్ధాంతీకరించిరి.

## 6. గ్రంథాలయ సర్వస్వము

### (సంపా.) అయ్యంకి వెంకటరమణయ్య

త్రైమాసిక పత్రిక

౧. ప్రథమ సంపుటము (4 సంచికలు)

1915-16 ¼ క్రౌను 392 పుటలు

౨. ద్వితీయ సంపుటము (3 సంచికలు)

1917-18 ¼ క్రౌను 232 పుటలు

ద్వైమాస పత్రిక

3. మూడవ సంపుటము (6 భాగములు)

1918-1919 ¼ క్రౌను 267 పుటలు

౪. నాల్గవ సంపుటము (6 భాగములు)

1919-1921 ¼ క్రౌను 216 పుటలు

౫. ఐదవ సంపుటము ( 2 భాగములు)

1921 ¼ క్రౌను 64 పుటలు

మాస పత్రిక:

౬. ఆరవ సంపుటము (9 సంచికలు)

1923-1925 (మే) ¼ క్రౌను 216 పుటలు

అనుబంధము: ౫

# ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల అధ్యక్షులు

## ౧. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు
## (1867 – 1945)

జన్మస్థలము గోదావరిజిల్లా ఖండవల్లిగ్రామం. 1886లో మెట్రిక్యులేషను పరీక్షనిచ్చినారు. గయోపాఖ్యానము మున్నగు నాటకాలు, రామచంద్ర విజయము మున్నగు నవలలు, రాజస్థాన్ కథావళి, మహాపురుషుల జీవిత చరిత్రల రచయిత. వీరేశలింగంపంతులుగారి అనుయాయులు. 'దేశమాత' వారపత్రిక నిర్వాహకులు. గ్రాంథిక భాషావాదులు. వీరి షష్టిపూర్తి సందర్భమున వీరి గ్రంథాలన్నీ 10 సంపుటాలలో వెలువడినవి. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు వీరిని 'కళాప్రపూర్ణ' బిరుదుతో సత్కరించారు. వీరి స్వీయచరిత్రమును ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘంవారు ప్రచురించారు.

## ౨. శ్రీ పానుగంటి రామారాయనింగారు
## (1886 – 1928)

జన్మస్థానము చిత్తూరుజిల్లా కాళహస్తి. 16వ యేటివరకు సంస్కృతాంధ్రములను చదువుకొన్నారు. తర్వాత ఇంగ్లీషును ప్రారంభించి 30వ యేట ఎం.ఏ. డిగ్రీని సంపాదించినారు. 1912వ సం. లో ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగ ఎన్నికైనారు. జస్టిస్‌పార్టీ మంత్రివర్గంలో మదరాసు రాష్ట్రానికి 1920 నుండి 1926 వరకు ముఖ్యమంత్రిగ నుండినారు. విద్యాసంస్కరణల పట్ల శ్రద్ధ చూపినారు. హిందూదేవాదాయ, ధర్మాదాయాల చట్టాన్ని అమలులోకి తెచ్చినారు. మదరాసులో దేశీయ వైద్య పాఠశాలను స్థాపించినారు. బ్రిటిష్ ప్రభుత్వం వీరికి దివాన్ బహద్దుర్, రాజా, సర్ బిరుదులను ప్రసాదించినది.

## ౩. శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు
## (1862 – 1938)

కృష్ణాజిల్లా ఎలకుర్రు స్వగ్రామము. హైస్కూలు విద్య బందరులోను, కాలేజీ విద్య గుంటూరు, మదరాసులలోను సాగినది. బొంబాయిలో వ్యాపారిగ జీవితమారంభమైనది. అమృతాంజనము, ఆంధ్రపత్రిక వీరి ప్రధాన సృష్టులు. 1920 వ సం. లో గాంధీమహాత్ముని సహాయనిరాకరణోద్యమంలో ప్రవేశించిరి. ఆంధ్రదేశంలో అనేక ఉద్యమాలకు చేయూత నిచ్చిరి. ఎన్నో సంస్థలకు వివిధరకములుగ సాయపడినారు.

ఆంధ్ర మహాసభ దేశోద్ధారక, విశ్వదాత బిరుదములతో వారిని సత్కరించినది. 1930వ సం.లో ఉప్పుసత్యాగ్రహములో పాల్గొని జైలుశిక్ష ననుభవించిరి. 1935 లో కేంద్రశాసన సభ్యులుగ ఎన్నికైరి. ఆంధ్రగ్రంథమాల స్థాపకులు. భారతి, ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలు, కొమర్రాజు లక్ష్మణరావుగారి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము ద్వితీయ ముద్రణము, ఆంధ్ర వాఙ్మయ సూచికల ప్రచురణ కర్తలు. భగవద్గీతను తెలుగులో స్వయముగ వ్యాఖ్యానమును రచించిన కర్మ యోగి.

## ౪. శ్రీ భూపతిరాజు వేంకటపతిరాజుగారు

## (1872 – 1943)

జన్మస్థలము విశాఖపట్నంజిల్లా భీమునిపట్నం తాలూకా రేవిడిగ్రామం. విజయనగరంలో మెట్రిక్యులేషన్ పరీక్ష పూర్తిచేసి మదరాసులో బి. ఏ., బి. ఎల్. డిగ్రీలు పుచ్చుకొని విశాఖపట్టణంలో న్యాయవాదవృత్తిని నిర్వహించినారు. సాంఘిక రాజకీయ రంగములలో ప్రవీణులు. ఆంధ్ర మహాసభ నిర్వాహకులలో ప్రముఖులు. విశాఖపట్టణ పురపాలక సంఘమునకు చిరకాల మధ్యక్షులు. అఖిల భారత క్షత్రియ మహాసభ స్థాపకులు. విశాఖపట్నంలో పంచముల (హరిజనుల) అభివృద్ధికై నెలకొల్ప బడిన సంస్థకు అధ్యక్షులు. ఫిజీదీవులలోని హైందవుల కష్టములను విచారణ చేయు టకై ప్రభుత్వం నియమించిన సంఘమున కధ్యక్షులు. మదరాసు శాసనసభకు రెండు సార్లు, ఢిల్లీశాసన సభకు రెండుసార్లు సభ్యులుగ ఎన్నికైనారు. వీరి దక్షతకు మెచ్చి ప్రభుత్వం వీరికి సి. ఐ. ఇ. బిరుదము నిచ్చినది.

## ౫. శ్రీ విక్రమదేవవర్మగారు

## (1869–1951)

నివాసము విశాఖపట్నం. మాతృభాష ఓఢ్రమైనను తెలుగును బాగాచదువుకొని దీనిలో పండితులైనారు. కవిత్వము చెప్పినారు. పండితులను, కవులను ఆదరించి పోషించినారు. జయపుర సంస్థానమునకు 61 వ యేట మహారాజులైనారు. ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు గొప్పగా ధనసహాయముచేయుటద్వారా జీవితాంతము వరకు దీనికి ప్రోఛాన్సలరుగ నుండినారు. దీని సైన్సు టెక్నాలజీ కళాశాల వీరి పేరట సాగుతున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు వీరికి డి. లిట్. పట్టము నిచ్చినారు. అనేక ప్రజా సంస్థలకు వీరు విరివిగ ధన సహాయము చేసినారు.

## ౬. శ్రీ సూరి వేంకట నరసింహశాస్త్రిగారు

## (1880 – 1933)

జన్మస్థానం కృష్ణాజిల్లా గన్నవరంతాలూకాలోని బాహుబలేంద్రునిగూడెం. బందరు నోబుల్ కళాశాలలో ఎఫ్. ఏ. పూర్తిచేసి కొంతకాలం ఉపాధ్యాయ వృత్తిలోనుండి పిమ్మట సెకండ్ గ్రేడ్ ప్లీడరుగ న్యాయవాదవృత్తి నవలంబించినారు.

మధ్యకాలంలో పట్టభద్రులై ఫస్టుగ్రేడు ప్లీడరు పరీక్షనుకూడ ఇచ్చినారు. 1912 నుండి గ్రంథాలయ సేవావ్రతదీక్షనుపూని జీవితాంతంవరకు దీని సేవలు చేసినారు. విజయవాడలోని శ్రీ రామమోహన ధర్మ పుస్తక భాండాగారమునకు ప్రథమాధ్యక్షులు. ప్రథమ ఆంధ్రదేశ గ్రంథభాండాగార మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులు. 1919 వ సం.లో మదరాసులో జరిగిన ప్రథమ అఖిల భారత గ్రంథాలయ మహాసభ నిర్వహణలో భాగస్వాములు. దీని ద్వారా యేర్పడిన అఖిలభారత పౌర గ్రంథాలయ సంఘములో ప్రముఖ కార్యకర్తలు. పుదుక్కోటరాజ్య గ్రంథాలయ ప్రథమ మహాసభకు, బెల్గాంలో జరిగిన ప్రథమ కర్నాటరాష్ట్ర గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులు. గ్రంథాలయ సర్వస్వములోను, ఇతర పత్రికలలోను గ్రంథాలయోద్యమమును గూర్చిన వ్యాసముల ద్వారా గ్రంథాలయ విజ్ఞాన వ్యాప్తికి చాల తోడ్పడినారు. ఆంగ్లంలో "పౌర గ్రంథాలయాలు : ఇంట, బయట" (Public Libraries at Home and Abroad) అను చిరు పొత్తమును వ్రాసినారు. 'ఆంధ్రుల గ్రంథాలయోద్యమ సిద్ధాంతము' అనువ్యాసము వీరి రచనలలో విశిష్టమైనది. మహాత్మగాంధి నిర్మాణ కార్యక్రమము పట్ల వీరికి మిక్కిలి మక్కువ. గ్రంథాలయోద్యమంతోపాటు సహకారోద్యమంలోకూడ వీరు పాల్గొని పని చేసినారు. ఆగిరిపల్లి వేద శాస్త్ర పాఠశాల సంస్థాపకులు; 1903 నుండి జీవితాంతం వరకు దీని ట్రస్టీగ నుండినారు.

## ౭. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు
## (1872 – 1939)

జన్మస్థానం పశ్చిమ గోదావరిజిల్లా నరసాపురం తాలూకాలోని పెనుమదం గ్రామం. తణుకులో విద్యాభ్యాసంచేసి సంస్కృతాంధ్రములలో పండితులైనారు. శ్రీ వీరేశలింగంగారివలెనే సంఘ సంస్కర్త, సారస్వత సేవకుడు, దేశోపకారి. విబుధరంజని, ఆంధ్రకేసరి పత్రికల సంపాదకుడు. ఆంధ్రుల చరిత్రను మొదటగ 3 భాగములుగ రచించి ఆంధ్ర మహాసభవారిచే 'చరిత్ర చతురానన' బిరుదమును పొందినారు. తదుపరి కాకతీయాంధ్ర రాజ యుగ చరిత్రమును 1936 లో ప్రచురించినారు. వీరి ఇతర రచనలు జీర్ణ కర్ణాట రాజ్య చరిత్రము, కర్ణసామ్రాజ్యము, తిక్కన సోమయాజి, అళియరామరాయలు, భారత వీరుల చరిత్రము, తిమ్మరుసు, శ్రీనాథకవి, కల్లూరి వేంకటరామశాస్త్రులవారి జీవిత చరిత్రము.

## ౮. శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు

జన్మస్థానము కృష్ణాజిల్లా నందిగామ తాలూకా పెనుగంచిప్రోలు. 1906 వరకు గుంటూరులో విద్య నభ్యసించినారు. 1911 నుండి 1916 వరకు సీమలో చదివి ఎడింబరో విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పట్టమును సంపాదించినారు. 1917–18 వ సం. లో రాజమహేంద్రవరములోని ప్రభుత్వంవారి బోధనాభ్యసన కళాశాలలోను

1918–19 వ సం. లో బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాలలోను అధ్యాపకులుగ పనిచేసినారు. 1919 లో చీరాల - పేరాల సమీపమున శ్రీమదాంధ్ర విద్యాపీఠ గోష్ఠిని నెలకొల్పినారు. మహాత్మగాంధి అసహాయోద్యమములో చేరి ఒక యేడాది పాటు కారాగారశిక్షకు గురియైనారు. ఈయన పండితుడు, కవి, గాయకుడు, విమర్శకుడు, రాజకీయవేత్త, మహావక్త, మత ప్రవక్త, శ్రీరామభక్తుడు. ఆనందకుమార స్వామితోకలసి 'అభినయ దర్పణము'ను సంస్కృతమునుండి ఆంగ్లములోని కనువదించినారు. ఆంధ్రదేశ ప్రజలు వీరిని 'ఆంధ్రరత్న' బిరుదముతో సత్కరించినారు.

## ౯. శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారు
## (1869 - 1955)

జననం కృష్ణాజిల్లా తిరువూరుతాలూకా ముష్టికుంట్ల గ్రామంలో. ఏలూరులో పాతకాలపు మిడిల్ పరీక్షవరకు చదివినారు. 1900 సం.లో యం. యస్. యం. రైల్వేలో 12 సంవత్సరా లుద్యోగం చేసి రాజీనామా ఇచ్చి తదుపరి కొంతకాలం మదరాసు హార్బరు కంట్రాక్టరుగ నుండినారు. 1915 లో కాంగ్రెసులోచేరి జీవితాంతంవరకు దీని కార్యక్రమంలో పాల్గొన్నారు. 1930, 1932, 1940 సం.లలో ప్రభుత్వ నిర్బంధానికి గురియైనారు. 1924 నుండి వరుసగా 25 సంవత్సరాలు మదరాసు కార్పొరేషన్ సభ్యులు. 1936 - 40 సంవత్సరాలలో మదరాసు రాష్ట్రశాసన సభకు, 1943 - 46 సం.లలో ఢిల్లీలోని కేంద్రశాసనసభకు సభ్యులు. మాతృభాష తెలుగుతోపాటు ఇంగ్లీషు, సంస్కృతము, ఉర్దూ, హిందీలలో మంచి పరిచయము, తమిళ, కన్నడ, మళయాళ భాషలలో ప్రవేశము కలదు. నాటకాలలోనే గాక ఆంధ్రోద్యమము, గ్రంథాలయోద్యమాలలోకూడ ముఖ్యపాత్రధారులు.

## ౧౦. శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారు
## (1873 - 1944)

జననం కృష్ణాజిల్లాలో. ఉన్నత విద్యాభ్యాసం మదరాసులోని క్రైస్తవకళాశాల, న్యాయ కళాశాల. 1899 నుండి 1911 వరకు బందరులో న్యాయవాద వృత్తి. 1907 నుండి 1908 వరకు కృష్ణాపత్రిక సంపాదకులు. 1911 నుండి మదరాసులో న్యాయవాది; గొప్ప న్యాయశాస్త్ర పండితుడు. ప్రముఖ జాతీయవాది. మదరాసు యూనివర్సిటీ సెనెటులోను, అకడమిక్ కౌన్సిలులోను సభ్యుడు; ఎం. ఎల్. తరగతికి పరీక్షకుడు. 1925, 1929 సం. లలో స్టేట్ కౌన్సిలుకు సభ్యుడుగ ఎన్నికయ్యె 1930 లో కాంగ్రెసు ఆదేశానుసారము రాజీనామా ఇచ్చినారు. సహకార విషయములలో ప్రామాణికుడుగ పేరు పొందినారు. అఖిలభారత మదరాసు రాష్ట్రీయ సహకార సంస్థలు కొన్నింటి కధ్యక్షుడుగ నుండినారు. దక్షిణ భారత కో ఆపరేటివ్ భీమా కంపెనీ స్థాపకులు. 'ఇంటర్ నేషనల్ కో ఆపరేటివ్ అలయన్స్' సభ్యులు. 1934 లో లండనులో జరిగిన అంతర్జాతీయ సహకార సమ్మేళనములో భారతదేశ ప్రతినిధి.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము

# స్వర్ణోత్సవ ప్రచురణలు

## ౧. గ్రంథాలయ ప్రగతి - మొదటిభాగము

దీనిలో 1914 - 1926 సంవత్సరాల లోపల జరిగిన మొదటి 10 ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల అధ్యక్షోపన్యాసములు, ముఖ్యతీర్మానములతోపాటు దీని అనుబంధములలో ఈ మహాసభల సంగ్రహ వృత్తాంతములు, ఆదిలో ఏర్పడిన సంఘ నియమ నిబంధనలు, ఆ కాలములో సంఘ ప్రధాన నిర్వాహకులుగ నున్నవారియు, సంఘ పక్షమున వెలువడిన ప్రచురణలయు వివరములు, ఇందు ప్రచురించిన ఉపన్యాసములను చేసిన పెద్దల పరిచయము గలవు.

⅛ డెమ్మీ xvi + 189 పుటలు వెల: సాదా ప్రతి రు. 4 . 00
బైండు ప్రతి రు. 5 . 00

## ౨. గ్రంథాలయ ప్రగతి - రెండవభాగము

దీనిలో 1927 - 1942 సంవత్సరముల మధ్య జరిగిన ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభల అధ్యక్షోపన్యాసములు వగైరా చేర్చబడును.

## ౩. గ్రంథాలయ ప్రగతి - మూడవభాగము

దీనిలో ఉద్యమప్రారంభమునుండి నేటివరకు ఆంధ్రదేశము లోని వివిధప్రాంతములలోజరిగిన కొన్ని ప్రాంతీయ, జిల్లా, తాలూకా గ్రంథాలయ మహాసభల అధ్యక్షోపన్యాసాదులు చేర్చబడును.

## ౪. ఆంధ్ర గ్రంథాలయోద్యమ చరిత్ర

ఆంధ్రదేశములోను, రాష్ట్రేతర, ఖండాంతర ఆంధ్రప్రాంతములలోను నడచిన గ్రంథాలయోద్యమ వికాసమును తెలుపు వివిధ విషయములు దీనిలో వివరింపబడును.

## ౫. స్వర్ణోత్సవ సంచిక

1964 ఏప్రిల్ 10 వ తేదీనాటికి దేశదేశాలలోని ప్రముఖుల సందేశాలతో, గ్రంథాలయాలు, వయోజన విద్య, ఆంధ్రాభ్యుదయము మున్నగు వివిధ విషయాలను గూర్చిన బహుళరచనలతో, ఆంధ్రావనిలోని గ్రంథాలయాలయు, గ్రంథాలయ కార్యకర్తలయు పరిచయాలతో, పై విషయాలకు సంబంధించిన చిత్రములతో నిది నింపబడును